# జగత్కథ

(హె [illegible] వెల్సుగారి

(గ్రంథమునకు అనువాదము)

డాక్టర్ సర్ ఎస్ రాధాకృష్ణగారి
ఉపోద్ఘాతముతో

కొమాండూరి శఠకోపాచార్యులు,
ఎం ఏ, బి ఎల్

## FOREWORD

Mr K Satakopachary M A B L, of Cocanada is to be heartily congratulated on his excellent Telugu translation of H G Wells' **History of the World** with copious notes and a valuable introduction which are intended to make the work interesting to the Telugu reader

In modern democracies where the capacity for reading has far outrun the capacity for thinking every one who endeavours to 'educate our masters' deserves our sympathy Mr H G Wells is one of the greatest teachers of our times His book on the **History of the World** was for years one of the best sellers He has written it not as a scholar, not as an Englishman with faith in the mission of his own country to give a lead to the world, but as a humanist, a citizen of the world delighting in the varied manifestations of the human mind and able to discover the common stuff underlying the diversity of people At a time when nations are organising immorality as an instrument of political power, and behaving as victims of the herd instinct and traitors to humanity, it is good to be reminded of our membership of the human community [illegible] ions to the human race Mr Wells traces the general transformation of the structure of human society which, with many variations of method to suit time and

place is now trying to substitute interdependence for independence in political and economic, cultural and religious relations

History is significant change It is the task of the historian to discern the significance the meaning, the pressure of eternity on the events of time For Wells, the meaning of history is the achievement of a world state an international community, and his work is a contribution to the development of a world conscience, a world soul

It is written in clear ringing prose which bears on every page evidence of the author's learning and [illegible]native sensibility, and endless command over facts and opinions The Telugu public are immensely indebted to Mr K Satakopachary for giving them this great work

**S Radhakrishna**

# ఉపోద్ఘాతము.

హెచ్ జి వెల్సుగారి ప్రపంచ చరిత్రకు ఆంధ్రమున మంచియనువాదమును విపులమగు టిప్పణులను ప్రశస్తమగు భూమికనుజేర్చి, ఆంధ్రపాఠకులకు రంజకముగ, రచించిన కో. శరకోపాచార్యులు ఎం ఎ, బి యల్ హృదయపూర్వకముగ నభినందనీయులు

ఆధునిక ప్రజాసంస్థలందు, పరవశక్తియంత విరివిగా ఆలోచనశక్తి వ్యాపించుటలేదు అట్టితరి మన యజమానులగు ప్రజలకుజ్ఞానముగల్గింప యత్నించువారియెడ సానుభూతి జూపనగు హెచ్ జి వెల్సుగారు నేటిబోధకశ్రేష్ఠులలో నొకరు 'వారి ప్రపంచచరిత్ర' చాలయేండ్లు మిక్కుటముగ అమ్మిన గ్రంథము దానినాయన పాండిత్యప్రదర్శనకును తనదేశమే ప్రపంచము కంతటికిని మార్గదర్శకమను ఆంగ్లేయ ధోరణితోనుగాక, విశ్వజనీనభావముతో, మానవచిత్తవృత్తిలోని వికాసభేదముల కానందించుచు, ఆయావివిధజాతుల సామాన్యసత్వమును గనిపెట్టగల జగత్ కుటుంబిగనే వ్రాసినారు. ఆయాజాతీయులు అవినీతిని తమరాజకీయబలమునకు సాధనముగా నేర్పర్చుచు, గతానుగతిక సూత్రమునమ్రగ్గి, మానవధర్మముకు విద్రోహులై చరించుచున్న యీకాలమున, మానవసంఘమందు మనసభ్యతను మానవజాతియెడ

మనకుగల బాధ్యతలను జ్ఞప్తికి తెచ్చుట మంచిది. దేశకాలోచితముగ వివిధపద్ధతులు మారును. రాజకీయ, ఆర్థిక, వైజ్ఞానిక, ధార్మిక, సంబంధములందు ప్రత్యేకత్వమును తొలగింప జేసి దానికిబదులు పరస్పరాధారమునే స్థాపించుటకు మానవ సంఘ మిప్పుడు యత్నించుచున్నది. దాని నిర్మాణమునకగు సాధారణ పరిణామమును వెల్సుగారు బాగుగ వివరించినారు.

విశిష్టపరిణామమే ఇతిహాసము. తద్విశేషమును, సదర్థమున, కాలపరిమాణమందు శాశ్వతత్వచిహ్నమును, గమనించుటయే చారిత్రకుని కర్తవ్యము. ప్రపంచమంతట నొకే ప్రజారాజ్యనిర్మాణమును, అంతర్జాతీయ సంఘస్థాపనయునే ఇతిహాసభావమని వెల్సుగారియూహ. విశ్వజనీన భావమును, జగదాత్మకత్వమును, వ్యాప్తినొందించుట కాయన గ్రంథము మిగుల సహకారియైనది.

ఈ గ్రంథము స్వచ్ఛమగు ఉజ్జ్వలశైలిని వ్రాయబడినది. గ్రంథకర్తపాండిత్యము, భావవైశద్యము, విషయముల యెడ అభిప్రాయముల యెడ వీరికిగల అనంతసామర్థ్యమును, ఇందలి ప్రతిపుటయు వెల్లడించుచున్నది. ఇట్టియుద్గ్రంథమును [illegible] [illegible]ంపజేసినందుకు శతకోపాచార్యులకు ఆంధ్రు[illegible] మిక్కిలి కృతజ్ఞులు.

సర్వేపల్లి రాధాకృష్ణన్.

# విషయసూచిక.

అధ్యాయములు — పుట

అధ్యాయము పుట.

# చిత్రపటములు.

# సంజ్ఞలసూచిక.

| | |
|---|---|
| ఈ. ఉ | ఈశావాస్యోపనిషత్తు |
| ఋ సం | ఋగ్వేదసంహిత |
| ఐ ఉ | ఐతరేయోపనిషత్తు |
| క ఉ | కఠోపనిషత్తు |
| కే ఉ | కేనోపనిషత్తు |
| ఛాం ఉ | ఛాందోగ్యోపనిషత్తు |
| తై ఉ | తైత్తిరీయోపనిషత్తు |
| ధ ప | ధమ్మపదం |
| బృ ఉ. | బృహదారణ్యకోపనిషత్తు |
| భ. గీ | భగవద్గీత |
| మ. స్మృ | మనుస్మృతి |
| శ్వే ఉ | శ్వేతాశ్వతరోపనిషత్తు |

# అనువాదకుని భూమిక.

"పృథ్వీరేణురణుః, పయాంసికణికాః, ఫల్గుస్స్ఫులింగోలఘుః। తేజో, నిశ్వసనంమరుత్ తనుతరం, రంధ్రంసుసూక్ష్మంనభః, క్షుద్రారుద్రపితామహ ప్రభృతయః, కీటాస్సమస్తాస్సురాః। దృష్టేయత్ర, సతావకోవిజయతే భూమావధూతావధిః ॥"

("నీమహోవిభూతి అవధిలేనిది దానితో బోల్చుచో భూమియంతయు జిన్న నలుసువంటిది, ఈసింధువులు తుంపరలు, ప్రచండతేజము చిన్న మిణుగురుకాంతి, వాయుమండలమొకచిన్న నిట్టూర్పు, అంతరిక్షమతి సూక్ష్మరంధ్రము ")

క్రీ. శ. 7 వ శతాబ్దిని తిరువాన్కూరు పాలకుక్షేత్రము కులశేఖరాళ్వారు ఈశ్వరుని ముద్దేశించి పంచభూతాదుల నిట్లు వర్ణించెను. ఇది కవిచమత్కృతిమాత్రమనియు, ముకుంద మహాత్మ్యవర్ణనకై కవిప్రియమగు అతిశయోక్తినే ఆయన వాడెననియు, కొందరందురు. కాని అదివరికాదు సూర్యుడు భూమికన్న చాలపెద్ద. రాత్రివేళ మిణుకుమినుకుమను నక్షత్రములు యథార్థముగామనభూమికన్న కొన్నిలక్షలరెట్లుపెద్దవి అందుగొన్ని సూర్యునికన్నను పెద్దవి, ఎక్కువ తేజోవంతములు. అవి అన్నియు పరస్పర సంఘర్షములేకుండ మహాకాశములో కోట్లకొలది మైళ్ల ఎడమున, ఏదో మహాశక్తిచే

నియమముగ అమేయరీతి నాకర్షితములై, తమతమ కక్ష
లందు విపరీతవేగముతో బోవుచున్నవని జ్యోతిశ్శాస్త్రజ్ఞు
లిటీవల పరిశోధనలచే గనిపెట్టిరి, అవి మనకు సూర్యునికన్న
నింకను కోట్లకొలదిమైళ్ళదూరమందున్నవి ఇట్లు మనచర్మ
చక్షువు కగపడునవేగాక, ఇంకను లక్షలకొలది మహాగోళము
లను బలీయమగు దూరదర్శిని యంత్రముల సాయమున
చూడవచ్చును, ఇవిగాక తేజోయుతమగు వల్బునిపదార్థసంచ
యములు, ధూమకేతువులు, మున్నగు విచిత్రవస్తువు లప్పు
డప్పుడాకాశమందగపడును, ప్రతిరాత్రియు మెరయుచు
తటాలున పోవుచుండు ఉల్కలకు లెక్కయేలేదు గొప్ప
దూరదర్శినియంత్రములకును అందక, ఆగోళముల కింకను
చాల దూరమందు గూడనెన్నియో మహాలోకములున్నట్లు,
కొందఱు ధీమంతులునిరూపించుచున్నారు * అట్టిచో పైల్లోక
వర్ణన కేవలస్వభావోక్తియే!

ఇట్టి మహావిశ్వములో, దూరగ్రహముల మాట
యటుండ, మనకతిసమీపములగు చంద్రాంగారకుల స్థితియు
[illegible]లకింకను స్పష్టముగ తెలియదు విజ్ఞానసహాయమున
[illegible] అందలి రహస్యములు మనకు గోచరించుకొల
[illegible], ఈశమహాత్మ్యము, మన అల్పజ్ఞత, మతగ్రం

* [illegible] పుటల జూడుడు

ధములందు వర్ణింపబడిన వానికన్నను ఎక్కువ బాగుగ మనకు తెలియుచున్నవి

మహావిశ్వమెంత విశాలమో సరిగా తెలియనట్లే, మన భూమిలో అతిసూక్ష్మమగు ప్రతిపరమాణువు నిర్మాణ రహస్యము, అందిమిడియున్న ఎలక్ట్రిను ప్రోటను మున్నగు వస్తువుల స్వరూపము, వాని నిప్పటికిని దుర్భేద్యముగ బంధించిన శక్తితత్వమును వైజ్ఞానికుల కింకను పూర్తిగ తెలియవు విశ్వమంతటను, ప్రతిపరమాణు లేశములోగూడ, ఏదోయద్భుతశక్తి వ్యాపించియున్నట్లు మాత్రమిటీవలి పరిశోధనలచే స్పష్టమైనది

మనభూమి పూర్వస్థితియు ఇట్లేయున్నది, అది గూఢము, అతివిచిత్రము భూమి ఎప్పుడు, ఎందుండి, ఎట్లు నేర్పడెను? అందు జీవకోటి యెట్లారంభించి, వికసించెను? ఏయేయుగములందేయేజాతి ప్రాణులుండెను? వీనిక్రమ పరిణామమున నరజాతి యెప్పుడు జనించెను, ఎట్టిమార్పుల [illegible]ందెను? ఆయావివిధమతములు, జాతిభేదములు, భిన్ననా[illegible]తలు, భిన్నభాషాదులును, ఎప్పుడు యెట్లేర్పడెను? [illegible]్యానముల భావమేమి? విజ్ఞానతత్వజ్ఞులు దీక్షతో పరి[illegible] ఈసమస్యలు తేటపడి, కొంత తెలియుచున్నవి ఇప్పటికి తెలిసినంతవరకు మన జగత్తు పూర్వకథ నొక

రీతిగా వైజ్ఞానికులు చిత్రించినారు ఇంకను తీవ్రపరిశోధనలు జరిగి, చాలప్రకృతి రహస్యములు వివరములు ముందు తెలియవలసియున్నవి

మన ప్రపంచ మూరువేల యేండ్లక్రిందనే హఠాత్తుగనేర్పడెనని పాశ్చాత్యులు పూర్వము తలచిరి, భారతీయులెన్నడు నట్లు భావించలేదు మనప్రాచీనుల భావమున, కాలమనాద్యనంతము ఇప్పటికి లక్షలకొలది యేండ్ల పరిమితిగల మహాయుగములు, మన్వంతరములు, కల్పములుగూడ, ఎన్నియోగడచినవి స్థలవిషయమునను మన ప్రాచీనులు మనమున్న మహాఖండము (జంబూద్వీపము) నెరింగిరి, ఇప్పటి భారతదేశముకు చుట్టుపట్లనున్న గాంధారాదులు, హిమాలయప్రాంతములు, బర్మా ఆగ్నేయపార్శ్వ ద్వీపములు, ఇత్యాదులప్పటి భారతవర్షమున జేరియుండెనని తోచును. ప్రతివైదికకార్యముకు ముందు సంకల్పమున ప్రస్తుత స్థలకాలనిర్దేశము చేయుట మనలో చిరకాలమునుండి ఆచారము * అందుచే లోకపు దేశకాలవైశాల్యము సృష్టి మహా[illegible]గూడ మనకు జ్ఞప్తికి దేబడును

---

* [illegible] శ్వేతవరాహకల్పే, వైవస్వతమన్వంతరే, అష్టావింశతితమే, మహాయుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భారతవరే. భరతఖండే, [illegible] ..., మేరో[illegible]గ్భాగే..

అనేకయుగములక్రింద అవ్యక్తజీవములగు జడముం నుండి ప్రాణులు అత్యల్పముగను, తరువాత మత్స్యాది జలచరములుగను, మొదలిడెను, అంత నొక్కొక్క యుగము గడచి, క్రొత్త పరిస్థితులు కలిగి, ఉభయచరములగు కూర్మసర్పాదులు, అంతట అండజములు పిండములునగు స్తనులు, పిదప మహామృగములు, ఆపైన కొంతమృగములను కొంత నరులను బోలు జాతులు, తుదకు నరులును, కలిగిరి నరులు మొదట సుమారు మూడుజాతులుగనే, సంచారులై, వ్యాపించిరి, ముందు శిలాలోహ వస్తువుల వాడుకను, పిదప వేటను, విల్లంబుల వాడుకను, క్రమముగా వ్యవసాయాదులను, నేర్చిరి, అటుపిమ్మటనే జనులలో మంచి జ్ఞానముకలిగెను ఇదియంతయు ప్రకృతి శాస్త్రజ్ఞులు నిరూపించిచేసిన సిద్ధాంతము ఈ జీవవికాసపు ఆయాయుగములకు వైజ్ఞానికులు వేరువేరు పేరుల బెట్టినారు ఆప్రకారము ఆయాయుగముల పట్టీని, అప్పటి క్రమపరిణామము దెల్పు జీవపరిణామవృక్షమును, ఇందు గనపర్చినాను

---

# ఆయా యుగముల పట్టిక

## (భూమికాలము సుమారు 200 కోట్ల యేండ్లు)

| ఎన్ని యేండ్లక్రింద | యుగము | అప్పటి భూలక్షణము ముఖ్యజీవులు. |
| --- | --- | --- |
| 200-180 కోట్లు | ఆరంభయుగము | (భూగోళము జలము ఏర్పడెను) |
| 180-80 కోట్లు | అజీవయుగము | (అప్పటికి ప్రాణులు లేవేమో!) |
| 50 కోట్లు | పురాణజీవ యుగము | లోతులేని సముద్రములు |
| | 1 సిల్యూరియను | నాచు, కీటక్రిములు |
| | 2 డెవోనియను | సముద్రపుచేపలు (మత్స్యయుగము) |
| 20 కోట్లు | మధ్యజీవ యుగము | మొదటి నేలమొక్కలు కప్పలు, బల్లులు, తాబేళ్లు (కూర్మయుగము) |
| | 1 ఉభయ చరములు | (కర్బనకరములు) |
| 8 కోట్లు | 2 సరీసృపములు | తుప్పలు తాళ్లు పాములు మొసళ్లు డనోసార్లు గింజలచెట్లు |
| 4 కోట్లు | నవజీవయుగము | మహాగిరులుపక్షులు (వరాహయుగము) సస్యలు, గడ్డి అడవిచెట్లు |
| | ఆధునికయుగము | 1 నారసింహ యుగము |
| 2½ లక్షలు | 1-2 హిమయుగము | గచ్ఛకెరవానరులు చింపాంజీ, గోరిల్లా, హీడిల్బర్గు, ఉదయనరుడు |
| 1 లక్ష | II 2-3 ,, | నియాండర్తలరు |
| 50 వేలు | III 3-4 ,, | గుహావాసులు, రోడీసియను |
| | నరయుగము | (క్రొమాగ్నను గ్రిమాల్టీలు వేట) |
| | పూర్వశిలాకాలం | వ్యవసాయారంభము జాతరలు, |
| [illegible] | నవశిలా ,, | చెక్కని ఘనిమట్లు, (గోధుమవర్ణులు) |
| 15 వేలు | సూక్ష్మశిలా ,, | సుమేరియను ఆదులు నేటివరకు |
| 10-8 వేలు | చారిత్రక ,, | నాగరికజనులు |

ఈయంశములగూర్చి మనప్రాచీనుల భావముల గొం తగమనింతము అవ్యక్తమగు సత్పదార్థమునుండియే వ్యక్తు లన్నియు అనుకూలతేజఃప్రసార కాలమున గలిగెనని*, ఆప్రాణులు జలమందే ఆరంభించెననిϯ, ఆ జీవకారణమగు మహాశక్తి అణువయ్యు విశ్వవ్యాప్తియై చైతన్యమిచ్చు ననియు‡, కాని దానియథార్థతత్త్వము మనకుదెలియదని యును§ మనపూర్వుల భావము

ఇట్లు సృష్టిని నియమించు పరమాత్మశక్తి సర్వాంత ర్యామి సర్వభూతసమము విశ్వరూపమునై యుండును¶ అయాయుగములందు లోకోద్ధరణకై భగవంతుడవతార

---

*అవ్యక్తాత్ వ్యక్తయస్సర్వే ప్రభవంత్యహరాగమే (భ గీ 8 18)

ϯసఇమాల్లోకా నసృజ తాంభోమరీచీః అథస్తాత్ ఆపః ఆప ఏవపురమం సమృద్ధ్యత్వా మర్చ్యకత్ (ఐ ఉ 1-1-8)

అపఏవ ససర్జాదౌ, తాసు వీర్యమథాసృజత్ (మ స్మృ 1-8)

‡అణోరణీయాన్ మహతో మహీయాన్ ఆత్మాఽస్య జంతో ర్నిహితో గుహాయాం (క ఉ 1-2-20)

నిత్యోనిత్యానాం చేతనశ్చేతనానా మేకో బహూనాం (క ఉ 2-5-13)

§యస్యామతం తస్యమతం, మతంయస్యన వేదసః అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాతమవిజానతాం (కే ఉ 2-3)

¶సర్వతఃపాణిపాదంతత్ (శ్వే ఉ 3-16)

ఐతదాత్మ్యమిదం సర్వం (ఛాం ఉ 6-8)

దివిసూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా, యదిభా స్సదృశీ సాస్యాత్ భాసస్తస్య మహాత్మనః (భ గీ 11-12)

మొత్తైనని, అందు దశావతారములు ముఖ్యములనియు, మన పూర్వుల భావము వానిక్రమమును గమనించినచో, ప్రారంభదశయందు అనగా వైజ్ఞానికుల పురాణజీవయుగమున కేవల జలచరమగు మత్స్యముగను, తరువాత (మధ్యజీవయుగమున) ఉభయచరమగు కూర్మముగను, అంతట (నవజీవయుగమున) సస్తనము శిశుపోషకము పిండజము అగు వరాహముగను, పిమ్మట (ఆధునికయుగపు మొదటి రెండుహిమమధ్యయుగములందు) కొంత తిర్యగ్జంతు స్వభావము కొంత నరలక్షణములుగల నరసింహాకారముగను, ఈశ్వరాంశ మీజగత్తునం దవతరించెనని తేలును తరువాతనే నరావతారములుగల్గెను. ఆవరుసలోను విశేషముకలదు ఆదిమనరులు మూడుజాతులు (శ్వేతహారితజాతి, గోధుమవర్ణము, నీలవర్ణము) అగుటను, వారుప్రాచ్యోత్తర దక్షిణ పశ్చిమదిశలను జగత్తుఅంతటను వ్యాపించుటను, ఆదిమనరులు సంచారిజాతులుగనుండుటను, వామనునిత్రివిక్రమత్వము త్రిలోకాక్రమణము సూచించును, (పూర్వశిలాకాలము) తరువాత పరశురాముడు కందమూలసంపాదకమగు లోహోపకరణ మొందుట, శ్రీరాముడు కోదండపాణియై వేటజీవనము కవసరమగు విల్లంబులతో నుండుట, ఆతరువాత వచ్చిన బలరాముడు వ్యవసాయచిహ్నమగు నాగలిని ధరించి గోపాలసోద

రుడగుట (నవశిలాకాలము), ఆపిమ్మటనే జ్ఞానవికాసచిహ్న
ముగ బుద్ధుడవతరించుట, నరజాతికిట్లు క్రమవికాసము గల్గెనని
సూచించును, ముందు మనజగత్తుకింకను గొప్పపరిణామము
కలుగనున్నదని భావికల్క్యవతారము సూచింపవచ్చును
ఇట్లీ క్రమము వైజ్ఞానికసిద్ధాంతపు క్రమమునకు సుమారుగ
సరిపోవుట కేవలము కాకతాళీయ మనవీలులేదు

ఇట్టీయుగములద్వారా జరిగిన జీవవికాసము, పరిణా
మము భూమిపై మనయందరిలోగూడ లీనమై ప్రత్యక్షమగు
చున్నవి ప్రతిప్రాణియు గర్భస్థదశలోనో అండదశలోనో
తనజాతికన్న నీచములు పూర్వయుగపువి అగు జీవులస్వరూప
మును ముందుగా పొందియే, తరువాత క్రమముగా తనజాతి
జంతువుగా పరిణమించును ఇట్లు ప్రతిస్తనజంతువును పిండ
దశలో మత్స్యాకృతిని అంతట కూర్మసరీసృపాదిరూపములను
పొందియే తనజాతి స్వరూపమొందునని వైజ్ఞానికులు గని
పెట్టిరి ఇట్లే మానవప్రాణియు తల్లిగర్భమున పిండముగనున్న
మొదటినెలలలో ఆరంభమున ద్రవరూపముగా సూక్ష్మజీవి
గను, అంతట మత్స్యాకారముగను, ఏర్పడును, తరువాత
అందు పరిణామము కలుగుచురాగా, చేపతిత్తులు మున్నగు
[illegible] నస్తనాకృతినొంది, ఆపైన మేధాశక్తి బల
పడి, [illegible] ఒకవిధమగు వానరాకారము ఏర్పడును ఇట్లు
[illegible] పరిణామము కలిగినమీదటనే, నరరూపము

గిల్లును * నరశిశువుజనించినతరువాత గూడ మొదట పరుండియేయుండి, తరువాత కొద్దిగాను క్రమముగాను కూర్మవరాహాదులవలె ప్రాకుచు, అవ్యక్తధ్వనుల జేయుచు, ఆతరువాత నే మాటల నేర్చి, ముందుగా కోతులవలె కొంచెముగలేచి, అడుగులు వేయనేర్చి, ఆపిమ్మట నరులవలె మాటాడుచు, నడుచుచుండును మనభూభారమంతయు, (నరులో దేవతలో మోయక), మహామీనము ఆదిశేషుడు ఆదికూర్మము ఆది వరాహము దిగ్గజములు నే మోయుచున్న వనుటలో గూడ, యుగయుగములుగాను ప్రతినరవ్యక్తిలోను ఉండుజీవుల కాధారమట్లె యేర్పడెనని ఆనరునసే ప్రాణులు వృద్ధియయ్యె ననిగూడ, సూచితము కావచ్చును

ఆయాజాతులనరులు వివిధదేశములకు వ్యాపించి వేరువేరు దేశీయులైరి, వారిలో చాలమంది అసలు ఏకజాతీయులే ఏకప్రాంతీయులే, ఈసంగతి వారియంగనిర్మాణమువల్ల నేగాక, వారు మాట్లాడు భాషలసంబంధమువల్లను స్పష్టము మన ఆర్యావర్తభాషలును యూరపులోని ఇంగ్లీషు ఫ్రెంచి [illegible]ను మున్నగునవియు సన్నిహితములు, అసలు ఒకే భాష [illegible] వెలువడెను, అని భాషాశాస్త్రజ్ఞులు నిర్ణయించినారు. [illegible]ావిడభాషలలోను పరస్పరసంబంధముకలదు వాని పర[illegible]ంబంధపురీతి ఇందు చేర్చిన పట్టికచే తెలియును.

---

* ముందు ౪౪ వ పుట టిప్పణిజూడుడు

# ముఖ్యమగు ఆర్యభాషలు.



# ముఖ్యద్రావిడభాషలు.




ముఖ్య సెమిటిక శాఖవి హిబ్రూ, అరబ్బీ భాషలు
ముఖ్య మంగోలు ,, తుర్కి, చీనా, జపాను ,,

(మూలార్యభాష మూలద్రావిడము పదిపంద్రెండు వేల యేండ్లపూర్వము వాడుకలో నుండియుండును) ఈమూలార్యభాషకు, మూలద్రావిడమునకు, సెమిటిక్ మంగోలియను మూలభాషలకును, అంతకుపూర్వము పరస్పర సంబంధముండెనో, లేదో, నిర్ణయింప భాషాశాస్త్రజ్ఞులింకను చర్చల జరుపుచున్నారు

మనప్రాచీనభారతార్యులును అప్పటి ద్రావిడులును గూడ చాల నాగరికులై యితరదేశములతో దూరవ్యాపారముచేయుచుండినట్లునిదర్శనములుగలవు పురాతనరాజులు ఋషులు త్రివిష్టపాదులకు వెళ్ళి మరల భారతదేశము చేరుచుండినట్లు పూర్వగ్రంథములందు తెల్పబడెను, క్రీ పూ 6, శతాబ్దులందు భారతీయవిద్వాంసులు శిల్పులు పారసీక రాజ్యమందుండినట్లును, అశోకవర్ధనుని కాలమున (క్రీ పూ ౩ వ శతాబ్దిలో) అలెగ్జాంద్రియా సిరియా మున్నగు ప్రాంతములందు శ్యామసింహళాది ప్రాచ్యదేశములందుగూడ బౌద్ధతత్వజ్ఞులు శిల్పులుహిందూమతములను భారతీయశిల్పకళాదులను వ్యాపింపజేసినట్లును, శిలాచిత్రాది స్పష్టనిదర్శనములుగలవు. (యూదదేశమున వసుబోధించిన క్రైస్తవమత [illegible] హిందూబౌద్ధసిద్ధాంతము లాధారములని కొందరు [illegible] విమర్శకుల అభిప్రాయము) తరువాత

కనిష్క-శాతకర్ణి గుప్తరాజాదుల కాలమందును భారతీయులు తత్వశాస్త్ర భౌతిక విజ్ఞానములందును శిల్పకళాపరిశ్రమలందును గూడ ప్రవీణులై, వానిని దేశాంతరములకును వ్యాపింపజేసినారు, అందుకు ఆ ప్రాంతములందు అనేకనిదర్శనములుగలవు * ఇట్లితర దేశీయులకన్న హెచ్చుగశక్తివిజ్ఞానయుతులైనను, ప్రాచీన భారతీయులు, ఇప్పటి కొందరివలె స్వార్థపరులుగాక, తమవిజ్ఞానము నంతటను వెదజల్లి 'లోకాస్సమస్తా స్సుఖినోభవంతు' అను విశ్వజనీన భావమునే గలిగియుండిరి అప్పుడు మనదేశము ప్రాచీన ప్రపంచమునకు నాయకమణిగ నుండెను †

---

*ముందు 178, 244, 384 వ పుటలు జూడుడు

† అట్లైనో మనప్రాచీన గ్రంథములలో కొన్నిచోట్ల సముద్రయానమేల నిషేధించిరని సందేహము కలుగవచ్చును ఆనిషేధము మొదటినుండిలేక మధ్యకాలమునే [జపానీయులలోవలె] ఏర్పడెను క్రీ త 2,3 శతాబ్దుల ప్రాంతమునందు అన్యదేశములందు తీవ్రముగ ప్రబలియుండిన అంటువ్యాధులు, సంచారిదళబాధ, అశాంతస్థితి, మనకు వ్యాపింపకుం [illegible] నిర్ణయముజరిగియుండునేమో ! సముద్రమున తుఫానుల ప్రమాద [illegible] దధికమైయుండవచ్చును ఎట్లైనను, అప్పటి మనఋషులు దేశ [illegible] ములబట్టి చర్చించి తమయాచార వ్యవహారములను ధర్మశాస్త్రపు నియ [illegible] దేశహితకరమగునట్లు మార్చుకొనుచు వచ్చిరనటకు నిదర్శనములు గలవు.

ప్రాచీనభారతీయులు స్వదేశమందును అభిమానము వీడక, భారత దేశమంతటను ఏకమతము ఏకవిజ్ఞానము ఏక నాగరికతగూడ వ్యాపింపజేసిరి, వివిధప్రాంతములకు తీర్థ యాత్రల బ్రోత్సహించియు, గ్రంధాదుల మూలమునను దేశసంచారమును దేశపరిజ్ఞానమును ఆయాప్రాంతీయులలో పరస్పర నానుభూతిని వృద్ధిచేసిరి యూరపు ఉత్తరఅమెరికా మున్నగు ప్రాంతముల కార్యజాతీయులు వెళ్ళినప్పు డాయా దేశముల ఆదిమజనుల నార్యులు నిర్దాక్షిణ్యముగ నశింపజేసి రని చరిత్రలవలన విశదము మన భారతీయార్యులట్లు చేయ లేదు; ఆదిమ ద్రావిడ జనులు (వారలనాగరికతగూడ) దేశ మున వ్యాపించెను, ఈనాగరికతలమధ్య వీలైనంతవరకు సం బంధము సమీకరణము కలుగజేయబడెను, ఇట్లు జాతీయత కును అంతర్జాతీయతకును సమన్వయము జరిగెను

---

"అస్వర్గ్యం లోకవిద్విష్టం ధర్మ్యమప్యాచరేన్నతు, సముద్ర యాత్రాస్వీకారః కమండలు విధారణం ఇమాన్ ధర్మాన్ కలియుగే వర్జ్యానాహుర్మనీషిణః (బృహన్నారదీయము) అ 22_12_16

దత్తౌరసేతరేషాంతు పుత్రత్వేన పరిగ్రహః, శతాత్రియు దాయుగో [illegible] సీరిణామ్యః, భోజ్యాన్నతా, గృహస్థస్య తీర్థసేవాతిదూరతః... [illegible] స్వర్గం క్షత్రియాణాం... నివృత్తిశాస్త్ర [illegible]కం ... పాధూనాం ప్రమాణ [illegible] గానాగతం)

మన ప్రాచీనవిద్వాంసులు విశాలజ్ఞానానుభవములు లేని సంకుచితభావులను 'కూపకూర్మములు' అన్నారు ఆపేరు ఈనాడు వారి వంశీయులకే వర్తించునని కొందరుచెప్పు స్థితి కలిగినది ఆయుదారభావము, జ్ఞానాకాంక్ష, స్వతంత్రవిమర్శ, ప్రగతీచ్ఛయు మునుపరాధీనదేశమున క్షీణించినవి; బాహ్యాచిహ్నములే ప్రాముఖ్యమొందినవి, సంకుచిత ప్రాంతీయభావములు, పరస్పర విభేదములును, ప్రబలినవి

ఇట్టివి పోవుటకు ప్రపంచచరిత్రజ్ఞానము ఉపయోగించును. జగదుత్పత్తి వికాసములను ఆయాజాతుల చరిత్రమును గ్రహించుటచే మనోభావములు హృదయమును వికాసము పొందును; జాతీయభావము విశ్వజనీనతయు కలుగును. ప్రస్తుతమున్న విభేదము లెట్లుకలిగినవో తెలిసి, ఆయాజాతుల మధ్య యుద్ధాగ్రముగ సంఘర్షము కవసరము లేదని, ఈకనబడు విశేషములు బాహ్యములు తాత్కాలికములు నేయని, తెలియును. ప్రపంచచరిత్రను గ్రహించుట ముఖ్యముగా మనభారతీయులకు చాలయవసరము మనదేశము ఒకసంగ్రహప్రపంచము వంటిది. అందు ఫలవంతములగు నదీప్రాంతభూములు, అనావర్షప్రాంతములు, మరుభూములు, మహాటవులు, రాతినేలలు, [illegible]తభూములు, మహాపర్వతప్రాంతములు, అత్యుష్ణభాగములు, శీతలదేశములును గలవు, ఆజానుబాహువులు, పొట్టిజాతులు,

మహాశూరులు భయస్వభావులు, కుశాగ్రబుద్ధులు, మందులు, వ్యాపారకుశలురు, వేరువేరు జాతులవారును, కలరు, మహోన్నతమగు ఉపనిషన్మతమును, మూఢదురాచారములు, క్షుద్ర దేవతల బలిమతములుగూడ, ఒకదానిప్రక్కనొకటి వెలయుచున్నవి ఆదిమ ద్రావిడులవి ఆర్యనాగరికతయునే గాక, అన్యదేశసంస్థలుగూడ గలవు ప్రపంచపు ముఖ్యమతములన్నియు నిచ్చటనున్నవి మరియు, అగర్భశ్రీమంతులగు రాజకుటుంబములు, నిరపేదలగు బిచ్చగాండ్రునుకలరు ఇట్లన్ని మతసంఘస్థితులుండుచోట వాని యుత్పత్తిక్రమము సంబంధములును తెలియుట పరస్పరానుకూల్య ముండుటకు సహకారియగును ముఖ్యమతము లన్నింటికిని సంబంధము కలదని, వానిమూలసూత్రము లొక్కరీతి వేయని, కొన్ని చారిత్రక కారణములవలన ఆయాపరివర్త పరిస్థితుల కనుకూలముగ వేర్వేరు మతము లేర్పడెనని, వానిలో క్రమముగా దేశకాలానుసారముగ పరిణామము కలుగుచు వచ్చెనని, జగత్కథ తెల్పును, నిజముగా వీనిమధ్య విరోధముండవవసరములేదు క్రిందటినూరేండ్లలో ఆధునిక విజ్ఞానమువలన ఇనుప [illegible] శాఖలు, తంతివార్తలు, వాయువిమాన

పరస్పరసమావేశములుచాల హెచ్చినవి, అందువలన ఆర్థిక సాంఘిక రాజకీయవిషయములందుగూడ పరస్పరసంబంధము తప్పనిసరియైనది ఏలఅమెరికాలోనో జరుగు పరివర్తనముచే గూడ మన ఆర్థికాదిపరిస్థితులు తారుమారగుచున్నవి. మానవుని కష్టసుఖము లొకేరీతివి ఒకదేశము చిక్కులలో బడగనే, ఆబాధ లితరదేశములకును వ్యాపించుచున్నవి కనుక అన్ని జాతులయొక్కయు, ముఖ్యదేశము లన్నిటి యొక్కయు, ఇతిహాసపుముఖ్యాంశములను మనమందరమును గ్రహింపవలెను చరిత్రాభ్యాసము వేరొక గొప్పనీతినిగూడ తెల్పును ఆత్మవిశ్వాసము గలిగి తమతోడిజనుల సంఘాభివృద్ధికై నిరంతరకృషిచేయు సాహసిజాతులే క్రమముగా వృద్ధికివచ్చిరని ఇతిహాసము తెల్పును జనులందరు నీశ్వరాధీనులే యైనను, స్వయంకృషిలేని మందజాతులు క్షీణించుచున్నవి. ఇతిహాసమేగాక, పూర్వయుగముల జీవకోటిచరిత్రయు ఈసంగతిని దృఢపర్చును దేశకాలానుకూలముగ తమ యభ్యాసాదుల మార్చుకొనని (మందములు అలసములు అగు) ప్రాణులు వృద్ధిజెందలేదు, నిరంతరము శ్రమపడు జాతులే అవసరమగు అంగజ్ఞానవృద్ధి నొంది యభివృద్ధిగాంచి చిరస్థాయులుగ వ్యాపించును

జీవపరిణామము తెల్పు ఈనీతిని మరువకూడదు జీవ జాతులన్నియు సకలభూతాంతర్యామియగు మహాశక్తిచే

చోదితములయ్యు, స్వయంకృషివల్లనే వృద్ధినొందక, కాని కేవల భౌతికబలముచే వృద్ధిజేసుకొనుచు తమోగుణవంత ములై క్రూరములై యుండు మహాజగరములు డినోసార్లు మున్నగుపూర్వయుగముల వికృత జంతువులు పూర్తిగ నశించి, వానిజాతులు నిశ్శేషమైనవి, పూర్వమొకప్పుడు మనలోకమంతటికిని ముఖ్యజీవములై ప్రబలిన సరీసృపము లిప్పుడు హీనస్థానమున నున్నవి అట్లుగాక, మనోబలము ను అంతశ్శక్తిని సహృదయతను సంఘక్షేమపరతను వృద్ధిచేసుకొనిన జంతువులే కాలక్రమమున ఆయా యుగాం తములందలి ప్రళయముల దాటగలిగి వృద్ధియైనవి. అట్లు ఆత్మ మనశ్శక్తుల వృద్ధిజేసుకొనిన జీవులనుండియే వానర ములు (ప్రస్తుతపు నరజాతులును) కలిగెనని వైజ్ఞానికుల సిద్ధాంతము మరియు జీవులు కొంతవరకు పరిసరములవల్లను తోడి ప్రాణులవల్లను మారును అందువలన మన పరిసర ములను తోడిజీవులను బాగుచేయుట మనయాత్మాభివృద్ధి కినవసరము అనగా సంఘక్షేమముకై నిష్కామకర్మచేయుట వలనే నిశ్శ్రేయసము నందుదుము. అట్లుగాక నిష్క్రియుల [illegible] స్వార్థకార్యపరులముగనో యుండినచో నిశ్శ్రేయస [illegible]. అన్నిజీవులలోను వ్యాపించియున్న ఆత్మస్వభావ [illegible] సర్వభూతములందును సమబుద్ధియుండుట,

జీవవికాసకథను మానవసంఘచరిత్రను దెల్పు గ్రంథ మింతవరకు మన ఆంధ్రమున (నాకు తెలిసినంతవరకు తక్కిన మన దేశభాషలలోను) లేదు

పరిణామసిద్ధాంతపు నిదర్శనముల గూర్చి శ్రీచింతా దీక్షితులుగారొక చిన్నపుస్తకము వ్రాసిరి వెనుక శ్రీగాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు ప్రపంచచరిత్రము నాయా దేశముల వరుసను విపులముగ వ్రాయదలంచి గ్రీసుచరిత్రమును ప్రచురించిరి, మన భారతదేశమును గూర్చియును ఇంతవరకు సమగ్రేతిహాసము లేదు, విద్యార్థుల పుస్తకములు కొన్ని కలవు జపాను రష్యా అమెరికాసంయుక్తరాష్ట్రములు మున్నగు కొన్ని దేశముల గూర్చి విడివిడిగ చిన్నపుస్తకము లిటీవల వెలువడినవి ఇట్టి ప్రత్యేక దేశచరిత్రలకును ఆయాసాంఘికశక్తుల పరిణామమున సామాన్యసమస్యలను దెలుపుచు పరస్పరసమన్వయమును సూచించు లోకేతిహాసముకును భేదమున్నది ఇందలి మూలభాగము హెర్బర్ట్ జార్జి వెల్సుగారి "షార్ట్ హిస్టరీ ఆఫ్ ది వరల్డ్" అను ఆంగ్లగ్రంథముకనువాదము శ్రీ వెల్సుగారు జగద్విఖ్యాతుడు, ఆంగ్లవాఙ్మయజ్ఞులందరు నీయనప్రతిభను వినియే యున్నారు ఈయన 1866 లో జనించి ఆక్సుఫర్డులో జంతుశాస్త్రమున పట్టపరీక్షనిచ్చి, పత్రికృతి

శాస్త్ర ప్రవీణుడయ్యెను, కాని పత్రికా సంపాదనను గ్రంథరచనను వృత్తిగ జేసుకొనెను, చాలకథలను సంఘవిమర్శలను, ఇతరగ్రంథములను, రచించెను అర్థిక రాజకీయములందీయన "రైట్‌వింగ్ సోషలిస్టు" (=సామ్యవాదులలో మితవాది), ఆభావముల ప్రచారముకై 'వర్క్-వెల్త్ అండ్ హాపినెస్ ఆఫ్ మ్యాన్‌కైండ్' (=నరజాతిచర్య సుఖసంపదలు) మున్నగు అనేక గ్రంథములువ్రాసెను తన నవలలగూడ, జనులలో మూఢత్వము బోగొట్టి విజ్ఞానరుచిగల్గించి, ఉదార భావములను విజ్ఞానమును వెదజల్లుటకు నైతికపరిణామము గల్గించుటకునే వ్రాసినారు వైజ్ఞానికాగ్రణులసాయము నొంది "ది ఔట్‌లైన్ ఆఫ్ హిస్టరి" అను విపుల చరిత్రను గూడ రచించెను, కాని అది చాల వివరములతో నిండి, మామూలుచదువరులకు విసుగు గలిగించును ఈ "షార్ట్ హిస్టరీ" క్లుప్తమై, సారరూపమై, సామాన్యపాఠకుల యౌత్సుక్యమును తీర్చును

ఇందు మామూలు రాజయుద్ధాదులకధయేగాక సంఘపరిణామాదులును సంగ్రహింపబడినవి ఇట్టిగ్రంథము ననువదించుటకన్న తెనుగున స్వతంత్రముగ వ్రాయుటే సుకరముగ దోచినది కాని వైజ్ఞానికేతిహాసగ్రంథమును అందు ప్రవీణుడనుగాని నేను స్వతంత్రముగ వ్రాసిన నది ప్రామాణికముకాదు కనుక వెల్సు ననువదించుటే ఉచితమనితోచినది.

ఇతిహాసము రెండువిధములు ఆయా రాజాదివ్యక్తుల యుద్ధాదివృత్తాంతములను వరుసగా కార్యకారణ సంబంధములతో తెలుపుట సంప్రదాయపద్ధతి వానికి ప్రాధాన్యమీయక, ఆయాజనసంఘములందు కాలక్రమమున జరిగిన పరిణామముల దెలుపుచు, అందు కవసరమగునంతవరకే ఆయానాయకుల చర్యలగూర్చి తెల్పుట రెండవదగు వైజ్ఞానికపద్ధతి, ఇదియే యెక్కువ జ్ఞానదాయకము, ఉపయోగకరము ఆంగ్లమునను ఈరీతి చరిత్రను మొదట వ్రాసినది వెల్సుగారే †మరియొకసంగతి ఈగ్రంథమున భూమి యుత్పత్తిక్రమము, అందు ఆయాయుగముల

† ఇటీవలనే శ్రీ జవాహరలాల్ నెహ్రూగారు "గ్లింప్సెస్ ఆఫ్ వరల్డ్ హిస్టరీ" అను పేరనొక విపులగ్రంథము వ్రాసినారు అది కేవలేతిహాసముకాక నరుల రాజకీయాదిభావముల కేంద్రీకరించి స్వతంత్ర భావనిర్మాణమునకు తోడ్పడు వ్యాసపుంజము

జీవవికాసము, క్రమముగా నరజాతి యావిర్భావము, అందే ర్పడిన క్రమవికాసము, ఇప్పటి వైజ్ఞానికసిద్ధాంతములప్రకారము వర్ణింపబడి, అంతట మామూలు ప్రపంచజాతుల యితిహాసము వివరింపబడినది అందుచే నీపుస్తకమున ఆయాస్థలములందు భూతత్వశాస్త్రము, జీవశాస్త్రము, ప్రాచీననరశాస్త్రము, జాతిశాస్త్రము, సాంఘికతత్వము, మనశ్శాస్త్రము సామ్యవాదము మొదలగువాని కొన్ని మూలసూత్రములును, మతసూత్రములును, సందర్భోచితముగ మిళితమైనవి ఇందలి ఇతిహాసభాగమున ఆయాకాలములందు ఆయాజాతులస్థితి, వారిసమ్మేళనము వే నాగరికతలో కలిగిన మార్పులును, వివరింపబడినవి దరిమిలాను ఆర్థికసాంఘికధార్మికరాజకీయస్థితులన్నిటిలోను గల్గిన పరిణామము వాటి పరస్పరసంబంధమును సూచితములు ఇందు ప్రాచీనమిశ్రి (= ఈజిప్టు) దేశము సుమేరియా అస్సీరియా మొదలగువాటిసందర్భమున చెప్పబడిన గ్రామదేవతల గుణులు మతాధికారులు జాతుబలు

నాగరికతనుగూడ మార్చినవి. అందుచేత నాసంగతులును, వెల్సుగా రిందు సూచించిన "దేవసమన్వయము"ను, కొంత వరకు వన మతాచారములకును వర్తించునని తోచును తక్కినచరిత్రలవలెగాక, ఇందు బుద్ధుడు క్రీస్తు మహామ్మదు మొదలగు మతప్రవక్తల సిద్ధాంతముల గూర్చియు చెప్పబడి నది ఉదారులౌ మతాభిమానులు రాజకీయముగను స్వతంత్రభావులగుదురని సూచింపబడినది మూలగ్రంథమున సహజముగ క్రైస్తవసిద్ధాంతములకు ఆమతపరిణామమునకు ప్రాముఖ్యమిచ్చినారు చరిత్రమున మతమునకును స్థానమున్నది ప్రపంచము భౌతికమే కాదు పంచభూతతన్మాత్రలకు బుద్ధి అహంకారము మూలమని, వీటికన్నిటికి ఆత్మమూలమని సనాతనహిందూసిద్ధాంతము భౌతికపరమాణువులు స్వతంత్రపదార్థములు కావనియు అవియు అతిసూక్ష్మములు, దుర్గ్రాహ్యములు, దుర్భేద్యములు అగు శక్తిపుంజముల సముదాయరూపములే అనియు, ఈపరమాణువుల అంగములగు ఎలెక్ట్రనులు ప్రోటనులు మొదలగువాటి మూలాధారమగుశక్తి అవ్యక్తచిత్ స్వరూపమే అనియు, అందుచే విశ్వమూలాధారము భౌతికముకాక మానసికము ఆధ్యాత్మికమునే యగుననియు, ఇటీవల ఎడ్డింగ్టన్ సర్ జేమ్స్ జీన్స్ మొదలగు వైజ్ఞానికప్రముఖులు నిర్ణయించినారు ఆమూ

కాలముల సాంఘికాధ్యాత్మికపరిణామములచే రాజకీయ చరిత్రయు చాలవరకు మారుచుండును మరియు వ్యక్తుల లోను శరీరముకు మనస్సుకు హృదయముకు పరస్పరసంబంధము చాల గలదు ఇంతేగాక, సృష్టిలో మొదట భౌతికముగ బలీయములయ్యు తీవ్రములై నిదానములేని క్రూర సరీసృపాదులనుండి, నిదానము ఆలోచనగల పక్షిజంతు జాతులు, అంతట సూక్ష్మబుద్ధులు దాక్షిణ్యవంతములు అగు వానరాదులు విశేషమానసికాత్మికశక్తులు గల నరజాతియు ఏర్పడి, ప్రబలినవి, కనుక, సృష్టిలో జ్ఞానముకు ఆత్మశక్తికి ఇకముందు ప్రాధాన్యము హెచ్చునని తోచును మరియు ఇస్లాము క్రైస్తవాదిమతములచే భౌతికచరిత్రప్రవాహమున కూడ ప్రత్యక్షముగ మార్పులు గల్గినవి కనుక జ్ఞానమతములకును చరిత్రమున దగుస్థాన ముండవలెను

మూలమువలె నీపుస్తకమును ఒకచిన్నసంపుటముగనే వ్రాయబూనితిని అనువాదమున మూలాంగ్లగ్రంథములోని సంగతుల నేమియుమార్చలేదు. ఆంగ్లపాఠకులకు [illegible]లై మూలమున వివరము లీయని కొన్నినదీనగ [illegible] ఏప్రాంతపువో అట్టిసందర్భము లున్నతవిస్త [illegible] తెలియుట కవసరముగు వివరములనందే [illegible]లమును కొంతవరకు పా[illegible]

త్యదృక్పథముతో (ఆంగ్లపారశులకై) వ్రాసిరి,† కనుక ఆ పారశులకవసరమని తోచువిషయములకే ప్రాధాన్యమిచ్చిరి

లోకచరిత్రను ఒకేసంపుటములో వ్రాయునప్పుడు ఆయాప్రత్యేక దేశముల చారిత్రవిశేషములన్నిటిని తృప్తికరముగ వ్రాయవీలుండదు ఈపుస్తకమందు ఏప్రత్యేక దేశమును గూర్చియు పూర్తియైనచరిత్ర లేదు ఐనను అంతర్జాతీయసమస్యల గ్రహించుటకును, ప్రపంచచరిత్ర సమన్వయము తెలుసుకొనుటకును, అవసరమగు ఆయాపాశ్చాత్య దేశములముఖ్యసంగతులు వ్రాయబడినవి కాని, అట్టివేభారత సంబంధులగు కొన్ని సంగతులు మూలాంగ్లమున లేవు. అందువలనగల్గు అపార్థమును బోగొట్టుటకై మూలమున లేని కొన్నిసంగతుల నిందు తెలుపవలసివచ్చినది ఇట్టివి భారతీయుల కవసరములు, కనుక, పూర్వయుగములందు మన ప్రాంతపు భౌతికస్థితి, భారతదేశపు ప్రాచీననాగరికత, ప్రపంచమునకు ఋగ్వేదప్రాముఖ్యము సనాతన హిందూ

---

†ఇందు కొన్ని అధ్యాయముల జగవురపుడు పాఠకు లీసంగతిం జ్ఞప్తిలో నుంచవలెను బైజంటైను (=కాంస్టాంటినోపిలుప్రాంతపు) సామ్రాజ్యము, యూనానుపారసీకాదిదేశములు తూర్పురాజ్యము అని తఱచు వ్రాసినారు. అవి మనదేశమునకు నిజమునకు పడమరగనే యున్నవి రోమును ఇంగ్లండు మున్నగు పశ్చిమయూరపుప్రాంతములకు తూర్పుగ నున్నవి; కనుక అట్లు వ్రాయబడినది

మతమునుండి బౌద్ధమతము కలిగినరీతి, ఈరెంటికిని యూద క్రైస్తవమతసిద్ధాంతములతో గల సంబంధము. వైదిక ద్రావిడాది పూర్వనాగరికతల మిశ్రణఫలితము, దేవసమన్వయము, హిందూ ముస్లిం మతాచారభేదము, మన దేశపు ముఖ్యేతిహాసవిషయములు, ఆర్థికక్రాంతిఫలము, నవ్యసంఘస్థితి ఇట్టివానిని గూర్చి అవసరమైనచోట్ల సందర్భోచితముగ సంగ్రహముగ కొన్ని టిప్పణులను జేర్చితిని ఇది భారతదేశ చరిత్రకాదు, కనుక ప్రపంచచరిత్రలో నుండదగిన పరిణామకరములగు ముఖ్యాంశములనే అందు వ్రాసితిని ఈటిప్పణులను మూలానువాదపు మధ్యనే చేర్చిన చదువు వీలుగా నుండెడిది కాని వెల్సుగారిభావముల గ్రహించుట కాటంకములేకుండుటకై పాదటిప్పణిపద్ధతి నవలంబించినాను, ముఖ్యమైనవాని నాయా అధ్యాయాంతములందు వ్రాసినాను పాఠకులు వాని నుచిత సందర్భములందు సమన్వయము చేసుకొనప్రార్థన టిప్పణులలోని యంశములు రాధాకృష్ణ పండితులు, ఆచార్యప్రఫుల్లచంద్ర, రాధాకుముదముఖర్జీ, వ్రజేంద్రనాథసీల్, మున్నగు సుప్రసిద్ధశాస్త్రజ్ఞులు వంటి [illegible] విలడించినవే వీలైనంతవరకు మార్షల్‌గారి సం[illegible]యచరిత్రము విన్సెంటు స్మిత్తుగారి "ఎర్లీ [illegible] హిస్టరీ' మున్నగు దేశచరిత్రములు ప్రిభు

త్వప్రకటితమగు "ఇంపీరియల్ గజటీర్ ఆఫ్ ఇండియా"* జనాభారిపోర్టు మొదలగు (పాశ్చాత్యులందరును ప్రమాణముగ నంగీకరించు) గ్రంథములందు చెప్పినవానినే వ్రాసినాను, కొన్ని సంగతులను ప్రభుత్వపురాతత్త్వవేత్తలు మొదలగువారి (పత్రికలలో ప్రకటింపబడిన) ఉపన్యాసములనుండియు గ్రహించితిని (సందర్భముల సమన్వయముకై కొన్ని ఆంధ్రచారిత్రక విషయములగూడ జేర్చినాను) ఈటిప్పణుల లోని యేసంగతులును వెల్సుగారివి కావు, కనుక వాని బాధ్యత నాదేగాని వెల్సుగారిది కాదు

ఈగ్రంథపుసంగతులబట్టి ఇందు చాల పారిభాషిక పదముల వాడవలసివచ్చినది. ఆంధ్రమున తగు వైజ్ఞానిక నిఘంటువింతవరకు లేకయు*, ఆపదములకు వాడుకలో తగు స్థైర్యమేర్పడకయు, అట్టిభావముల దెల్పుటలో లేఖకులకును పాఠకులకును చిక్కు కలుగుచున్నది, వీలైనంతవరకిదివరకు వాడుకలోనున్న పదములనే వాడినను, కొన్నిచోట్ల క్రొత్త పదములగూడ నుపయోగించినాను కొన్ని వాడుకలోనున్న

* శ్రీదిగవల్లి వెంకటశివరావుగారిట్టి పుస్తకము నిటీవల ప్రచురించిరి కాని అది నాకందునప్పటికి ఈపుస్తకవ్రాత పూర్తి అయినది అందలి కొన్నిపదములకు ఇందులో వాడినవానికి కొంతభేదము తప్పినదికాదు

పదములు సందిగ్ధముగనున్నవి ఒకే వైజ్ఞానికభావమును రెండు పదముల వాడుటయు కలదు ఉ। "జియాలజి" అనుటకు భూగర్భశాస్త్రమని ఆంధ్రమున ధారాళముగ వాడుకకలదు కాని 'జియాలజీ'లో భూగర్భమునుగూర్చియేగాక భూమిపై నున్న శిలలు కొండలు మొదలగువానినిగూడ పరిశోధించుట భూతత్త్వము తెలుసుకొనుట ముఖ్యాంశము, (పైనున్న పటలము శోధించుటేగాని, వేలకొలది మైళ్ళలోతుగల నిజమైన భూగర్భమును పరిశోధించుట ఇంకనుసాధ్యముకాదు అయోమయమగు ఈగోళగర్భపు నిజస్థితినిగూర్చి ఇంకను ఏమియు తెలియదు), మరియు శబ్దార్థమునుబట్టి ఖనిజశాస్త్రమును భూగర్భశాస్త్రమే, అందుచే భూగర్భపదముకవ్యాప్తి అతివ్యాప్తి రెండునుకన్పడును కనుక'జియాలజిస్ట్'కు 'భూగర్భశాస్త్రజ్ఞుడు' కన్న 'భూతత్త్వజ్ఞుడు' అనుటేయుక్తముగాతోచినది. 'ఎస్ట్రానొమీ'అనుటకు 'ఖగోళశాస్త్రము' అనుచున్నాము ఆయర్థముననే 'జ్యోతిశ్శాస్త్రము' అనుపదమునుగూడ తెలుగులో కొందరు వాడుచున్నారు జ్యోతిశ్శాస్త్రమనుట శబ్దార్థమునకు సరియగుటేగాక, ప్రాచీనసంస్కృత గ్రంథములందు [illegible] హిందీ బెంగాలి మొదలగు ఆర్యాభాషలందునుగల [illegible] సరిపోవును. 'జామెట్రీ' అనగా 'క్షేత్రగణితము' [illegible] జ్యామితి' అనునది ఎక్కువ వ్యాప్తిని

లోచుచు పాశ్చాత్యులభాషలన్నిటిలోవలె మనభాషలలోను ఒకేరీతి పారిభాషిక పదములుండుటమంచిది కనుక, ఇది వరలో ధారాళముగ ప్రచారములోనున్న పదముల విషయ ముండనే పై రెండవరకపు సులభపదములగూడ అచ్చటచ్చట వాడితిని, ఈపద్ధతినే చరిత్రకు ఇతిహాసమని, హిందూదేశ ముకు భారతదేశమని, ఇట్లే ఇతరవిషయములందును రెండు విధములగు పదములును ఇందుజేరినవి మనదేశభాషలన్నిటి లోను పారిభాషిక విషయములకు చాలవరకు సంస్కృతపద ములనే వాడుచున్నారు (ఉర్దులోమాత్రము ఇంగ్లీషు, అర బికు, పర్షియన్, పదముల నెక్కువగా వాడుచున్నారు )

కాని, సంస్కృతమున అనేకార్థములగు అట్టిపద ములలో కొన్నిటిని బంగాళీ హిందిమున్నగు ఆర్యావర్త భాషలలో నొకయర్థమునను, తెనుగులో నింకొక యర్థము నను, వాడుచున్నారు,* 'బాకీ' మున్నగు కొన్ని కేవల హిం దూస్థానీ పదములను ఆయాభాషలలో వేర్వేరు అర్థము

---

*ఈవిషయమునకుదాహరణ ఉద్యోగ, వ్యాఖ్యాన, ఉపన్యాస, విన్యాస, రాష్ట్ర, మత, ధర్మ, ఇతిహాస, ఆగ్రహ, బాష్ప, సంసార, [illegible] ఇత్యాదిపదములెన్నియో హిందీలో నొకయర్థమునను తెలుగులోనింకొకయర్థమునను వాడుచున్నారు (దేశాదుల పేర్లలో గూడ ఇట్టిభేదములుగలవు. ఉదాహరణకు హిందూస్థానీలో 'మిశ్ర' దేశమని పర్షియాకు పారస్' అని అలెగ్జాండరుకు 'సికిందర్' అని వాడుదురు

లందు వా బడు న్నవి ఈసమన్వయ మూర్చి భాషాభిజ్ఞు లను విద్యాసంస్థలును తగుశ్రద్ధ వహించినట్లు తోచదు * ఈ 25 సం॥ లలో హిందీ మన ప్రాంతమందు వ్యాప్తి హెచ్చినది ఉభయభాషాభిజ్ఞులు కొందరికేవల కొన్నిపదముం రెండవ యర్థమందుగూడ ఆంధ్రమున వాడుచున్నారు ఒకేపదమును ఆంధ్రమందును ఆర్యభాషలందును వాడుటలో అర్థవిభేదము సాధ్యమైనంతవరకు తొలగించుట ఉభయభాషలవృద్ధి సామరస్యములకు అవసరము ఈసమన్వయను ఆయాభాషాసంస్థలు లేక పరిషత్తు ప్రతినిధులు భారతీయ భాషాపరిషత్తుగా నేర్పడియో, లేక అంతర్విశ్వవిద్యాలయ సమితి (ఇంటర్ యూనివర్సిటీస్ బోర్డు) వారో, పరిష్కరింపదగును అందుచే పరస్పరసమావేశముకు, భాషాసామరస్యముకు, గ్రంథముల తర్జుమాకును, సౌకర్యము హెచ్చును.

నేడుఆంధ్రమున శైలియు సమన్వయమైనది గ్రాంథిక వ్యావహారికముల రెంటికి నాదరమున్నది 'వ్యావహారిక' రచనలలో రుచిభేదమునుబట్టియు ప్రాంతభేదమునుబట్టియు [illegible]భేదము లేర్పడుచున్నవి, మన నిజాం ఆంధ్రసోదరులు, [illegible]ంతమువారు, గంజాంప్రాంతమువారును, తామ [illegible] సిరవాఙ్మయప్రగ్రంథముల [illegible], [illegible]చ్చి, కొన్ని శబ్దములలో ఆంధ్రము

వేర్వేరు భాషలవలె గన్పట్టవచ్చును. ఇందు భాష సుబోధముగ నుండునట్లు యత్నించితి శకటరేఫార్ధానుస్వారాదులను గమనింపలేదు, విసంధుల స్వేచ్ఛతో వాడితిని, (కేవలము వ్యవహారసిద్ధపదములుగూడ కొన్ని ఇందు చేరినవి), అన్యభాషాపదముల విసర్జింపలేదు (ద్రావిడకుటుంబికమగు తెనుగుకు ఒకవిధముగ సంస్కృతపదములును అన్యభాషవే) 'సాలు' మామూలు, తయారు, రోజు, ఖాళీ, అసలు, వగైరా, నకలు మున్నగు హిందూస్థానీపదము లిందువచ్చినవి కొన్ని చారిత్రక కారణములచే నట్టివి మనవాడుకలో దేశ్యసమములై నిల్చియున్నవి (కొన్ని శతాబ్దములు మనపై నధికారులై యుండిన గోలకొండ నిజాం రాజ్యపు ప్రజలలో సుమారు సగముమంది అనగా 75 లక్షలమంది ఆంధ్రులే, వారు తమ తెలుగులో నూటికి 70 వరకు వీనినేవాడుచున్నారు) ఈపదములు హిందీ బంగాళీమున్నగు ఆర్యభాషల వాఙ్మయములందును దేశ్యములుగ వాడుకలోనున్నవి, ఆంధ్రవాఙ్మయమందును అట్టివానికి నిషేధము లేకుండుట అవసరమనితోచున. సౌకర్యమునుబట్టి బ్యాంకు, స్కూలు, రోడ్డు, స్టీమరు మున్నగు వాడుకలోఉన్న ఆంగ్లపదములును, ఆంధ్రపారిభాషికములతోపాటు (పాఠకులకు దెలియదగిన) ఆంగ్ల పర్యాయములును గూడ చేర్చబడినవి (ఉ మేమలు,

ఫాసిలు, రిపబ్లికు) యూరపులోని నరదేశనగరాది వ్యక్తినామములిందు వందలకొలదిగలవు, వానిని ఆంధ్రలిపిలోనే వ్రాసితిని. ఆంగ్లమందును వీని యుచ్చారణలో చాల అభిప్రాయ భేదములుగలవు (ఉ॥ సిరాక్యూసు, సైరాక్యూసు) మరియు 'తాటాకు'లో మధ్య అచ్చువలె 'ఆ'కు 'ఏ'కు మధ్యరీతి ఉచ్చారణగలపదము లిందుచాలగలవు, వానికికొంతవరకు క్రింద '—' అను గుర్తునుంచితిని (ఉ॥ ఆథెన్సు, బ్రాబరు, ఫ్రారిను ) ఇంగ్లీషు 'ఎఫ్' 'జడ్' ఉచ్చారణగల కొన్నిపదముల ధ్వనికై కొన్నిటికి క్రిందచుక్కను ఉంచితిని, (ఉ॥ ఫ్రాన్సు, ఆఫ్రికా, ఫనీషను, జండవస్తా, నెబూకెడ్‌నజ్జార్). మూలగ్రంధపుచివరనున్న ముఖ్యవృత్తాంత కాలక్రమ సూచితోబాటు అదనముగ మరికొన్ని ముఖ్యాంశములు గూడ ఇందు చేర్చబడినవి మూలముకును టిప్పణికిని భేదము తెలియుటకై టిప్పణుల ముందు '‡ *' వంటిగుర్తునుంచి, టిప్పణి సంగతులు మూలముకన్న చిన్న అచ్చులో ముద్రించినాన ఆయాకాలపు భూపరిస్థితులను, జాతుల వ్యాప్తిని, [illegible]త్తాంశములను, తెలుపు మూలములోని పటములిందు [illegible]తో వ్రాసిచేర్చినాను, ప్రాచీనభారత[illegible]పటమును [illegible]మును ఆయాయుగములందు కలిగిన[illegible] [illegible]కను మన ముఖ్యభా[illegible]

ముఖపట్టికను అదనముగ నిచ్చినాను ఇందలి పటము లన్నిటికి శ్రీ దేశోద్ధారక విశ్వదాత నాగేశ్వరరావుపంతులు గారు సహజౌదార్యముతో బ్లాకులను ఆంధ్రపత్రికా లయమున చక్కగ తయారుచేయించి నాకుచితముగ నిప్పించి సహాయముచేసిరి, వారికెంతయు కృతజ్ఞుడను ప్రపంచపు ఆయాదేశముల తారతమ్యస్థితి సులభముగ పాఠకులకు గోచరించుటకై ముఖ్యదేశముల పరిమితి, జన సంఖ్య, ఆర్థికారోగ్య విద్యాదుల స్థితి, తెల్పుపట్టికలు గూడ జాతార్ అండ్ బెరి మున్నగువారి ఆర్థిక గ్రంథముల నుండియు, ప్రభుత్వప్రచురిత పుస్తకాదులనుండియు, ప్రసిద్ధ వార్షికప్రచురములనుండియు, శ్రీ ది. వెం. శివరావుగారి "భారతదేశ స్థితిగతులు" సాయముతోను, నాకు దొరకి నంతవరకు తయారుచేసి గ్రంథాంతమున జేర్చితిని ఆపట్టీల వలన ఆయావిషయములందు మన దేశపు ప్రస్తుతస్థితియు పురోభివృద్ధి కవకాశమును గోచరించును. టిప్పణిలోని ముఖ్యసంగతులు చాలగ్రంథములనుండి గ్రహించినందున ప్రత్యేకముగ ప్రమాణముల నుదహరింపలేదు

మూలమును తర్జుమా చేయుటలోను ఈపుస్తకపుశైలి లోను అనేకలోపము లున్నవి, మరియు, టిప్పణులలోని కొన్నిసంగతులు వివాదాస్పదము లగుటచే, వానినిగూర్చి

చాలమంది కభిప్రాయభేదము లుండవచ్చును అట్టిలోపము లను సహృదయులు చూపినచో వారికి కృతజ్ఞుడను ఈపుస్తకమును వ్రాయనారంభించినది మొదలు అనువాదము, అంశముల సేకరించుట, సాఫువ్రాయుట, పటములుగీయుట, ప్రూఫులు దిద్దుట మున్నగు అన్నిపనులలోను చి॥ ప్రతివాది భయంకర పార్థసారథి బి ఎ, బి కామ్, ఎల్ ఎల్ బి పూర్తిగ సహాయముచేసెను ఈ యనువాదముచేసి ప్రచురించుట కనుమతినొసగిన వెల్సుగారికిని అందుకొడంబడికను తెప్పించి నన్ను ప్రోత్సహించిన శ్రీ ఎం వి వి. కె రంగాచార్యులు బి ఏ గారికిని కృతజ్ఞుడను.

కాకనాడ,
1—7—1935

గ్రం థ.

# రెండవకూర్పుకు భూమిక.

జీవవికాసకథను ప్రపంచచరిత్రమును గూర్చిన పుస్తక మొకటి ఆంధ్రములోనుండుట యవసరమనితోచి, 1935 లో ఈ 'జగత్కథ'ను ప్రచురించితిని. ఆభావము దృఢపడినది. ఆంధ్రమహాజనులు దీనికుచితస్వాగతమిచ్చినారు. మరియు, ఆంధ్ర మద్రాసు విశ్వవిద్యాలయముల పాఠ్యనిర్ణేతలు దీనిలోని కొన్ని భాగములు బి. ఏ. పరీక్షకు పాఠ్యముగ జేసినారు. ఆవిద్వద్వరేణ్యుల యాదరముకెంతయు కృతజ్ఞుడను.

దీనికిప్పుడు పునర్ముద్రణ కలిగినది. టిప్పణుల నీసారి వృద్ధి జేయవచ్చునని ఇదివరలోననుకొంటిని, కాని అట్లు జరుగలేదు. రెండవకూర్పు అవసరమని నాకు ఈ వేసవిలో హఠాత్తుగ తెలిసినది. పుస్తకప్రతులను విద్యార్థులకు సకాలములో అందచేయవలెను. మరియు ఈసమయములోనే నెహ్రూచరిత్రకు రెండవకూర్పును 'గాంధిచరిత్ర'ను వ్రాసి ప్రచురించుట జరిగినది. కార్యాంతరముండుటేగాక, ఇందలి ముఖ్యభాగములు బి. ఏ. పరీక్షకు పాఠ్యములగుటవలన విశేషపు మార్పులుచేయుట యుచితముగకాదు. కనుక, ఈ రెండవ కూర్పులో మార్పులు చేయలేదు.

శైలిక్లిష్టముగనున్నచోట్ల, భావము స్ఫుటముగ తెలి యుటకై, ఈకూర్పులో మూలములోను టిప్పణులలోను వాక్యములశైలిని కొంతసులభపర్చినాను, మొదటికూర్పులో బడిన తప్పులనెల్ల సవరించినాను పారిభాషికపదములలో మూటిని మాత్రము మార్చినాను 'నెబ్యులా' అనుటకు 'తేజోమేఘము'కు బదులు 'నీహారము' అని, 'సోషలిజమ్'కు 'సాంఘికవాదము'కు బదులు 'సామ్యవాదము' అని, 'కమ్యూ నిజమ్'కు 'సామ్యవాదము'కు బదులు 'సంఘస్వామ్యము' అనియు, మార్చినాను వాటిశబ్దార్థమునుబట్టిచూచిన ఈ మార్పు అవసరముకాదనియే నాకుతోచినది కాని ఇటీవల పెద్దలు కూడ ఈ (మార్పు) పదములనే ఆయర్థములందు వాడుచున్నారు వాఙ్మయమందును మామూలువాడుక లోనుగూడ ఓకేరీతిపదములు వాడుటమంచిది పారిభాషిక పదములకిది యెక్కువఅవసరము కనుక, ఇందావదము నట్లు మార్చినాను

ఈమూడేండ్లలోను చాల దేశముల రాజకీయపరిస్థితి [illegible] కొంతవరకార్థికస్థితిగతులును కూడ చాల మార్పుచె [illegible] అందువలన అత్యవసరమైన కొత్తసంగతుల [illegible] సిద్ధాంతములు కాలసూచికలోను చేర్చినాను

చారిత్రక కాలపు జీవజాతుల గూర్చిన చిత్రపటము లిప్పుడు తెలుగుపుస్తకములలోను దొరకుచున్నవి కాని పూర్వయుగములందలి పరిణామకాలపుస్థితిని దెల్పు చిత్రములరుదు కనుక నీహారము, పూర్వయుగముల చెట్లు, మత్స్యములు వగైరా కొన్ని విచిత్రప్రాణుల చిత్రములను దయారుచేయించి, ఇందుచేర్చినాను వీటితో పోల్చుటవలన మన నేటి గుఱ్ఱములు గజములు నరులు ఈపూర్వజంతువుల ద్వారా క్రమపరిణామమున వికాస మొందిన సంగతి కొంతవరకు స్ఫురించును హింసాఘోరశి లోకమంతటను కార్చిచ్చువలె వ్యాపించి వికాకుపర్చుచున్న యీరోజులలో అందరును ముఖ్యముగ గ్రహింపదగిన అహింసాసిద్ధాంతమునకు చారిత్రక కాలమందు మొదటిప్రవర్తకుడై లోకోత్తరుడైన శ్రీగౌతమబుద్ధుని చిత్రమును ఇందు చేర్చబడినది

ప్రపంచచరిత్రము నభ్యసించుటకవసరము నానాటికిని హెచ్చుచున్నది లోకమందా యాప్రాంతముల ప్రయాణసౌకర్యములు హెచ్చి, దేశకాలావధి తగ్గుచున్నది (ఇటీవల, ఒక అమెరికనువైమానికుడు భూగోళమంతటిని 3½ రోజులలో చుట్టి తిరిగిరాగలిగెను, యూరపుకు అమెరికాకు మధ్య దీర్ఘప్రయాణము జరుపవలసిన అట్లాంటికు మహాసముద్రము నింకొకవైమానికుడు 13½ గంటలలో దాటెనట.

ఇంగ్లండునుండి మన దేశమునకు రెండురోజులలో పునః విమానము వచ్చుచున్నది 'రేడియో' (గ్రామములకును వ్యాపించుచున్నది 'టెలివిజ'ను గూడ ఏర్పడినది) ఇట్లు ఆయా దేశములమధ్య భౌతికసంబంధము హెచ్చుచున్నది తద్వారా ఆర్థికసాంఘికరాజకీయ సంబంధములును హెచ్చినవి ఒక దేశపు పరిస్థితులు మార్పులు తక్కిన దేశములవారును గ్రహింపకతీరదు, చారిత్రకముగను ప్రస్తుత స్థితికిని విభేదములకును కారణములేవో, మనమిప్పుడు విను క్రొత్తసిద్ధాంతము లెందుచేగల్గినవో గూడ, మనము అవగాహనచేసుకోవలెను అప్పుడే మన ప్రస్తుతసమస్యలెట్లు పరిష్కరింపవచ్చునో సహేతుకముగ తెలుసుకొందుము కనుకనే, ఇటీవల అబిసీనియా స్పెయిను చీనా ఆస్ట్రియా వగైరా ప్రాంతములందేర్పడిన విప్లవములు నిజముగ అంతర్జాతీయ స్వభావముగలవి మనకును సంబంధించినవి అని నాయకులు చెప్పుచున్నారు కనుక చరిత్రగ్రహణము అవసరము హెచ్చినది ఆవిషయములన్నిటిని గ్రహించి, అందుల [illegible]మాత్రములను మన దేశపు పరిస్థితుల కనుకూలముగ [illegible]సమన్వయము చేసుకొనుట మన దేశీయులందరి

# మూలకర్త పీఠిక

ఈ చిన్న ప్రపంచచరిత్ర నవలవలె సరాసరిగా చదువుటకుద్దేశింపబడినది వివరములు క్లిష్ట విషయములు లేకుండ, ఇప్పటికి తెలిసియున్న చారిత్రక విషయముల సామాన్యసంగతులిందుండును ఒక ప్రత్యేక యుగమునో ఒక ప్రత్యేక దేశచరిత్రమునో అభ్యసింపదలచు వారి కవసరమగు సామాన్యచరిత్ర జ్ఞానము నిందు లభించును ఈగ్రంథకర్త వ్రాసిన "ఔట్ లైన్ ఆఫ్ హిస్టరీ" అను వివరములుగల విపులగ్రంథమును అభ్యసించుటకుముందు పూర్వప్రయత్నముగ గూడ దీనినుపయోగింపవచ్చును అయితే, "ఔట్ లైను" లో వివరముగానున్న చిత్రపటములను పట్టికలను నేర్చుకొనుటకు తీరుబాటులేక కార్యమగ్నులగువారు మానవజాతి మహాప్రవృత్తిని గూర్చిన మనోభావములను మరల జ్ఞప్తికి దెచ్చుటకును ఈగ్రంథము ముఖ్యముగ నుద్దేశింపబడినది ఇది పైగ్రంథపు సంగ్రహము కాదు "ఔట్ లైన్" గ్రంథమును దానిపద్ధతినిబట్టి ఇంక సంగ్రహము చేయుటకు వీలులేదు ఇది వేరుగా నిర్ణయించి వ్రాసిన చరిత్ర

హెచ్ జి వెల్స్

# 1

## విశ్వములో భూలోకపుస్థానము

మన జగత్తు పూర్వపుస్థితి ఇంకను పూర్తిగ తెలియదు. రెండుశతాబ్దుల క్రిందటివారికి గడచిన మూడు వేలయేండ్ల చరిత్రమాత్రమే తెలిసెను. అంతకుపూర్వపు సంగతులకు, గాథలు ఊహాలునే ఆధారమయ్యెను. చాల వరకు నాగరికులు ఈప్రపంచము క్రీ పూ 4004 వయేట హఠాత్తుగా సృజింపబడెనని నమ్మిరి, అది ఆసాలు వేసవినా, శరదృతువునా, అని మాత్రము విద్వాంసులు చర్చించుచుండిరి. వారు † హీబ్రూబైబిలు సంగతులకు కేవల శబ్దార్థమునే గ్రహించి, అందుపై విచక్షణలేని మతనిర్ణయములజేసిరి, అందుచే నిట్టి యసందర్భపు అపోహాలు కలిగెను. మతబోధకులట్టిభావముల జాలకాలముక్రిందనే వదలినారు

---

† 'హీబ్రూ' యూదదేశపు ప్రాచీనభాష. ఏసుక్రీస్తు యూదవంశజుడు, యూదదేశమందే తన నూతనమతము స్థాపించెను. అందుచే బైబిలంతయు మొదట హీబ్రూలోనే రచింపబడెను. ప్రపంచమిట్లు హఠాత్తుగా నిటీవలనే సృజింపబడెనను భావము యూద క్రైస్తవ మహమ్మదీయులలో మాత్రమే పూర్వముండెను. అనేకయుగములనుండి కల్పములనుండి కూడ ప్రపంచము కలదనియే ప్రాచీనహిందువులు బౌద్ధులు నమ్మినారు. హిందువులు వైదికకార్యములందుజేయు సంకల్పమంత్రములోగూడ ఈసనాతనత్వము అనుదినము జ్ఞప్తికి తేబడుచుండును.

మనమున్న యీవిశ్వ మతిదీర్ఘ కాలమునుండి యున్నదనుట సర్వసమ్మతము (అది యనాదికావచ్చును) ఒకగదిలో ఈ చివర నాచివరను ఎదురెదురుగ నద్దములబెట్టుచో, ప్రతిబింబములుగల్గి, ఆగది యనంతమని భ్రమకలుగును, అటే, ప్రపంచపు బాహ్యాదృశ్యము కొంత మాయగా గన్పడును కాని మనమున్న జగ మారేడు వేలయేండ్లనుండి మాత్రమున్న దనుట కేవలము నిరాధారము

భూమి గోళప్రాయమై నారింజపండువలె కొంచె మది మినట్లుండును దానివ్యాసము రమారమి 8000 మైళ్లు అది గోళరూపమని కొద్దిమంది ధీమంతులకు రమారమి 2500 యేండ్లనుండియు దెలియును కాని అంతకుపూర్వికులు అది బల్లపరుపని తలచిరి భూమికి గ్రహనక్షత్రములతో నుండు సంబంధమునుగూర్చి, అప్పుడు అనేకవిచిత్ర భావము లుండెను. భూమివ్యాసము, భూమధ్యరేఖకన్న ధ్రువములయొద్ద 24 మైళ్లుతక్కువ భూమి తన అక్షముపై 24 గంటల కొకసారి తనచుట్టుతిరుగును, అందుచే రాత్రి బవలు వరుసగ కలుగుచుండును కొంచెము కోలయగుకక్షలో, భూమి సాలుకొకసారి సూర్యునిచుట్టి వచ్చును, (ఈమార్గమే దాని క్రాంతివృత్తము.) దానికి సూర్యు డతిసమీపమైనపుడు 915 లక్షల

మైళ్లు, అతిదూరమైనపుడు 945 లక్షలమైళ్లును, దూరముండును

చంద్రుడు భూమికన్న చాలచిన్న, అది సుమారు 2,39,000 మైళ్లదూరమున భూమిని చుట్టివచ్చుచుండును. భూచంద్రులేకాక, బుధుడు 360 లక్షలమైళ్లదూరమున, శుక్రుడు 670 లక్షలమైళ్లదూరమున, మఱియు భూవృత్తమున కావలనున్న అంగారక, బృహస్పతి, శని, అరుణ, వరుణులు వరుసగా సుమారు 1410 లక్షలు, 4830 లక్షలు, 8860 లక్షలు, 17,820 లక్షలు, 27,930 లక్షలు మైళ్లదూరమునుండి సూర్యునిచుట్టు దిరుగుచుండును ఇట్లే ఇంకను చాల అల్పగ్రహములును తిరుగుచున్నవి ఈకోట్లకొలది మైళ్లదూరము మనకు దురవగాహము ఈగ్రహములన్నిటిని జిన్న స్కేలు ( = పరిమాణము)లో భావించిన, ఆదూరము సులభముగ బోధపడును

భూమి నొక అంగుళపువ్యాసముగల చిన్నబంతిగా నెంచుదము అప్పుడు సూర్యుడు 9 అడుగులవ్యాసము గలిగి, 323 గజముల (అనగా నాల్గైదు నిముసముల నడకపట్టు 1/5 మైలు) దూరమున ఉన్నట్లగును అప్పుడు చంద్రుడు, మనభూమికి 2½ అడుగులదూరమున, ఒకచిన్న బఠాని గింజంత యుండును సూర్యునికి వరుసగా 125,250 గజముల

దూరమున, (భూసూర్యులమధ్య) బుధుడు, శుక్రుడు నుం డును. ఇక వీటివెలుపల చుట్టుపట్ల ఖాళీగానుంచును, భూమికి ఆవల 175 అడుగులదూరమున అంగారకుడు, ఏమూరమి మైలుదూరమున ఒకఅడుగు వ్యాసముతో బృహస్పతి, ఇంక గొంచెము చిన్నదై రెండుమైళ్లదూరమున శని, నాల్గుమైళ్ల దూరమున యూరేనసు (అరుణుడు), ఆరుమైళ్లదూరమున నెప్ట్యూను (వరుణుడు) నుండును వీటికావల (ఈస్కేలుప్రకా రము) వేలకొలది మైళ్లవరకు చిన్న నలుసులు, ఎగయు వల్చని ఆవిరి పొగయు దప్ప, అంతయు శూన్యము. అతి సమీపమగు నక్షత్రము ఈపరిమాణముపైన భూమికి నలు బదివేలమైళ్ల దూరమందుండును

జీవనాటకపు రంగస్థల మెంతవిశాలమో, ఈపైయంశ లచే గొంతవరకు తెలియును అంతఖాళీగనున్న మహావిశ్వ మంతటిలోన, నిశ్చయముగా ప్రాణులుండుట మనభూతల మునమాత్రమే భూతలముకు భూగర్భమధ్యముకు మధ్య నున్న 4000 మైళ్లదూరములో, పైనుండి మూడుమైళ్లలోతు వరకును, వాయుమండలములో నయిదుమైళ్లయెత్తువరకును మాత్రమే ప్రాణులున్నవి మిగిలిన అనంతవిశ్వమును నిర్జీ వమై, శుద్ధశూన్యముగ నున్నట్లు గన్పట్టును.

మహాసముద్రమున 5 మైళ్ళలోతుమాత్రము గమనింపగలము ఇప్పుడు గాలియోడలపైన ఆకాశమున సుమారు 4 మైళ్ళయెత్తుకు మాత్ర మెగురగల్గినాము బెలూనులో 7 మైళ్ళయెత్తుకు నరు లతిశ్రమతో వెళ్ళగలరు; 5 మైళ్ళఎత్తున కేపక్షియు వెళ్ళలేదు, గాలియోడలనంటి చిన్నపక్షులు పురుగులు పైకిపోవుచో, ఆయెత్తులోపుగనే యవి స్పృహతప్పి క్రిందబడును *

---

*విమానములపై సుమారుపదునైదుమైళ్ళయెత్తునకుగూడనిటీవల కొందరు (ముఖ్యముగా రష్యనులు అమెరికనులు) శ్రమపడి వెళ్ళగలుగుచున్నారు అంతకన్న ఎత్తునకు వెళ్ళుటకును, ఇతరగోళములతో మరియేరీతినైన వార్తలను సంజ్ఞలను బంపుటకును, గ్రహించుటకునుగూడ, ఇంకను సాధ్యపడుటలేదు మిగిలిన విశ్వమంతయు నిర్జీవముగ గన్పడుచుటలో ఇంకెక్కడను ప్రాణులుండ వీలులేదని వెల్సుగారి యభిప్రాయము కాదు భూమి కావల అనంతమహావిశ్వమందు ప్రాణిచిహ్నములు మనకు గన్పడక పోవుట మన యల్పజ్ఞతను మాత్రమే సూచించును మనకు సమీపగ్రహమగు అంగారకునందే నరులున్నారని, లేరని చర్చ జరుగును, ఇంకను సరిగా తేలలేదు, పైనచెప్పినవికాక, ఇంకను సుమారు 2400 అల్పగ్రహములు, వరుణున కావల 'ప్లూటో' అను ఇంకొక గ్రహమునుగూడ, మన సౌరకుటుంబములో నేకలవు, ఈసౌరగ్రహముల స్థితినిగూర్చియు, మనకు స్పష్టముగా దెలియదు ఆకాశమున గనబడు నక్షత్రములలో అనేకములు మన సూర్యగోళముకన్నను చాలపెద్దవి సూర్యునివంటివి ఇంకను పెద్దవి సుమారు మూడువేలకోట్ల మహాగోళ

ములు కలవని బలీయమగు దూరదర్శినులద్వారా లెక్కింపబడినవి అవి అసంభావ్యదూరమున నుండుటచే, మనకు మిక్కిలి చిన్నవిగా గన్పడును. మన బుధశుక్రభూమ్యాదులవలె చుట్టుతిరుగు గ్రహములు (వాటికి మన చంద్రునిబోలు ఉపగ్రహములును) వీటికిని ఉండును. మనకతిదూరమగు ఖగోళకాంతి మన భూమిని చేరుటకు 14 కోట్ల యేండ్లు పట్టునట (కాంతి సెకండుకు అనగా క్షణముకు 1,86,000 మైళ్లచొప్పున విద్యుద్వేగమున బోవుచుండును) మన కతిసమీపములని తోచునక్షత్రములుకూడ అర్బుదముల కొలది మైళ్లదూరమున నుండును, ఇందుచే మనకు గోచరించుమహావిశ్వమెంత విస్తీర్ణమైనదో యూహింపవలెను. ఇదియంతయు బలీయమగు దూరదర్శినికి దృశ్యమగునది, దానికిని అందనిది ఇంకను మూడు రెట్లు మహావిశ్వముండునని జ్యోతిశ్శాస్త్రజ్ఞులలో అగ్రేసరుడగు ఐన్‌స్టీను మహాశయుడు తెలిపినాడు. ఈనిర్వచనము "పాదోऽస్య విశ్వాభూతాని త్రిపాదూర్ధ్వం ఉదైత్ పురుషః" (ఋ సం 10వ మండలం) అను పురుషసూక్తవచనమును జ్ఞప్తికి దెచ్చును. ఇట్టి పదార్థముల సూక్ష్మతయందుగ్రాహ్యము పరమాణువు అభేద్యమనుకొంటిమి కాని అదికూడ (ఒకగ్రహకుటుంబమువలె) అనేక సూక్ష్మతరపదార్థముల పుంజమని యిటీవల దెలియవచ్చినది. ఒక్కొక్క పరమాణువులోని సూక్ష్మతమపదార్థములలోను, అర్బుదముల కొలది మైళ్లదూరమున మహావిశ్వమున చరించు మహాలోకములచుట్టును గూడ, ఏదో అప్రమేయమగుమహాశక్తి వ్యాపించి, వాని స్థానములందుండు నట్లాకర్షించి నియమించి యుంచుచున్నది. "తమేవభాంత మనుభాతిసర్వం, తస్యభాసావిశ్వమిదం విభాతి" (శ్వేతా, 6-14) ఆశక్తిస్వభావమెట్టిదో, ఎట్లుకలుగునో, ఎందుండివచ్చుచున్నదో, వైజ్ఞానికులకింకను తెలియదేను. ఈశక్తి "అణో రణీయాన్ మహతో మహీయాన్" (క. ఉ 2-20) అనియు "యస్మాత్పరం నాపర

మస్తి కించిత్ యస్మాన్నాణీయో నజ్యాయోఽస్తి కశ్చిత్” (శ్వే. ఉ. 3-9) అనియు ఉపనిషత్తులలో వర్ణించిన సర్వాంతర్యామి యగు పరమాత్మకు సంబంధించినదేమో! ఇట్లు విశ్వమంతటను చిద్రూపశక్తి లీనమై వ్యాపించియున్నదని ఊహింపవచ్చును (కొన్నిచోట్ల కొన్నిలోకములు క్షీణించుచుండ, మరికొన్ని క్రొత్తలోకము లేర్పడుచున్నవి ఇట్లు ఆయా ప్రాంతములందు సృష్టి స్థితి లయములు నిరంతరము కలుగుచున్నవి) అట్టిచో, వేర్వేరు పరిస్థితులుగల లెక్కలేనన్ని గోళములు అబ్దములకొలది మైళ్లదూరమునచుండ దిక్కాలమితి లేని యీ మహావిశ్వమంతటిలోను, మనభూమిలో దప్ప ఇంకెక్కడను జీవములు లేవని యెట్లు అనగలము? మనగోళపు పరిస్థితులున్ననే ప్రాణులుండుననుటకును వీలు లేదు మనభూలోకమందే, అతిశీతలస్థలములందు అత్యుష్ణప్రదేశములందు, వాయుమధ్యమునందు, సముద్రములో మైళ్లకొలదిలోతున ఆ దేశకాలములబట్టి, ఆయా పరిస్థితులకు వీలగు విశిష్టదేహములుగల చిత్రవిచిత్రమగు వివిధప్రాణులు కలవు ఇప్పుడు భూమిపైలేని అద్భుతప్రాణులు పూర్వయుగములందు అప్పటిస్థితికి తగినట్లు భూమిపైనుండినట్లుగ స్పష్టనిదర్శనములు కలవు ఇట్లే గోళాంతరములందును ఉండవచ్చును. సృష్టివైచిత్ర్య మత్యద్భుతము

---

# 2

## జగత్కాలము

మనభూమి ఎప్పుడేరీతి జనించినదో, వైజ్ఞానికులు 50 ఏండ్లనుండి చక్కగ విమర్శించినారు. ఈ శాస్త్రీయ పరిశోధనల నిందు వివరింపవీలులేదు. భౌతికజ్యోతిశ్శాస్త్రములింకను శైశవావస్థలోనే యున్నవి. మరియింకను సూచనలతోనే తృప్తిజెందవలెను. మనభూమి వయఃకాలపు అంచనా క్రమముగా పెరుగుచున్నది. ఆదిసూర్యునిచుట్టు తిరుగు పరిభ్రమణక్రమముగా నెప్పుడో, 200 కోట్ల యేండ్లు దాటియుండును, ఇంకను హెచ్చుకావచ్చును. ఈ కాలపరిమితి మనకు కేవల మగ్రాహ్యము.

గములు అసలు కేంద్రమునుండి తీగతీగలుగానూడి, విడి
పోయి దూరమై, దేనికది వేరుగా ఘనీభవించి, క్రమముగా
ఇప్పటిరూపుల నొందియుండునని, చాలమంది జ్యోతిశ్శాస్త్ర
జ్ఞుల భావన ఇట్లనేక కల్పములుగా ఘనీభావము జరిగిన
మీదట, చివరకు (మనముపైనపేర్కొన్న ఈకల్పాదికి) మన
భూమి, చంద్రుడు, తమతమ వ్యక్తిత్వమును బొందియుండును
గ్రహము లిప్పటికంటె నప్పుడు సూర్యునికింకను దగ్గరమై,
ఇంతకన్న నతివేగముగ సూర్యునిచుట్టివచ్చుచుండెను వాటి
పైభాగము లుజ్జ్వలమైయుండెను, అంతరిక్షమందు సూర్య
తేజ మత్యుగ్రముగనుండెను ఆయాదికాలపుభూమి యత్యు
ష్ణమై, ఉక్కు కరగించు కొలిమినో అగ్నిపర్వతపు 'లావా'
ద్రవముతో పోలియుండెను అందలి లోహగంధకాదులు
నత్యుష్ణమున వాయురూపముగనుండెను అప్పటికి జలమగు
పడదు ఇక భూగర్భపు శిలావస్తువులన్నియు దగ్ధములై మహా
ద్రవముగ నుడుకుచుండెను అంతరిక్షమున ఆగ్నేయాస్త్ర
ములబోలు మేఘములావరించెను మనోవేగమున బరువెత్తు
అప్పటి సూర్యచంద్రుల మహాతేజ మతిశీఘ్రముగా నన్నిదిశ
లను వ్యాపించియుండును.

ఇట్లుయుగములు గడచినకొలది, ఆయాగ్నేయలోకపు
టుగ్రతేజము తగ్గుచుండ, ఆవిరి వస్తువులు చల్లబడి వర్షింప,

వాతావరణము కొంత తేలికయయ్యెను. భూతలమును క్రమముగా ద్రవస్థితివీడి, ఘనీభవించెను అందుచే నేర్పడు శిలలు* వెంటనే మహాద్రవసముద్రమున మునిగి, భూగర్భగతములగును అప్పటికి సూర్యచంద్రులు వెనుకటికన్న భూమికి దూరమై చిన్నవగుచుండె, అంతరిక్షమున వాని సంచారవేగమును తగ్గియుండును చంద్రబింబము గ్రహములకన్న చాలచిన్నది, అందుచే, చంద్రకాంతి తీవ్రత బొత్తుగాతగ్గెను. గ్రహణకాలములందును పూర్ణిమలందును చంద్రుడు సూర్యకాంతినరికట్టుచు భూమిపై ప్రసరింపజేయుచునుండెను

ఇట్టియుగములు గడచినమీదట, పృథివి క్రమముగా మన ప్రస్తుతభువిగా నేర్పడినది ఆవిరిచల్లగాలికి మేఘాకృతి నొందె, భూమిపైనీటివర్షము పడనారంభించెను ఇంకనువేల కొలది యేండ్లవరకు, నీరు చాలవరకావిరిగనే యాకాశమందుండెను, కాని అక్కడక్కడ శిలలపై వెన్నీటిసెలయేళ్ళు ప్రవహించుచుండెను, ఈనీరును వాటితోవచ్చు వండ్రును పల్లపు భాగములలో జేర, గుంటలు సరస్సులు నేర్పడియుండును

* 'శిల' అను పదమును ఇచటను ఇకముందును 'రాయి' అనియేగాక, గట్టిపడిన మట్టి గంధకము లోహము మొదలగు ఘనపదార్థములం అనియెడి భావము

ఇట్లయిన భూమిపై తుదకు నరుడునిల్చి చరింపదగు స్థితిగల్గెను మన మాకాలముకు భూమికి విచ్చేసినచో, అప్పటికింకను మట్టినేం వృక్షజాతి లేక, కేవల మాగ్నేయ శిలలపై నిల్చియుందుము అంతరిక్షమున తుపాను, ఝంఝూమారుతములు, ఊహాతీతమగువర్ష సంపాతమును, భీకరముగ మనపై జెలరేగియుండును ఈయాసారనిర్ఝరములు మనప్రక్కను శిలల వంపుతో లోయలగుండ ప్రవహించుచు, సెలయేళ్లై కూలంకషముగ బారుచు, ఆమొదటి సముద్రములజేరి, తాము తెచ్చిన భూసారము నందు జేర్చుచుండును సూర్యబింబపుచలనము మేఘములగుండ ప్రత్యక్షముగ వ్యక్తమగుచుండెను అందుతో రోజుకు రెండుసార్లు భూకంపము, భూమిఉత్క్షేపము, ఆటుపోటులవలె కలుగుచుండి యుండును. ఇప్పటివలెగాక, అప్పటి చంద్రబింబము రాత్రులందు తనచుట్టుతిరుగుచు, తన రెండవభాగము గూడ బ్రదర్శించియుండును

భూమివయస్సు గడచినకొలది దినపరిమాణము వృద్ధియయ్యెను, రానురాను సూర్యుడు దూరమగుచు, ఆదుర్భర కాంతితీక్ష్ణత తగ్గుచుండెను, చంద్రగతియు మందగించెను. తుపానువర్షములయు దేకముతగ్గి, ఆయారంభసముద్రముల నీరు వృద్ధియగుచు, భూతలముపై వ్యాపించి, క్రమముగా

నిప్పటి మహాసముద్రాకృతి నొందియుండును కాని అప్పటి కింకను భూతలముపై జీవస్వరూపములేదు నదీసముద్రము లును, నిర్జీవములు, శిలలును వంధ్యములు*

---

*ఆ కాలమున కింకను భూస్థలి సరిగా గట్టిపడలేదు సూర్యచంద్రు లిప్పటికన్న భూమికి చాలదగ్గరయై, వాటి ఆకర్షణబల మధికముగ నుండెను అందుచే భూస్థలికే ప్రతిదినము చలనము ఉద్రేకము కలుగుచుండి యుండును ఇప్పటికిని ద్రవపదార్థమగు సముద్రమునకు పోటుపాటు అట్లే యగుచున్నది

ఈభూలోకము ప్రత్యేకవ్యక్తియై యిప్పటికి సుమారు 200 కోట్ల యేండ్లై యుండునని పైనజెప్పినగ ఆధునిక వైజ్ఞానికుల సిద్ధాంతప్రకారము మన ప్రాచీనభారతీయుల లెక్కప్రకారము చూతము ఇప్పుడీ కల్పములో 6 మన్వంతరములు గడచి, 7వ దానిలో 28వ మహాయుగము జరుగుచున్నది ఆప్రకారము ప్రతిమహాయుగములో—

| | | |
|---|---|---|
| కృతయుగమునకు | 1724000 | ఏండ్లు |
| త్రేతా , | 1296000 | ,, |
| ద్వాపర ,, | 864000 | ,, |
| కలి ,, | 482000 | ,, |
| చతుర్యుగము అనగా ఒక మహాయుగమునకు | 4820000<br>71 | ,, |
| మన్వంతరము అనగా 71 మహాయుగములు | 306720000<br>6 | ,, |

| | | |
|---|---|---|
| ఇప్పటికాల మన్వంతరములు గడచి ఏడవదగు వైవస్వత మన్వంతరమున ఉన్నాము కనుక 6 మన్వంతరములకు, | 1840320000 | ఏండ్లు |
| ఈ 7వ మన్వంతరములో గడచిన 27 మహాయుగములకు | 116640000 | ,, |
| ఈ 28వ మహాయుగములో కృత త్రేతా ద్వాపరయుగములకు | 38880000 | ,, |
| ఈ కలియుగములో ఇప్పటికైనవి | 5035 | ,, |

మొత్తం ఈకల్పంలో అయినయేండ్లు 1995845035

ఇట్లు మన ప్రాచీనార్యసంప్రదాయపు లెక్కప్రకారము ఈ కల్పారంభకాలము మనభూమికి ప్రత్యేకవ్యక్తిత్వమేర్పడుటను వైజ్ఞానికులు చెప్పినకాలమునకు సుమారుగా సరిపోవును. భూమియేర్పడి ఈ 200 కోట్ల ఏండ్లకన్న ఇంకను చాలరెట్లు హెచ్చుకాలమై యుండునని కొందరు ప్రతిభావంతులగు భౌతికజ్యోతిశ్శాస్త్రజ్ఞులు భావించుచున్నారు. అట్లగుచో, భూమి అరంభించి అనేకకల్పములై యుండును. భూమి ఉత్పత్తిమను ఈ ముఖ్యాయమున సుప్రసిద్ధమగు నెబ్యులార్ (నీహార) సిద్ధాంతమును బట్టి చెప్పబడినది. నీహారములు లఘువై యుష్ణముగనుండును. వానిచుట్టు నతిశీతముగనుండును, కనుక నీహార మతిస్వల్పకాలమునకే తనయుష్ణమంతను గోల్పోవును, అ ధకారబంధురమగు చాల బలువగు మన భూమి సూర్యుడుమున్నగు మహాగోళము లారీతిగాయేర్పడి యుండవు అని కొందరిమతము ఆరంభస్థితిలోనే భూమిపైన హిమ మావ

రించినట్లు చిహ్నములకలవు, కనుక భూతలము అత్యుష్ణమునుండి క్రమక్రమముగా నేచల్లబడుచువచ్చినదన వీలులేదనివీరంగుగ సూర్యగోళమునొద్ద దానిచుట్టు నక్ష్బదములకొలది యుల్కలు సదా తిరుగుచుండును. ఇట్టి యుల్కలాకాశమందంతట నుండునని తోచును. భూమిపై ప్రతిరాత్రియు ఉల్కలనేకములు పడుచుండుట మనకు కనపడును. ఈయుల్కల పదార్థము ఇనుపగనులలోని పొడివలె చాలవరకినుముగను కొంచెముగ నిక్కెలు, మట్టి, నీరు, వాయువు వగైరాలు కలసియు, ఉండును. భూమి లోపలిభాగము చాలవరకు ఇనుమే యైయుండునని భూమి తూనికవగైరాలచే తేలినది. దానిపైన మట్టిలోనగునవియున్న సంగతి యందరునెరిగినదే సూర్యగోళమును ఉల్కాపదార్థమైయుండును, దానిచుట్టు తిరుగు కొన్ని కోట్లయుల్కలు నీహారములమధ్యనో, దిగంతరాళపు ఇతరపదార్థముల లోనో, తగులుకొనియుండును లేక సూర్యగోళపు పైభాగము మహోష్ణముచే ప్రేలి అక్కడియుల్కలు దూరముగ నెగురగొట్టబడి యుండును, లేదా ఏదైన మహానక్షత్రము సూర్యగోళసమీపముగ బోయినప్పుడు, దాని యాకర్షబలముచే, ఆయుల్కలలో కొన్నికోట్లు సూర్యపరిధినుండి యీవలకు దూరముగ లాగబడియుండవచ్చును, ఇట్లు సూర్యునినుండి యీవలబడిన యుల్కాసమూహము వేగముగ తిరుగుటలో సంఘర్షణముచే కరిగి గట్టిముద్దకాగా, అందలి లోహపదార్థము బరువుచే లోనికిదిగి, 7900 మైళ్ళ వ్యాసముగల గోళముగ భూమిలో నేర్పడగా, అందుపైన సుమారు ఏబది మైళ్ళలోపుమాత్రమే మందముగల పెచ్చుగా శిలలు మట్టియును నేర్పడి యుండునని, నీరును గాలియు లోహశిలాదులకన్న లఘువగుటచే పైకి తేలియున్నవనియు, వీరి యూహ. ఇదియే 'మీటియొరైట్' [ఉల్కా] సిద్ధాంత మనబడును. చంద్రుడును ఇట్లే భూమిలో నొక పెద్ద ముక్క [బహుశః శాంతమహాసముద్ర ప్రాంతపుది] చెదిరి దూర

ముగ బోవుటచే నేర్పడి అప్పటినుండి భూమియొక్క యాకర్షణబలముచే దానిచుట్టు తిరుగుచున్నదనియు వీరు చెప్పుదురు

భూమికన్న సూర్యుడు చాల ప్రాచీనుడు, కొన్ని నక్షత్రగోళము లింకను పూర్వపుటి, అందుచే మనభూమి యేర్పడుటకు పూర్వమును అనేకకల్పములనుండి విశ్వమున సృష్టిస్థితిలయములు జరుగుచునేయున్నవి సూర్య తేజ మొకప్పు డింకను చాల యుగ్రముగ నుండెనని, విశ్వకర్మ యా యుగ్రతను తగ్గించెననియు, మనలో నొక యైతిహ్యము కలదు

ఇట్లు భూమి యేర్పడిన కొంతకాలమునకు అందు జీవారంభము కలిగెను ఈపురాతనప్రాణుల సంగతి వాని క్రమపరిణామము అతిప్రాచీనములగు శిలాజీవముల శేషములవల్లనే తెలియవచ్చెనని ముందు తెలుపబడును ఆ శిలాజీవములన నేమియో తెలుసుకొందము, ఈ వెనుకటి మన్వంతరములలోని పూర్వయుగములందుండిన వివిధములగు చరాచర ప్రాణులు కాలక్రమమున నశించియో, లేక హఠాత్తుగా భూకంపాది ప్రమాదములవల్లనో మట్టిపైగిరాలచే గప్పబడుచుండును వాయుమండలపు ధూళియేగాక, అంతరిక్షమునుండు వేలకొలది యుల్కలు ప్రతిదినమును భూతలముపై బడుచుండుటచేతను, అగ్నిపర్వతములనుండి పడు శిలాద్రవములవలనను, ఇతరకారణములవల్లను, మనభూస్థలము క్రమముగా పెరుగుచువచ్చినది (అట్టియుల్కాపాతము నేటికిని ఆకాశమున రాత్రివేళల మనము గమనింపవచ్చును) పూర్వయుగముల చరాచరప్రాణుల దేహాశేషము లీమట్టిపైగిరాలక్రింద నణగిపోయి ఘనీభవించుచు, వాటిలో నిమిడి, శిలాధాతువులుగా నేర్పడెను పూర్వయుగముల జీవజాలములు బొత్తుగ క్రిందిపొరలలోను, దరిమిలా యుగములవి వాటిపైపొరలలోను, లగ్నములై యుండుట సహజము అట్లాగి నశించిన తరుమృగాదుల శరీరములలోని మృదుపదార్థములు కొంతకాలమునకు పూర్తిగా నశించును,

కాని వాటిస్కంధములు, ఎముకలు, గుల్ల మొదలగు కఠినభాగములు మాత్రము నశింపక నేయుండును. అయితే నేలక్రింద నుండుటచే గాలి తగులుటకు లేక, పైనుండు బరువుచే నణగిపోయి, చూర్ణములై, వివర్ణములై, కొంతవికృతాకారము నొందెను (ఈ పూర్వయుగములనాటి మహావృక్షశేషములే ఇప్పటి గనులలోని నేలబొగ్గుగా నేర్పడినవి) ఈపురాతనశిలలను బలీయమగు సూక్ష్మదర్శనయంత్రములద్వారా పరీక్షింతుమేని, ఆయాయుగములందేర్పడిన పొరలలో నిమిడియున్న పురాతనప్రాణుల దేహశేషములను గోచరించును. ఈలక్షల కొలది యేండ్లమధ్యను అనేకప్రకృతిశక్తులును ఇతరకారణములును ఈశిలలలోని పొరలసహజస్థితిని కొంతమార్చుచుండును. అందుచే విశేషజ్ఞానము అనుభవమును కలిగి నిరంతరము వస్తుపరీక్షచేయువారే ఆసంగతులు సరిగా గ్రహింపగలుగుదురు. ఆదేహశేషములెల్లనేగాక, అప్పటిప్రాణుల చలనముచే నేలపై నేర్పడు చిహ్నములున్నట్టియు, అప్పటికొన్నిసంగతుల గ్రహింపవచ్చును. ఈశిలలలోని దేహశేషములే ఇంగ్లీషులో "ఫాసిలు"లనబడును.

3

## జీవారంభము

ఘనిభవించిన మహాశిలల పొరలందు ప్రాచీనజీవుల దేహశేషములుండును, వాటిపరీక్షచేతనే, నరులకు పూర్వముండిన జీవులసంగతి మనకిప్పుడు తెలిసినది పురాతనమగు డిప్పలలో, రాతిపలకలలో, గులకగాళ్లలో, ఇసుకరాళ్లలోను, జంతువులనరములు, పైడిప్పలు, తిత్తులు, కాడలు, పళ్లు, పాదచిహ్నములు, సంఘర్షణము మొదలగు జీవచిహ్నము లిమిడియుండును మొదటివానల యానవాళ్ళు, అప్పటి సముద్రములపోటు, కెరటముల రేఖలుగూడ, ఇందు కుపయోగించును. ఈమహాశిలల పొరలనుండి గ్రహించిన సంగతులవలననే, మనభూమిపూర్వచరిత్రను నిర్మించినారు అణగియున్న యీ శిలలపొర దొంతలవరుసగానుండక, నలిగి, వంకరలై, చెదరి, విరూపమై, చాలసారులు లూటీయై తగులబెట్టిన గ్రంథాలయపు పత్రములవలె మిశ్రితమై, విచ్ఛిన్నమై యుండును అందుచే సమర్థులగు పరిశోధకులనేకులు తమ యావజ్జీవము శ్రమపడి, వీటిచరిత్రను కనుగొని, సరిచేసి సమకూర్చినారు ఈశిలాచిహ్నములందు, 160 కోట్ల యేండ్ల స్థితి యిమిడియున్నదని నిర్ణయింపబడినది.

మొదటిశిలలలో జీవచిహ్నలేమియు లేవు, కనుక వానికి 'అజీవశిల' లని భూతత్వజ్ఞులు పేరిడిరి ఉత్తర

అమెరికాలో నిట్టిమహాశిలలు కలవు. ఈ శిలల దళసరి బట్టిచూడ, అట్టివేర్పడుటకు మొత్తము భూవిన్యాసకాలమగు 160 కోట్ల వత్సరములలో సగమువట్టియుండును. అనగా ధరాసముద్రములు విడిగా ఏర్పడినతరువాత జరిగిన మన్వంతరములందర్ధకాలపు చిహ్నములలో జీవులుండినట్లు కనబడదు. ఈశిలలలో తరంగరేఖలు, వర్షపాతచిహ్నములునే కలవు. కానిప్రాణులుండిన సూచనలేదు. తరువాత జీవచిహ్నములువచ్చి, క్రమముగా అట్టివధికమగుడు ఆప్రథమప్రాణుల కాలమునకు "పురాణజీవ" యుగమని భూతత్త్వజ్ఞులు పేరిడినారు. ప్రథమజీవుల సూచించు అల్పప్రాణుల దేహశేషము, డిప్పలు, సముద్రపుమొక్కల కాడలు, బూడిపెలు, నాచు, సముద్రక్రిమి శేషాదులును, అప్పటివి.

ఆయుగమున ప్రాకుచు వలయాకారముగ దొర్లు కొన్ని చీడపురుగులు పుట్టెను. తరువాత కొన్నిలక్షలయేండ్లకా మొదటిప్రాణులకన్న హెచ్చువేగబలములుగల సముద్రపుతేళ్లు బయలుదేరినవి. ఇవియునంతగ పెద్దవిగావు. వీనిలో చాల పెద్దవి తొమ్మిదడుగుల పొడవువి. అప్పటికి భూతలమున వృక్షజంతుజాతు లేవియు లేవు. నీటిలోగూడ ఇంకను చేపలుమున్నగు వెన్నెముకగల జంతువులు లేవు. ఆప్రాణుల చిహ్నములు లోతులేని నీళ్లనుండి. అటుపోటు కలుగు

స్థలములనుండి, దొరికినవి శిలలగుంటలందును పాతగోతుల
లోను నిలువయున్న నీటిచుక్కను సూక్ష్మదర్శినితో పరీక్షిం
చుచో, అందుగోచరించు ప్రాణులును పైనజెప్పిన ప్రాణు
లును ఒకేజాతివని తెలియును, పరిమాణమున మాత్రము
భేదముండును

అయినను మనభూమిపై మొదటనుండిన ప్రాణుల
రకములన్నియు ఈ పురాణజీవశిలలలో కన్పడునన వీలు
లేదు ఆప్రాణిజాతిశరీరమున ఎముకలు డిప్పలవంటి దృఢ
పదార్థములు ఉండిననో, లేక బురదనేల నవి నంచరించునపు
డడుగుల యానవాలు పడునంత పెద్దవై బలువైనవైననో, తప్ప,
అట్టిజంతుచిహ్నము లేవియు శిలాపరీక్షచే లభింపవు ఇప్ప
టిజీవరాసులలో మృదుశరీరముగల లక్షలకొలది చిన్నజంతు
జాలములుకలవు అట్టిజంతుజాతుల చిహ్నము భావివైజ్ఞాని
కునకు మిగులదు పూర్వయుగములందును, అట్టి జంతుజా
తులు కోట్లకొలది భూమిపై జీవించి వృద్ధియై గతించియుం
డును, కాని వాటిస్థిరచిహ్నములు భువిపై మిగులలేదు.
అజీవయుగమును ఆదికాలపు గాథసరస్సముద్రముల వెచ్చని
నీటిలో, ఎముక డిప్పలు లేని మెత్తమెత్తని రకరకముల చిన్న
పురుగులు మొక్కలు జీవించి, తీవ్రాతపముగల తీరముల
వెంట వ్యాపించియుండును ఈకాలపు మనబ్యాంకుల లెక్క

లవల్ల ఇప్పటిప్రజలందరి సంగతి తెలియదు, ఆబ్యాంకు రికార్డులో వ్యవహారముకలవారి విషయము మాత్రమే తెలియును అట్లే అప్పటినేలపై డిప్పలు నున్నపుగల్లల వంటి స్థిరచిహ్నముల విడచిన జంతుజాలముల సంగతి మాత్రమే మనకిపుడు తెలియవీలగును.

ఇట్టిస్థిరచిహ్నములుగల దృఢశిలలకన్నను ప్రాచీనములగు శిలలుకొన్ని కలవు వీనిలోని భాగ్గులు దృఢముగ నుండక విచ్చిపోయియున్నవి మనకు తెలియని కొన్నిజీవులాభాగ్గుల శిలలుగాకుండునట్లు వేరుచేసి యుండునని కొందరు ప్రామాణికుల భావము *

---

* అజీవయుగపు అతిపురాతనశిలలు మన దక్షిణభారతదేశమందు విధ్యమందుగూడ అచ్చటచ్చట (ముఖ్యముగా నెల్లూరుప్రాంతపు మైకాప్రదేశము, ఉత్తరార్కాటు కోయంబత్తూరులలోని కొన్నిశిలాస్థలులు, ధార్వార, బళ్ళారి, కోలారులలోనికొన్నిలోహస్థలులు), కలవు. ఇవి భూమిలో సుమారు 20,000 అడుగుల లోతునవుండును కొన్ని కడపరాళ్ళశిలలు వింధ్యపర్వతపు లోభాగము నట్టివే వీనియంతపురాతనముకాకపోయినను, కర్నూలులోగూడ కొన్ని అజీవకాలపుశిలలు కలవట హిమాలయములందజీవశిలలు అరుదు తరువాత మనదేశమందు కలిగిన పురాణజీవశిలాస్థలులన్నిటిలో అతిప్రాచీనములు, పంజాబులో ఉప్పుగనులయొద్దను, తరువాతవి కాశ్మీరమందును గలవందురు సముద్రమందున్నెరా పురాణజీవశిలలు కలవు. మద్రాసుదగ్గర నిట్టివిటీవల కొన్ని బయలుపడినవి, అందు వెన్నెముకలులేని ప్రాణుల చిహ్నములు కలవట నర్మదాసాగరసంగమస్థలమందు నట్టిపూర్వపు నీటిజంతువుల చిహ్నములు కలవు.

# మత్స్యయుగము.

సృష్టి కొన్ని వేలయేండ్లకిర్రిందటనే ఆరంభించెనను కొన్నప్పుడు, ఇప్పుడు మన కగుపడు వృక్షజంతుజాతు లీస్వ రూపములతోనే అప్పుడొక్కసారిగా ఉదయించినవని కొం దరు తలచిరి కాని ప్రాచీనశిలలలోని చిహ్నముల గనిపెట్టి పరిశోధించినమీదట, చాలజీవజాతులు చిరకాలమునుండి క్రిమముగా మారుచు వృద్ధినొందుచు వచ్చినవని తోచెను, మన కాజ్ఞానము వృద్ధియైనసిదప, భూమిపైనున్న వృక్షజంతు జాతులన్నియు అసలులో అజీవకాల మను కల్పాదినుండి, అదృశ్యమై అతిసూక్ష్మమగు చిత్పదార్థములోనుండి, మొదటి అత్యల్పప్రాణులుగనుండి, అంతట కొద్దికొద్దిగ అవిచ్ఛిన్నముగ మారుచు, వృద్ధిబొందుచు, నూతనాకృతులదాల్చుచు, (యుగములకొలది గడచినమీదట) చివరకిప్పటిస్థితికి వచ్చిన వని తేలినది ఇదియే పరిణామసిద్ధాంతము, జీవవికాససిద్ధాం తము అనబడును భూమి వయ కాలసమన్యవలెనే, ఈజీవ వికాససమన్యను గూర్చియు చాలతీవ్రిచర్చ జరిగెను. క్రైస్తవ, యూద, మహమ్మదీయమతముల మూలసిద్ధాంత ములకీపరిణామసిద్ధాంతము వ్యతిరిక్తమను వెనుకటి భావ మిప్పుడు పోయినది జీవకోటికంతకు నొకటే మూలధార మని, క్రైస్తవకాతలికు, ప్రొటెస్టాంటు, యూద, మహమ్మ

దీయ మతస్థుల పూర్వాచారులుగూడ నిప్పు డంగీకరించి నారు జీవజాతి యేదియు మనభూమిపై హఠాత్తుగా నవతరింపలేదు, మనకగోచరములగు పూర్వమన్వంతరములందు జలాశయ తీరములకొద్ద జిగురువలెనుండు మొదటిచేతన పదార్థములనుండి, ప్రాణులు క్రమముగా నుత్పన్నమై రూపాంతరము బొందుచు వృద్ధినొంది, కాలక్రమమున ప్రస్తుతశారీరక, మానసిక, నైతికశక్తుల నొందినవి

ఆయాజీవవ్యక్తుల సముదాయమే ప్రాణికోటి యన బడును అచేతనములగు మట్టిముద్దలు, కేవలస్ఫటికాదులును, జీవులలో చేరవు ఇతరవస్తువుల హరించి జీర్ణించుకొనుట, పునరుత్పత్తికల్గించుట, జీవలక్షణము. అనగా ప్రాణులు తినును, కనును. వానిలోనుండి పుట్టువ్యక్తులు చాలవరకు వానిని పోలును, కాని కొంతవరకు భేదించును. వ్యక్తికిని దానిశిశువుకును చాలవరకు స్వజాతి సామ్యముండును, కాని వానిమధ్య కొంతవ్యక్తిభేదము నుండును. ఈనూత్రము ప్రాణికోటికంతకును వర్తించును.

ఇట్లు శిశువులకు తమ జనకజీవములతో పోలికయేల కలుగునో, తిరుగ వానిమధ్య కొంతభేదమేలనో, ప్రకృతి శాస్త్రజ్ఞు లింకను నిరూపింపలేకున్నారు ఐతే పిల్లలకు పోలిక భేదము కూడ నుండుటబట్టి, ఆయాప్రాణుల పరి

తరములు మారినప్పుడెల్ల తదనుగుణముగ ఆవ్యక్తులలో కొంతమార్పు కల్గుచుండునని (సిద్ధాంతముచేగాక) అనుభవముచే గ్రహింపవచ్చు. ఆయాకాలపు ప్రాణులలో కొన్నింటి గుణగణము లప్పటిపరిస్థితుల కనుకూలముగను, కొన్నిటివి వ్యతిరేకముగను, ఉండును. అనుకూలప్రాణు లితరములకన్న చాలకాలము జీవించి, చాల కొత్తవ్యక్తుల బుట్టించును. ఇట్లు తరములు గడచినకొలది ఆజాతిసామాన్యస్థితి మారుచు, వృద్ధియగుచుండును. ఈ "నిసర్గవరణము" వైజ్ఞానికసూత్రముకాక, ఉత్పత్తిరీతినిబట్టియు అందు వ్యక్తిభేదములుండుటబట్టియు ఊహాచే తేలినది. వైజ్ఞానికుల కింకను తెలియని కొన్నిప్రకృతిశక్తులు జీవజాతుల బోషింపుచు నశింపజేయుచుండును. కాని జీవితపద్ధతి తెలిసిన ప్రతిబుద్ధిమంతుడును లోకపుప్రాణులం దనాదిగా నీనిసర్గవరణపద్ధతి కలదని యంగీకరింపక తప్పదు.

ప్రాణులయారంభ మెట్లైనదని వైజ్ఞానికులు మనోహర రాద్ధాంతముల జేయుచున్నారు. ఈసమస్యతత్త్వముగాని, అందుకు తృప్తికరసమాధానముకాని, ఇప్పటికిని ఏర్పడలేదు. బహుశః ఎండ వెలుగు గల వెచ్చని లోతులేని ఉప్పునీటనో బురదలోనో, ఇసుకలోనో జీవము ప్రారంభించి, అక్కడనుండి తీరస్థలములకువచ్చి క్రమముగ విశాలజలముల

లోనికి వ్యాపించియుండుననని, ఇందుమూలముగా ప్రామాణికు లందరును నిశ్చయించినారు

ప్రపంచారంభమున అగ్నిపర్వత ప్రవాహములు ఉద్రిక్తములై యుండెను. కొన్నిప్రాణులు గడ్డకట్టబడి యుండియు, కొన్ని సముద్రపు టడుగున మునిగి పీలుకొను గాలి దొరకకయు, చచ్చెను. కాని చిన్నచిన్నజీవులు వేరుబారి వృద్ధియగుటకుగూడ, అప్పటి పురాతనపరిస్థితులు వీలుగనే యుండినవి. స్వస్థలము తప్పినను వెంటనే నశింపకుండ, అంగరక్షణకు చర్మమును డిప్పలును ఏర్పడ వీలుండెను. రుచిశక్తి యొంతమాత్రమేర్పడినను, జీవులాహార మాస్వాదింపగల్గెను, కాంతి గ్రహించు శక్తిరాగనే సముద్ర గర్భములనుండి గుహలనుండి తోవ్వకొని బయలుదేరుచుండెను. తీవ్రతాపమునుండి కొంతలోతునీళ్ళకు పోవుట కును, చాల యవకాశముండెను. మొదట శరీరముల కేర్పడిన డిప్పలు, చర్మకవచములు, శత్రువులనుండి రక్షింపలేక పోయినను, ఎండదెబ్బనుండి రక్షణకు పనికివచ్చెను. తరువాత కొద్దికాలమునకే పంజ్లు, గోళ్లుగూడ, బయలుదేరెను. [illegible] చిరకాలమువరకిదివరలో ముఖ్యజంతువులుగ [illegible] తరువాతకాలపు పురాణజీవశిలలలో 'సిల్యూరి [illegible] [illegible] భాగమున ఆ మొదటిజీవులకన్న నెక్కువ [illegible]

శక్తి, కండ్లు, పండ్లును, కలిగిన ఒకకొత్తజీవజాతి కనబడును ఈశిలలు 50 కోట్ల సంవత్సరములకిందటివని భూతత్త్వజ్ఞులనేకు లిప్పుడు తలచుచున్నారు ఈప్రాణులే మనకు తెలిసియున్న వెన్నెముకగల జంతువులలో మొదటివి ఇదియే మత్స్యజాతి కారంభము

తరువాతవగు 'డెవోనియను' శిలలలో చేపలు చాల కలవు చేపలప్పు డంత విస్తరించియుండుటచే, ఆ కాలమును, 'మత్స్యయుగ' మందురు ఇప్పటి మరచేపలును మహామీనముల బోలినవియు, ఇప్పుడదృశ్యమైన కొన్ని విచిత్రపురాణమత్స్యములును, అప్పుడు నీట్లిలో విజృంభించుచు, పైకెగురుచు, నాచులో దూరుచు, ఒక దాని నొకటి తినుచు, నీటికి జీవకళ నిచ్చుచుండెను ప్రస్తుత మహానమునుబట్టి చూడా మీనము లంతగొప్పవి కావు, తరుచు రెండుమూడడుగుల పొడుగుండెను

మత్స్యము లనలేజాతినుండి పుట్టెనో భూగర్భశాస్త్రము తెల్పుటలేదు అంతకు పూర్వప్రాణులు శిలల పరిశృతముగ సంబంధింపవు ఇప్పటి చేపగ్రుడ్ల బరీక్షించియు ఇతర విధములను, జంతుశాస్త్రజ్ఞులు మత్స్యోత్పత్తి మూలమును గూర్చి విచిత్రసిద్ధాంతము దేల్చిరి మృదుదేహులై నీటిలో నీదు కొన్ని చిన్నజంతువుల ముఖభాగమున, పండ్లువంటి

దృఢపదార్థము లేర్పడి, వానినుండి తరువాత మత్స్యములు కలిగియుండును. కొన్నిరకముల చేపలకు పైనక్రిందనుండు పండ్లు పెదవులద్వారా బయటకువచ్చి, సరాసరివీపు శరీర మంతయు పొలుసు పొలుసుగా నావరించి కొంతకాలమునకు వెన్నెముకగా నేర్పడును. ఇవియే మొదటి వంశాస్థిక (= వెన్నెముకగల) జంతువులుగా పరిణమించియుండును.*

---

*జీవారంభ మెట్లు కలిగెననునదే సృష్టిలోని మహాసమస్య. సృష్ట్యారంభము కొన్ని వేలయేండ్లక్రిందనే కలిగెనని ప్రాచీన క్రైస్తవులు, యూదులు, ప్రాచీనయవనులు మొదలగువారు సరిగా చర్చించినట్లగుపడదు. అట్లుగాక, ఇప్పటి వైజ్ఞానికులవలె మన ప్రాచీన భారతీయులును ఈసమస్య నుత్సాహముతో విమర్శించిరి. కాని వారిలోను ఏకాభిప్రాయము కలిగినట్లు తోచదు. సృష్టినిగూర్చి మన పూర్వీకులభావము ఇప్పటి పరిణామసిద్ధాంతమును సమీపించును. దృశ్యములగు చిదచిత్తులన్నిటిలోను ఆత్మపదార్థము లీనమై యుండునని, ఆత్మనుండియే బుద్ధ్యాదులద్వారా క్రమముగా ఆకాశము వాయువు తేజస్సు, జలము, పృథివియు కలిగెనని, వేదఋషులభావము "తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః, ఆకాశాద్వాయుః, వాయో రగ్నిః, అగ్నేరాపః అద్భ్యః పృథివీ", (తైత్తి ఆనందవల్లి) "ఏతస్మాత్ - ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్య ధారిణీ" (ముం... 2-1-3) అసత్తునుండి సత్పదార్థము కలిగెనని ఒకసిద్ధాంతమును, సత్తునుండియే సత్తు కలిగెను అసలు మూలప్రకృతియు సత్పదా[illegible] సిద్ధాంతమును ప్రాచీనభారతీయులలో నుండెనని [illegible].

'అసద్వా ఇద మగ్ర ఆసీత్, తతోవై సదజాయత (తైత్తి ఉ అ 7)' సదేవ సౌమ్యేదమగ్ర ఆసీదేక మేవాద్వితీయం। తద్ధైక ఆహుః అసదే వేద మగ్రఆసీత్' (ఛాం ఉ 6_2)

జగత్కారణమగు అవ్యక్తస్వరూపము సత్, అసత్, అను భేదములేనిదను సిద్ధాంత మీక్రిందివాటిలో గలదు "నాసదాసీన్నో సదాసీత్తదానీం " ఋ సం 10 మం అ 11 ఋ 2) "సదసచ్చాహమర్జున (భ గీ అ_ 9 శ్లో_ 19) త్వమక్షరం సదసత్తత్పరం యత్ (గీత 11_37)

'న సత్తన్నా సదుచ్యతే' గీత 13_13

నిర్జీవములని మనము సాధారణముగా తలచు శిలాలోహాదివస్తువులలో గూడ లీనమై యొకవిధమగు జీవముండవచ్చునను 'నిర్జీవ' వస్తువులగూర్చి సామాన్యముగనుండు భావము తప్పని మన ప్రాచీన లనుటయేగాక, ఆధునిక వైజ్ఞానిక ప్రముఖులలో నొకరగు కీర్తిశేషులగు శ్రీ జగదీశచంద్ర వసుగారు 'ది లివింగ్ అండ్ ది నాన్లివింగ్' మొదలగు ఆంగ్లభాషలోని యుద్గ్రంథములందు ప్రకృతిశాస్త్రపరిశోధనలద్వారానే నిరూపించిరి ఇట్లు అనాదిగా లోన లీనమైయున్న అంతశ్శక్తియే క్రమముగా అనుకూలసందర్భములందు వికసించి వ్యక్తిజీవులేర్పడెనని తోచును

---

## రొంపికాలము (కూర్మయుగము—1)

మత్స్యయుగమున స్థలభాగమున ప్రాణులు లేనట్లు తోచును అప్పటినేల శిలయో ఊషరస్థలియోయయి, సూర్యతప్తము వర్షపరిప్లుతముగ నుండినది క్షేత్రమేర్పడుట కవసరమగు క్రిమిజాతియు, నేలభేదించు తృణాంకురములును, ఇంకను భువిపై లేనందున, ఇంకను క్షేత్రమేర్పడలేదు, నాచులేదు నీటనే ప్రాణులుండెను

ఈవంధ్యశిలలపై శీతోష్ణస్థితులెంతయో మారుచుండెను ఇందులకారణము లతిక్లిష్టములు. భూమి కాంతివృత్తపు ఆకారము, భూచలనపు ధ్రువములస్థానమున, భూఖండముల రూపును, క్రమముగ మారెను సూర్యతాపమును కొంతతగ్గియుండును అందుల ఫలితముగ భూమిపైన చాల కాలము కొన్ని భాగములందు చలి, మంచు, వ్యాపించినవి. మరల కొన్నిలక్షలయేండ్లు వెచ్చని భోగ్యస్థితిగల్గినది. ఈ లోగా భూమిలోపలిభాగము మారుచుండెను. కొన్నిలక్షల యేండ్లు భూగర్భమున ఉద్రేకముగల్గి, అచ్చటిశిలాద్రవము అగ్నిపర్వతపు జ్వాలలై పైకెగసెను. క్రొత్తకొండలు భూభాగ[illegible] నేర్పడెను, కొన్నిచోట్ల సముద్రముల లోతుహెచ్చెను; [illegible]లింకను పెరుగజొచ్చినవి. భూగర్భములోని పరిణా[illegible] అందుచే భూమిపై శీతోష్ణస్థితియు

మారినవి, ఈప్రళయాంతమున కొంత స్తిమితపడెను, పొగ మంచువానకి లుగుచు, క్రమముగా ప్రవాహములు హెచ్చెను; ఆప్రవాహములలో జేరి, కొండమట్టి వండుగా సముద్రమునకు చేరెను, అందుచే కొన్ని సముద్రభాగములు మెరకలైనై, అచ్చటి హెచ్చునీరు మరియొకవైపు పల్లపుభూమికి ప్రసరింప జొచ్చెను ఇట్లనేకవిధముల మెరకపల్లములు మారుచుండెను భూమిపైభాగము గట్టిపడినప్పటినుండి భూమి క్రమముగానే చల్లబడుచుండెనని పాఠకులు తలపకూడదు భూపటలము కొంతచల్లనై పెంకువలె నేర్పడగనే భూమధ్యభాగపు శీతోష్ణ స్థితికి పైనున్నస్థితితో సంబంధము పోయినది 'అజీవయుగ' మను కల్పాదినే భూమిపై హిమప్రళయము కలిగినట్లు చిహ్నాలు కలవు

మత్స్యయుగాంతముకు లోతులేని సముద్రములు సరస్సులు నేర్పడెను అప్పటికి, ప్రాణికోటి జలభాగమునుండి స్థలప్రదేశముకు విరివిగావ్యాపింపదొడగెను వీనిలో కొన్ని అప్పటికి కొన్నిపక్షులయేంన్లుముందేమారుమూలలమాత్రమె ట్లోయుండెను కానివిరివిగావ్యాపించుట కప్పుడేవీలుకలిగెను.

ముందుగా తరుజాతి, దానివెంట కొలదిలోనే జంతుజాతి, నేలపైకి వ్యాపించియుండును ఇదివరలోనీళ్ళే మొక్కల తలలను ఎండకెదురుగా పైకితేల్చియుంచెను ఇప్పుడు నీటి

పట్టులేకుండ మొక్కలు భూతలముపై నిల్చి తలయెత్తుకొనుటెట్లు, మరియు ప్రక్కలనీరు లేనందున, పాగములక్రింద నున్న భూమిలోనిబురద నీరు తన దేహనాళములలోనికి పైకి తెచ్చుకొనుటెట్లు, అనుసమస్యలు గలిగెను. మొక్కలలోపల నంతటను తిత్తులవంటి గట్టి కాడ లేర్పడి, అందుచే మొక్కలునిలిచియుండుటకును, వాటినాళములద్వారా నీరు తీసుకొనుటకును వీలై, ఈ రెండుసమస్యలును పరిష్కారమయ్యెను. ఆ కాలపు శిలాచిహ్నములలో నిట్టికాడలుగల మురుగునేల మొక్కల శేషములు చాలగ గన్పట్టును వీటిలో కొన్ని వృక్షములు, కొన్ని తుప్పలువగైరాలును గలవు వీటివెనుక నొక్కొక్క యుగము గడచినకొలది, అనేకజాతుల జంతుజాలములు నీటినుండి భూస్థలి కెగబ్రాకినవి. అందు గొన్ని శతపదములు, కొన్ని సహస్రపదములు, కొన్ని ఆదిమజాతిపురుగులు, వీత[illegible] సముద్రపు తేళ్ళకు సంబంధించినవి కొన్ని, క్రమముగా మొట్టమొదటి సాలిపురుగులును [illegible] అంత[illegible] వంశాస్థికములు కలిగెను.

కొన్ని [illegible], ఆ కాలపు రా[illegible] [illegible] రెక్క[illegible] [illegible]ణము[illegible] [illegible]గపడి. ఇదివరలోని జంతువులు నీటిలో జేరి[illegible]

గాలినే పీల్చుకొనెను ఇప్పటికిని జలచరము లన్నియు నట్లే చేయుచున్నవిగదా! కాని స్థలచరములు కాజొచ్చినజంతువు లకు వలయు తడినాజంతువులు తామే సంపాదించుకొనవీలు కలిగెను ఊపిరితిత్తులలో తడిలేనివా రూపిరియాడక మరణిం తురు వీటిద్వారా గాలి రక్తములోనికి ప్రవేశించుట కూపిరితిత్తులలో కొంతతడి యుండుట యవసరము ఈపువ్వా రల తడిని కాపాడుటకై వాటిపై పొరలేర్పడెను కొన్నిటికి క్రొత్తరకపుతిత్తులు అనగా శరీరములోపలనే తడి లాగుకొని భద్రపరచుకొను శ్వాసకోశము లేర్పడెను ఇట్లు క్రొత్తస్థితితో సమన్వయముకల్గెను పురాతనపుచేపల పువ్వారలు మెట్ట గాలి పీల్చుట కుపయోగింపవు ఆపువ్వారలు స్థలచరము లలో శ్వాసకోశముగా మారెను

కప్పలు, బల్లులు మొదలగు ఉభయచరములు జల చరములుగా పుట్టి, పువ్వారలద్వారా గాలి పీల్చుకొను చుండును, కొంతకాలముకు చేపల యాతత్తిత్తిబోలు సంచి నీటి మెడక్రింద నేర్పడి, అందు శ్వాసకోశము పెరుగును. ఈలోగా మొదటిపువ్వారలు రాలి, ఆకన్నములు పూడి పోయి, కర్ణరంధ్రమునిమిత్త మొక్కద్వారమే మిగిలియుం డును ఈస్థితికి వచ్చినజంతువు నేలపై గాలినే పీల్చును; కాని యిది కాన్పుకు గుడ్లుపెట్టుటకై నీటిలోనికి పోవలెను

ఈమురుగు (కూర్మ) యుగపు (శా... వెన్నె ముకగల) క్రిమికీటకములు మొలకలు ఉభయత్రి యుండు నవే చాలవర కివి యిప్ప... కూర్మ తివి ఇందులో కొన్ని పెద్దవి ఇవి భూచరములైనను చెప్పనే నే యుండ వలెను అప్పటివృక్షములు నిట్టివే వీని కింకను మొట్టపై వర్షోదకముతోను మంచుతడితోన మొలకలెత్తగల గింజలు గాని ఫలములుగానిలేవు, వానిపుప్పొడి నీటనేపడి, అందే మొలకలెత్తవలెను

ఇట్లు ప్రాణులశరీరమున సందర్భోచితముగ మార్పు లు కలుగు విచిత్రపరిణామమును కూర్చి 'కంపారటివ్ అనా టమీ,' అనబడు సర్వజీవాంగవిజ్ఞానము వలనరమ్యముగ తెలి యును ప్రాణులన్నియు అసలు జలసంబంధులే. చేపలు మొదలు మనుష్యునివరకున్న వంశాస్థికజంతువులకు, గ్రుడ్డు గానో, గర్భస్థపిండముగానో, ఉన్నపుడు చేపపువ్వార లుం డును. తరువాత నవి పిల్లపుట్టలోగా వానియంగములనుండి మారించిపోవును. జలచరములగు చేపలనేత్రములకు రెప్పలు లేవ, నీటిస్పర్శయే యుండును, భూచరములైన పెద్దజంతువుల తో ఆకండ్లకు ఎండనుండి రక్షించురెప్పలు తడిని భద్రపరచు... ... నేర్పడును. గాలిలోనిధ్వని పొందము, అందు... ... చెవిగూబ యవసరమయ్యెను. ఇట్లే దేహ

మందలి యింద్రియము లన్నిటిలోను పరిసరముల కనుగుణమగు మార్పులు సరుదుబాట్లు చేర్పడెను ఆ'కర్బనకర'యుగపు ఉభయచరప్రాణులు మెట్టగాలి పీల్చగల్గినను, కాన్పునకు నీటిపై నాధారపడి, మురుగుస్థలములందు, తీరములందు, నీళ్ళలోగట్టుదగ్గరను, మాత్రమే వసించుచుండెను అప్పటికొండలు, మెట్టలు, ఇంకను నిర్జీవముగ నుండెను *

* అన్ని జంతువులు పుట్టుటకు ముందు తమతల్లులగర్భమందు కొంత కాలముండును కొన్ని పక్ష్యాదులు కొంతకాలము కండములుగ నుద్భవించి, కొద్దిరోజులలో పొదిగి శిశువులగును మిగిలిన పెద్ద జంతువులును నరులును గర్భమందు చాల నెలలు పిండరూపముగ నుండును ఈ అండ పిండములను వైజ్ఞానికులు సూక్ష్మదర్శనిద్వారా పరీక్షించి చూడగా, అవి మొదట అత్యల్పప్రాణులుగను, అంతట మత్స్యాంగకములుగను, తరువాత కూర్మాదిరూపములుగను క్రమముగా మారుచు, చివరకు ఆయాజాతి యాకారము నొందునని తేలినది మన మనుష్యప్రాణులు నిట్టే గర్భస్థ పిండములుగా నున్నప్పుడీ యాకారములన్నిటిని, అంతట నొకరీతి కోతి రూపును, పొందిన తరువాతనే, నరశిశువుగా నేర్పడును ఐతే, ఇవియన్నియు పిండస్థితిలో గర్భమందే కలుగుటచే మనకాసంగతి తెలియదు కాని, ఈపూర్వపరిణామములు ప్రతివ్యక్తికిని జనించుటకుపూర్వము తప్పక కలుగుచుండును అనగా సృష్టిలో మనభూమిపైన యుగములకొలదినుండి కలుగుచున్న జీవపరిణామము ఆయా ముఖ్యజాతుల ప్రతివ్యక్తియందును క్లుప్తముగా కలిగి ప్రతిబింబితమగును జీవపరిణామసిద్ధాంతము తథ్యమే అనుటకిదియు నొక నిదర్శనము ఇట్లు పిండోత్పత్తినుండి శిశుజననము వరకు జరుగు క్రమపరిణామమును తెలియజేయు శాస్త్రము 'ఎంబ్రియాలజీ' (=పిండశాస్త్రము) అనబడును

3

# 6 సరీసృపయుగము (కూర్మయుగము-2)

ఈకర్బనకరయుగపు సమృద్ధప్రాణుల కంతట నొక
నిర్జల ప్రళయదశ కలిగెను అప్పటి శిలాధాతువుల
ప్రపొరలలో జీవరాశి చిహ్నములులేవు, అవి పట్టి యిసుక
రాళ్లే యగుట యిందుకు నిదర్శనము అప్పుడు శీతోష్ణ
స్థితి తీవ్రముగ మారి, కొంత కాలము హిమమావరించి
అతిశీతలముగనుండెను. అంతట, చాలస్థలములం దాముదుగు
నేలల చెట్లన్నియు నశించి, ఇసుకరాళ్లతో కప్పబడి, అణగిపో
యి క్రమముగా ఖనిజములైనవి. ఇప్పుడు లోకమందున్న
రాతిసిబొగ్గుగనులలో చాలభాగ మట్లేర్పడినదే *

కాని యిట్టి యుగసంధులందే, ఆకష్టము లనుభ
వించు ప్రాణికోటిలో తీవ్రపరిణామము సంభవించుచుండును
నూతన మన్వంతరమున, పెచ్చదనము ఉదకము తిరుగ
భూతలమున సమకూడగనే, కొత్త జాతుల జంతువులు
వృక్షములు జనించెను ఆకాలపు శిలలందలి దేహా శేష
ముల బరీక్షించినచో, అప్పటివంశాస్థిక జంతువులు పెట్టి

* మనదేశపు పర్వతములన్నిటిలో ప్రాచీనములగు హా[illegible]
[illegible], రాణిగంజి, సింగరేణి, మొదలగు బొగ్గుగనులస్థలముల
[illegible]

గ్రుడ్లు ఇదివరలోని వాటివలెను చిరుకప్పలవలెను నీటిలో కొంతకాల ముండనక్కరలేకయే, శిశువు పుట్టగానే నేలపై స్వతంత్రముగ జీవింపదగు అంగము లేర్పడినట్లు కన్పడును అవి పుట్టునప్పటికే పువ్వారలుపోయి, ఆకన్నములు గర్భ మందే పూడిపోవును చిరుకప్పల యవస్థలేని యీాక్రొత్త జాతి జంతువులే సరీసృపములు ఆకాలమందే చెట్లకు గింజ లేర్పడి, సరస్సురొంపి యవసరములేకనె, ఇతరస్థలములందు రాలినను, అవి మొలకలెత్తెను అప్పటికింకను నేలపై గడ్డి మొలచుట, మొక్కలుపుష్పించుట, లేదు కాని తాడి జాతివగు కొన్ని యుష్ణదేశపు మొక్కలు బయలుదేరినవి. అడవితుప్పలు పురుగులు చాల యుండినవి అప్పటి కింకను తేనెటీగలు సీతాకోక చిలుకలు లేవు, కాని పేడపురుగు లుండినవి అనగా, ఈప్రళయకాలముననే స్థలార్హమగు వివిధప్రాణు లారంభించినవి పరిస్థితులు అనుకూలముకాగ నే, అవి వృద్ధియై వ్యాపించెను. యుగములుగడచి, పరిస్థితు లుమారి, భూమిలో నగణ్యమగు కంపములు చలనములు కలుగుచుండినవి వీటికితోడు భూమిక్రాంతివృత్తములోను దానికిని భూధ్రువముకునువంపులలోను మార్పులచేతనుచాల చోట్ల వాతావరణ ముష్ణమయ్యెను. ఈయుగము మొత్త ము 20 కోట్ల యేండ్లుండియుండును ఇది 'మధ్యజీవయుగ'

మనబడును దీనికిపూర్వపువగు 'అజీవయుగ'ము, 'పురాణ జీవయుగ'ము రెండునుకలిసి మొత్తము 140 కోట్లయేండ్ల కాలముండెను ఈమధ్య జీవయుగమున వివిధసరీసృపములు అసంఖ్యాకముగ వ్యాపించెను. అందుచే, దీనిని 'సరీసృప యుగ' మందుము ఈయుగము గతించి యిప్పటికి సుమారు 8 కోట్ల వత్సరములైనవి ఈమధ్యజీవయుగము తరవాత, 'నవజీవయుగ'ము, ఆపిమ్మట మన ఆధునికయుగమును వచ్చినవి

మన ప్రస్తుతకాలమున సర్పజాతుల రకములు, వాని వ్యాప్తి, చాలతక్కువ (అంతకును పూర్వపు ఉభయచర జాతికన్న, సరీసృపముల సంఖ్య యిపుడు హెచ్చుగనే యున్నది) మనముచూచు పాములు, మొసళ్లు, తాబేళ్లు, కూర్మజాతులు, బల్లులుకూడ, ఈ సరీసృప జాతిలోనివే ఈ జాతిజంతువు లన్నిటికిని సాలుపొడుగునను వేడియుండ వలెను ఇవి చలికి తాళలేవు పూర్వపు మధ్యజీవయుగ మందుండిన సరీసృపములు నిట్లేయుండెను. అప్పటి జంతు వులు వృక్షములుకూడ వేడిలోనే పెరిగెను, మంచుకు నిలువ లేకపోయెను. కాని అంతకు పూర్వపు ప్రాణుల కవసరమైన [illegible] అక్కరలేక, ఇవి మెట్ట కలవాటు పడెను. [illegible] వేళ్లాక, ఈయుగపు సరీసృపములలో ఇంకను

చాలరకములు, కొన్ని చాలపెద్దవియు, ఉండినవి, మహాకూర్మములు, దీర్ఘమకరములు, బల్లులు, కాలసర్పములంనేగాక, ఈకాలమునలేని కొన్ని యద్భుతజంతువులు నుండెను. 'దినోసారు' లను [illegible], ఇతరభీకరమృగములును ఉండినవి. ఇంతేగాక, ఆకాలమున పల్లములందు గెల్లు, తుప్పలు, పొదలు బయలుదేరినవి. తృణాహారులగు సరీసృపము లు కూడ బుట్టి, అందు దూరి, క్రమముగ చాలవృద్ధి నొందినవి. వీనిలో కొన్ని నేటి నస్థలచరములకన్న పెద్దవై, తిమింగలములంతయుండెను 'డిప్లొడోకస్ కార్నెగై' అనునవి 84 అడుగుల పొడవుండినవి, 'జిగాంటసారసు' జాతి 100 అడుగుల వరకు నుండెను వీనినిభక్షించుమాంసాహారులగు 'దినోసారు' లు నాడ అట్టిదీర్ఘకాయములే, వీనిలోని 'టైరన్నొసారస్' అను రకపు సరీసృపము అన్నిటికన్న భీకరమని చాలగ్రంథము లలో వర్ణింపబడినది

ఈమహాజంతువు లీ 'మధ్యజీవయుగ'పు శాద్వలములను దినుచు వేటాడుచుండెడి, ఇంకొకతెగవి ముఖాంగములయందు గబ్బిలపురెక్కలవంటి యంగములలవై, పురుగులపై కెగురుచు, కొన్నిటిపై వ్రాలుచుండినవి ఇవియే 'టెరోడాక్టిలు' లు; కొన్నిముక్కగల్గి యెగురనేర్చిన మొదటిపక్షిజాతి యిదియే

కొన్ని సరీసృపములు సముద్రము చేరినవి. ఇందు 'ఇక్థియోసార్లు', 'మొసాసార్లు', 'ప్లెసియోసార్లు,' అను మూడు రకములుండెను అందులో గొన్ని ప్రస్తుతపు తిమింగలములంత యుండెను 'ప్లెసియోసార్' నెగ జంతువు లిప్పుడెచ్చటనులేవు ఇవి బలిష్ఠములు, మహాకాయములు, నీటిలోనీదుచు, చవిటినేలలోను మెరకనేటిక్రిందను నడువ వీలగు తెడ్లవంటి పాదములు, అల్పశిరస్సు, దీర్ఘకంఠము కలిగియుండినవి ఇవి హంసలవలె నీటిపై నీదుచునే ఆహారము గొనెడివో, లేక నీటిలో నణగియుండి, ఆహారినిబోవు మత్స్యాదుల భక్షించుచుండెడివో, తెలియదు 'ఇక్థియోసార్లు' సముద్రమందు ధారాళముగ దిరుగుచుండినవని తోచును

మధ్యజీవయుగపు స్థలచరము లిట్లువృద్ధియై, అంతకు పూర్వపుజంతువులకన్న బలము శక్తి వేగముగల్గి, దీర్ఘకాయములై యుండెను జలరంగమున నింతటి యభివృద్ధిలేకున్నను, అచ్చటను ప్రాణులు బృందములుగా వృద్ధిగాంచినవి శంఖాకృతి డిప్పలుగల 'అమనైట్' అను ఒకజాతి జంతువులు 'పురాణజీవ' యుగమున బొడసూపి, ఈయుగమున వృద్ధియై, లోతులేని నీళ్ళలో విశేషముగా నుండినవి, ఈజాతి జంతువులిప్పు డసలేలేవు. కాని యుష్ణదేశములందిప్పుడున్న సన్నని నత్తలు మున్నగునవి వానిని కొంతవరకు బోలియుం

డును మరియు చేపలలో నింతకు పూర్వముండిన డిప్పలు పంటివంటి చెక్కలుగలవిపోయి, ఈయుగమున చక్కనిపొలుసులుగల మత్స్యము లుదయించి, వృద్ధినొందెను, ఈజాతివి నేటివరకు విశేషముగా వ్యాపించియున్నవి*

---

* ఆకాలమున మన భారతదేశమును ఇప్పటికన్న చాల భయంకర మృగములతో అనేకజాతుల క్రూరసరీసృపములతో నిండియుండినట్లు కనబడును అప్పటికి దక్షిణహిందూదేశము, ఆఫ్రికాఖండముతోను ఆగ్నేయదిశదీవులతోను కలసి ఏకఖండమై యుండెను యూరపు మొదలగు యుత్తరప్రాంతములందు ఆర్యావర్తమందు కన్న మనప్రాంతమందున్నను అధికము అందుచే నిచటి సర్పజాతులు చాల హెచ్చువి, చాలరకములవి, ఎక్కువ అపాయకరములుగ నున్నవి మరియు హిందూమహాసముద్రమందు నదులందును, ఇప్పటికిని చాల మొసళ్లు విషసర్పములు కలవు పూర్వము వాసుకి, తక్షకుడు, మున్నగు బలీయములగు మహాసర్పములుండినట్లును, భూమికి ఆదిశేషుడను సర్పమే ఆధారమైయుండినట్లును, మన ఆర్యులలో ఐతిహ్యముకలదు ద్రావిడజాతులు (అందుముఖ్యముగా దాక్షిణాత్యులు) సర్పముల విశేషముగ పూజింతురు దక్షిణదేశపు సామాన్యపు గుళ్లలో చాలవరకు ప్రాకారమంతటను లోపలనుగూడ నాగవిగ్రహములనేకములు గలవు నాగులచవితినాడు నాగపూజచేయు మామూలు మన ప్రాంతమునగూడ నున్నది మానవసంచారమారంభించినమీదట అర్జునుని ఖాండవదహనము జనమేజయుని సర్పయాగము మొదలగు సమయములందనేక మహాసర్పములు అజగరములు ప్రత్యేకప్రయత్నములచే చంపబడి యుండును అయినను ప్రపంచమందిప్పటి అన్నిరకముల సర్పజాతులును భారతదేశమందిప్పుడును కలవు మన దేశమున మాత్రము సస న

జాతులకన్న సరీసృపముల సంఖ్యయే యిప్పటికిని హెచ్చుగా నున్నదని తోచును 1933-34 వ ఏట మన దేశమున పాముకాటు చేతనే అయిదు లక్షలపైగా జనులు చనిపోయిరి

## 7 మొదటిపక్షులు, మొదటిసస్తనులు
### (వరాహయుగము 1)

మధ్యజీవయుగపు తృణసమృద్ధిని సరీసృప బృందముల గూర్చియు తెలుసుకొంటిమి ఆ 'దినోసారు'లు నగాగ్రములందు చవుడునేలలందు ప్రబలియుండ, 'టెరోడాక్టీలు'లు అప్పటి (పూవులేని) తరుగుల్మములపై కీటాదుల వేటాడ, వాటి ఘీంకారములతో మహారణ్యములు ప్రతిధ్వనించియుండును ఆసమృద్ధజీవకోటిలో మూలనున్న కొన్ని మాత్రము నూతనశక్తు లలవరుచుకొని, సమానశీలములైనవి కొంతకాలమున కెండ మందమై భూతలపరిస్థితులు మారినను, ఈ జాతి జంతువులు నశింపక, నూతనపరిస్థితులకు సరిపెట్టుకొనగల్గెను

దినోసారులలో గంతులువేయు కొన్ని పొట్టిజంతువులు ఆహారాదులకై పెద్దజంతువులతో పోటీపడునపుడును, తమ శత్రుజంతువులు వెంబడించునపుడును, చల్లని ఉన్నతగిరుల పైకిని నీటిమీదికిని పోవలసియుండెను, లేనిచో నశింపవలసియుండెను అట్టి బాధలో నుండుచు తంటాలుపడు కొన్ని జంతుజాతులు కొట్టుకొనుటలో వాటికి కొత్తరకపు పొలుసు లేర్పడెను అవి క్రమముగ గద్దకలములవలె పొడవగుచు, ఈకల యాకారమొందినవి, ఈ యాక

లోకదానిపై నొకటి దట్టముగా నుంచుచు, తక్కిన సరీసృపముల చర్మముకన్న చక్కగా శరీరోష్ణము కాపాడెను అందుచే నవి సరీసృపములు తాళలేని శీతలదేశములలో గూడ నుండగల్గి, ఆస్థలములందు వసింపదొడగెను ఆకాలమునసే కొన్నిటికి తమగ్రుడ్లవిషయమై యెక్కువశ్రద్ధ గలిగి యుండును సరీసృపములు తమగ్రుడ్ల నశ్రద్ధగా విడుచును. ఆగ్రుడ్లు యెండకు గాలికి పొదుగవలసి యుండును కాని ఈనూతనజాతి తమగ్రుడ్లను కాపాడుచు, వాటిని తమ శరీరోష్ణముచే వెచ్చజేయ నేర్చెను చల్లని వాతావరణముకీప్రాణుల శరీరములలోపల గూడ మార్పులుకలిగి, అవి క్రమముగా నుష్ణరక్తములై, స్వేచ్ఛావిహారులగు పక్షిజాతిగా నేర్పడెను. మొట్టమొదటి పక్షులు చేపలదిను సముద్రపక్షులు, వాటియుపాంగములు రెక్కలుగా నుండక, తెడ్లను బోలి, 'పెంగ్విన్' జాతివివలె నుండెననియు తోచును. న్యూజీలండులోని (చిన్నయీకలుమాత్రముగల) 'కివి' అను పురాతన జాతిపక్షి మామూలుగా నెగరలేదు. అది పక్షివంశపుదికాదు పక్షుల శరీరపరిణామములో రెక్కలకన్న యీకలే ముందుగా వచ్చెను, కాని యీకలువచ్చినతరువాత వాటిని విప్పుచుండుటచే, క్రమముగా తప్పక రెక్కలేర్పడెను. శిలాధాతువులలోని యొకపక్షి దేహశేషమును పరి



'కివి' (ఇప్పటికిని న్యూజీలండులో నున్నది)

క్షించవగా, దానికి సరీసృపములకుండు దవుడ, పండ్లు, పొడుగు తోకయు, పక్షిరెక్కలు గూడ నుండెను అట్టిజంతువు మధ్యజీవయుగ మందలి టెరోడాక్టిలునుండి తన్ను రక్షించు కొనగలిగియుండును. అయితే, అప్పుడు పక్షుల సంఖ్యయు వాటిరకములును చాలతక్కువ అప్పటి దేశమున కిప్పటి నరుఁడు పోగల్గెనేని, అతడు రోజులకొలది తిరిగినను, పక్షిస్వ రూపమే కంటబడియుండదు ఆరెల్లుదుబ్బులలో టెరోడాక్టి లులు మొలకలచిగుళ్ళలో కీటకములును మాత్రము సమృద్ధి గా కనబడియుండును వానికి 'మేమలు'లు (అనగా పాలిచ్చి శిశువులను పోషించుకొను నస్తన జంతువులు)గన్పడియుండవు. పక్షిజాతి యుదయించుటకు కొన్ని లక్షలయేండ్లు ముందే నస్తనులుపుట్టెను, కాని, అప్పటికవి చిన్నవై మారుమూలల నుండుటచే, వాటి నాతడు గమనించి యుండడు

ప్రథమపక్షులవలెనే, మొదటి నస్తనులును జీవితపు పోటీవల్లను ఘర్షణవల్ల, క్లిష్టజీవనమునకు శీతలదేశవాస మలవడుటలో, అట్లు పరిణమించియుండును వాటికిని మొదట పైపొరలు గద్దకలవు యీకలవలె నేర్పడి, శరీరోష్ణ మును కాపాడగా, క్రమముగా అవయవములలో మార్పు లుగల్గి, రక్తము వెచ్చనై. అవి స్వేచ్ఛగా సంచరింపగల్గెను వివరములు భేదించినను, అవికానస్వరూప మొకటియే;

ఈకలకు బదులు, వీటికి రోమము లుద్భవించెను గ్రుడ్ల నుపెట్టి రక్షించి పొదుగుటకు బదులు ఈజంతువులు తమసంతానముకు అంగనివృత్తియగువరకు, తమదేహమందే యుంచుకొని, వాటిలోకొన్ని సవిప్రసవులై, కనినతరువాతగూడ ఆశిశువునుగాపాడి, పోషింపదొడగినవి *'మేమలు'లలో దాదాపు అన్నిటికిని స్తనములేర్పడి అవిశిశుపోషకములయ్యెను ఈమేమలుజాతులన్నిటిలో రెండురకములకుమాత్రమే సరియగు స్తనములు లేవు అవి గుడ్లుపెట్టి తమశిశువుల తమచర్మములోపల నేర్పడు నొకవిధమగు బలకరరసము నిచ్చిపోషించును, బాతుముక్కుగల 'ప్లాటిపసు', 'ఎచిడ్నా'యు, ఇట్లుచేయుచున్నవి 'ఎచిడ్నా' అనునది తోలుగుడ్డుపెట్టి, తనకడుపులో నొక సంచిలో నుంచుకొని, అవి పొదుగువరకు వాటిని వెచ్చబెట్టుచు కాపాడును మధ్యజీవయుగమున మనప్రేక్షకుడు రోజులు వారములు తిరిగినను పక్షులు కనబడనట్లే, అతని స్థూలదృష్టికి సస్తనులును కన్పడియుండవు పక్షులును సస్తనులును గూడ ఆయుగపు ప్రాణులలో కేవల మల్పములు నీచములు అని స్థూలదృష్టికి

* అనగా సరీసృపజాతివలె అండజములుకాక, ఈ 'మేమలు' [illegible] సాధారణముగా పిండజములు, ఇవి సస్తనులై తమశిశువుల [illegible] పోషించి పెంచుటయేగాక, వాటికి మనోవికాసమును ప్రేమను [illegible]

తోచదగియుండెను ఈసరీసృపయుగము సుమారు 8 కోట్ల వత్సరము లుండెనని తోచును ఆకాలపు పరిస్థితులను నరు లెవ్వరైన గమనించినచో, ఆవస్తుసమృద్ధి, చక్కనియెండ చురు కుగా సర్వత్రి వ్యాపించుచు నెగురు గాళులు, బలీయములగు దినోసారులును, భద్రిముగ శాశ్వతముగ నుండిపోవునని తలచియుందురు కాని ఈనిత్యత్వాభాసముకు విశ్వలీనమగు గూఢంప్రివృత్తితోను, అపిమేయమగు విశ్వశక్తులతోను, సంఘర్షణకలిగి, ఆపాణులు క్షీణింపజొచ్చెను వేలకొలది యేండ్లు గడచుచురాగా, పరిస్థితులు కొంతకాల మట్లేయుం డినట్లున్నను, మనకగాిహ్యమగు క్లిష్టపరిస్థితులు కొత్తగా నేర్పడెను కొండలు సముద్రములు మారి, భూతలస్వరూ పమే మార్పుచెందెను ఈమధ్య జీవయుగము చాల కాలము వృద్ధినొందినను, యుగాంతము రాగా పిళయ చిహ్నములు కలిగినవి ఆభౌతికవిపర్యయముచే నూతన పరిస్థితులు కలిగి అప్పటిప్రాణికోటి జీవితము దుర్భరమ య్యెను అట్లెదుర్కొను వినాశమునుండి రక్షించుకొనుటకై, 'అమనైటు'లు మొదలగు అప్పటి కొన్ని పాిణి జాతుల అవయవములందు, ఆ స్థితిగతుల కనుకూల మగునటుల చిత్రవిచిత్రమైన మార్పులు కలిగెను. స్థిర పరిస్థితులందు నూతన పద్ధతుల యవసరముండదు, అంతశ్శక్తులు పైకిరాక

అణగియుండును, అప్పుడు సామాన్య ప్రాణులును వృద్ధినొందుచునే యుండును కాని నూతన పరిస్థితులు రాగానే, సామాన్యప్రాణులు నశించిపోయి, అంతశ్శక్తి గలవిమాత్ర మాగండము దాటి, పరిసరానురూపమగు రూపస్వభావముల నొందును

అప్పటి కాలపు శిలాధాతువులం దెట్టి ప్రాణిచిహ్నములును కన్పడవు అప్పటి జీవచారిత్రపు సామాన్యలక్షణములు కూడ ఏమియు దెలియుట లేదు ఆ స్థితి కొన్ని లక్షల యేండ్లుండియుండును ఆ తెర తొలగగానే గోచరించు జీవకోటిని పరిశీలింప, అంతయు నూతనరంగముగ నున్నది. సరీసృపయుగము గతించెను ఆ దినోసార్లు, ప్లెసియోసార్లు, ఇస్త్రియోసార్లు మొదలగు మహాబలములగు చిత్రవిచిత్ర జాతులన్నియు పూర్తిగ నశించి, అదృశ్యములై, వాటి సంతతి లేకుండ బోయెను మహాశీతము వాటిని చంపివేసెను; ఆ జంతువులొందిన మార్పులు చాలక, ఆ క్లిష్టపరిస్థితులకవి తాళలేక పూర్తిగ నశించెను. తరువాత భూమిపై కలిగిన నూతన రంగమున వెనుకటికన్న ధృఢతరములగు క్రొత్త [illegible]చర జాతు లుదయించెను. ఈ నవయుగారంభమున ధరాతల[illegible] మింకను నిస్తేజమై నిరుత్సాహకరమై యుండెను. ఇదివరలోని మహాతాళములన్నియు పోగా, వీటిస్థానే వచ్చిన

క్రొత్త తాళ్లు శీతకాలపు మంచుచే నశింపకుండుటకై, తమ యాకుల రాల్ప మొదలిడెను మొక్కలకు, చెట్లకు, పువ్వులు కలుగ నారంభించెను ఇదివరలోని భీకర సరీసృప ములకు బదులు, రకరకములగు పక్షులు, సస్తనజంతువులు నావిర్భవించెను *

---

* ఆ యుగసంధియం దిట్టి హిమప్రళయము, భయంకర భూకంప ము, అగ్నిపర్వతప్రకోపముకూడ, మనదేశమునను కలిగినట్లు నిదర్శన ములు కలవు అప్పటికి ముందుగా మన తూర్పుకనుమలును, తరువాత సహ్యాద్రియు, ఏర్పడెను గోదావరితీరమున 'కోటమావెలి' శిలలలో అప్పటి హిమప్రళయముచే చనిపోయిన అనేక మత్స్యసరీసృపముల 'ఫాసిలు'లు కనబడినవి అగ్నిపర్వతములద్వారా భూమిలోనుండి 'లావా' యనబడు కరగిన శిలాదుల మహాప్రవాహము దక్కనునంతను ముంచివేసెను అంతవరకు ఆఫ్రికాతో కలసి యేకఖండముగానుండిన దక్షిణహిందూదేశ మునకు ఆఫ్రికాకు మధ్యయుండిన భూస్థలి సముద్రములోనికి దించుకొనిపో యెను, అట్టిగట్టు సముద్రములోపున నిప్పటికిని గలవు మాల్దీవు అండ మాను దీవులు మనభూభాగమునుండి అప్పుడేవిడెను తరువాత నీసమయ మందు మనదేశపు ఉత్తరభూభాగము లోనుండియెగసి కొంతముడతలు పడుటచే, హిమాలయపర్వతము లీసమయముననే యేర్పడెను పంజాబు ప్రాంతమందుగూడ ననేకభూకంపములు కలిగెను అంతవుపూర్వము హిమాలయప్రాంతములకు వింధ్యపర్వతములకు నేల సంబంధములేక, పడ మటివైపున రాజపుతానా సముద్రము, తూర్పున నొకసముద్రము నుం డెను ఈభూప్రకోపఫలితముగా నీ రెండుసముద్రములును వెనుకకు

పోయి, భూతలము పైకి లేచిన రాజపుత్రస్థానమునకు మధ్యనున్న యెడారియు కచ్ఛప్రాంతమును ఈసముద్రపు యిసుకభూములే, ఇట్లా ప్రాంతమంతటను భూమియేర్పడి, దక్కను ఉత్తరదేశము కలిసిపోయెను ఒకప్పుడు భూకంపముచే కొన్నిస్థలములు జలగతము లగుచుండెను. ఈ కలియుగారంభమున పశ్చిమతీరపు ద్వారక సముద్రగత మైనట్లు ఐతిహ్యాముకలదు. సింధుదేశము అసలిట్టి యెడారియైయుండ దానిపైన సింధు దివాడు పడుటచే, క్రమముగా ఫలవంత మగుచున్నది. హిమాలయములలో పుట్టి పూర్వపు రాజపుత్ర సముద్రమున పడుచుండిన సరస్వతీ నది, ఇప్పుడు క్రొత్తగా నేర్పడిన యెడారిలో కొంతదూరము ప్రవహించి, వారించి పోవుచున్నది. అది అంతర్వాహిని యని యిప్పటికిని హిందూసంప్రదాయము. ఇట్లేర్పడిన ఆర్యావర్తపు యిసుక నేల, హిమాలయములందలి పూర్వపు అగ్నిపర్వతములలోనుండి వచ్చు 'లావా' పడియు, గంగా యమునా నదులు హిమాలయపర్వతములనుండి సతతము తెచ్చి నింపు నండుచేరియు, ఇప్పుడత్యంత ఫలప్రదమైనది. ఫలవంతమగు ప్రస్తుతవంగదేశపు నేల, గంగా యమునా బ్రహ్మపుత్ర నదులు హిమాలయములనుండి తెచ్చు బండు ఇట్లు శతాబ్దులకొలది సముద్రపుయిసుకపైన పడుచుండుటచే నేర్పడినదే. మధ్యహిమాలయములలోని మానససరోవరప్రాంతమునందు, సంతతహిమపాతముచే నాకాశమునుండి మహాగంగ మేరుగిరిసమీపమున దిగుచున్నట్లుండును, ఆప్రాంతమందే సింధు, గంగా, బ్రహ్మపుత్రానదులు మూడును రమారమి యొకచోటనే పుట్టును, కాని, సింధునది పడమరగాను, బ్రహ్మపుత్ర తూర్పుగను, గంగయు కైలాసపుసమీపమున నుత్పన్నమైన [illegible] దక్షిణముగాను వేరుదారులబట్టి, వేర్వేరు ప్రాంతములను [illegible] భారతదేశమందు ప్రవేశించి, మన ఆర్యావర్తపు ఆయా [illegible] శుద్ధోదకముతోను నింపుచు, అచట్ల ప్రాం

తముల నత్యంత ఫలవంతములు గావించి, అందుల కోట్లకొలది జనుల కమితోపకారులై, విలసిల్లుచున్నవి. ఇంతేకాక, బ్రహ్మ (బర్మా) దేశపు ఐరావతీనది, శ్యామ (సయాం) దేశపు మేకాంగు, చీనాసంపదకంతకు ముఖ్యాధారమై కోట్లకొలది జనులఁబోషించుచున్న ఆదేశపు ప్రధానసము లగు 'హొయాంగ్‌హొ' 'యాంగ్‌ట్సికియాంగ్'లు మొదలగు ఆసియా ఖండపు పావనమహానదులకు హిమాలయపర్వతములే ఉత్పత్తిస్థానము కీనగాధిరాజము ప్రస్తుతప్రపంచపుకొండలన్నిటిలో అత్యున్నత శిఖరములుగలది, అసమానమగు ప్రకృతిశోభగల కాశ్మీరాదిదేశములకును మానసాది సరోవరములకును ఆలవాలము అందలి బదరికేదారాదులు పూర్వము మహర్షుల కాశ్రయములు ఆప్రాంతములు ప్రాచీనార్యులచే దేవభూములని యెంచబడుచుండెను అయితే భూమినయఃకాలమునుబట్టి చూచినచో, ఈమహాపర్వతము అంతగాప్రాచీనముకాదనియు, మనదేశపు రాజపుత్రస్థానమందున్న హారావళీపర్వతములకేగాక, మన తూర్పు పడమటికనుమలకు వింధ్యపర్వతములకుగూడ, తరువాతనే యేర్పడినదనియు, భూతత్వజ్ఞుల యభిప్రాయము ఈహిమాలయపర్వతపుమడత లేర్పడిన తరువాత, దానిలోపలిభాగ మింకను పూర్తిగా కుదుటబడలేదు, దానిక్రింద ననేక పరిణామములును, పూర్వపశ్చిమాగ్రములందు అగ్నిపర్వత ప్రకోపమును, ఇంకనుకలుగుచునే యున్నవి ఆప్రాంతమునను దానికంటియున్న అస్సాము, నేపాలు, ఉత్తరబీహారులలోను, పెద్దభూకంపము లిప్పటికిని కల్గుచున్నవి 12-6-1897 వ తేదీని అస్సాములో కలిగిన తీవ్రభూకంపమును, 4-4-1905 వ తేదీని సుమారు 20 వేల మందికి ప్రాణహాని కలిగించిన కాంగ్రాభూకంపమునే కాక చాల చిల్లర భూకంపములచే గూడ, మార్పులుకలుగుచునే యున్నవి హిమాలయపాదములక్రిందటి మార్పులవల్లను, చిరకాలమునుండి పర్వతములనుండి వచ్చిపడు వండు ఇంత

వరకు సరిగా గట్టిపడక, ఇప్పుడు కుదుటపడుటవల్లను, హిమాలయములకు దక్షిణమున నంటియున్న నేపాళములోను, ఉత్తరబీహారులోను 15-1-1934 వ తేదీని మహాభూకంపము కలిగి, అందు చాల జనులు చనిపోయి, భవనములు కూలుటయేగాక, అచ్చటి భూతలము చిట్లి, మైళ్లకొలది భూగర్భపు యిసుక ద్రవపదార్థము పైకివచ్చి, పల్లపుసాగుబడి భూముల మట్టమంతయు తారుమారై, కల్లోలము కలిగించినసంగతియు, ఇట్లే బెలూచిస్థానపు క్వెట్టాలో 1936 లో నింకొక గొప్ప భూకంపము కలిగి, చాల నష్టము గల్గినదనియు, పాఠకులకు విదితమే. వింధ్యాద్రియు, ఇంకను దక్షిణముగ నున్న కొండలును భూమియు, మిక్కిలి ప్రాచీనములు, మధ్యజీవయుగమందే అచట అగ్నిపర్వత ప్రకోపములు లావాప్రవాహములు పూర్తియై, దాని అడుగుభాగమంతయు బాగుగాగట్టిపడి స్థిరమైనందున, మనప్రాంతములో భూకంపప్రమాదమును అగ్నిపర్వతబాధయు లేవు 1897, 1905 లో వలె, 1934, 1936 లలో గూడ, (ఆభూకంపప్రస్పర్శలుతప్ప) ఉత్తరదేశమందువలె మనకు నష్టమేమియు గలుగలేదు

---

## 8 సప్తనయుగము (వరాహయుగము—2)

'నవజీవయుగ'మను ఆనూతన మహాయుగ మారంభించినప్పుడు, భూమిఉత్క్షేపమును అగ్నిపర్వత ప్రకోపమును చాల హెచ్చుగనుండెను ఆకాలమునందే ఆసియాఖండపు హిమాలయ పర్వతములు, యూరపులోని ఆల్ప్సుగిరులు, ఉత్తరఅమెరికాలో వెన్నెముకవలె నేర్పడిన 'రాకీసు' కొండలు, దక్షిణ అమెరికాలోని 'ఆండీసు' నగములును, భూమిపై భాగమున కుబికి యేర్పడినవి ఇప్పటి మనభూఖండములకు మహాసముద్రములకుగల సామాన్యాకార మాకాలమందేర్పడెను, భూతలముకు సుమారు ఇప్పటిరూపు వచ్చెను ఈనవజీవయుగ మారంభించి యిప్పటికి 4 మొదలు 8 కోట్ల యేండ్లె యుండును

అప్పటికి ప్రపంచమింకను చాలచల్లగనే యుండి, తరువాత వెచ్చబడజొచ్చెను అంతట క్రమముగా, జీవకోటి వృద్ధియయ్యెను, తరువాత చిరకాలముకు తిరుగ క్లిష్టపరిస్థితులుదయించి, అతిశీతమగు హిమయుగములు కలిగినవి, వానినుండి మనప్రపంచ మిటీవలెనే బయటపడినది

శీతోష్ణస్థితులులిట్లు తారుమారగుచుండుటకు కారణములింకను మనకుసరిగా తెలియవు అందుచే ముందెటి మార్పులు కానున్నవో, మున్ముందు మనకు సూర్య తేజము

హెచ్చునో, లేక హిమయుగము తిరుగ మనభూమి నెదుర్కొ నునో, అగ్ని పర్వతములు భూకంపములు ప్రకోపించునో, తగ్గునో, ఇట్టిసమస్యలు పరిష్కరింప దగు శాస్త్రపరిజ్ఞానమిం కను మనకు చాలదు

ఈమన్వంతరమందే తృణజాతు లంకురించి, భూమిపై పశువుల మేతకు వచ్చిక యేర్పడెను పాలిచ్చు జంతువులు కలిగి, ఈతృణముల మేయుచు, వృద్ధి గాంచొచ్చినవి ఇంతలో న్నాజంతువులదిని జీవించు మాంసాహారులుద్భవించెను

తుప్పలను కీటకాదులను దిని, వెనుకటి యుగములో జీవించి చాలవరకు నశించిన సరీసృప జంతువులకును, ఈనూ తన జంతువులకును స్వరూప భేదమంతగా లేదని, పూర్వపు దినోసారులకు ఈసస్తనులకు, పూర్వపు టెరోడాక్టిలులకు ఈపక్ష్యాదులకు, భేదమతిస్వల్పమని, స్థూలదృష్టికి తోపవ చ్చును కాని, ఈపోలిక కేవలబాహ్యామే, విశ్వమందు ప్రాణులు అనంతముగ, అవిచ్ఛిన్నముగ, చిత్ర విచిత్రములగు వివిధరూపములతో కలుగుచున్నవి, సృష్టి సర్వదా వృద్ధి యగుచున్నది. భూమి పూర్వస్థితి ఎన్నడు నొకేరీతిని లేదు. అందుచే సంపూర్ణసామ్య మెచటను లేదు. మధ్యజీవయుగపు ప్రాణులకును ఈనవజీవయుగపు ప్రాణులకునుగల సామ్యము కన్న భేదమే చాలయధికము.

ముఖ్యముగ, ఈరెండు కాలముల ప్రాణులకు మన ప్రవృత్తిలోనే భేదముకలదు ఈక్రొత్తయుగపుసస్తనులు, కొంత వరకప్పటిపక్షులును, తమపిల్లలవిసర్జింపక, వీనితోసంపర్కము కలిగియుండెను సరీసృపములు సాధారణముగా తమగ్రుడ్ల జోలికిపోక, వీనినివిడచి తమదారినిపోవును ఆగ్రుడ్లు తమంతటతామేపొదిగి, పిల్లలు కావలెను సరీసృప శిశువుకు సాధారణముగా తమ తల్లిదండ్రులగూర్చి యేమియు తెలియదు, దానిజ్ఞానము స్వానుభవముతోనే ఆరంభమై తనతోనేఅంతరించును తనశిశువులకు లభింపదు, అది తోడిజంతువులతో సంప్రదించుట, వానిననుకరించి వానివల్లసంగతులు నేర్చుకొని కలసి పనిచేయుటయు, ఉండదు అది యేకాకిజంతువు అట్లుగాక సస్తనులకు, పక్షులకు, తమశిశువుల పోషణము ముఖ్యలక్షణము వానిపిల్లలు శైశవమునుండి తమతల్లిదండ్రుల ననుకరించి, వానిచేష్టలను చర్యలను గ్రహించును, వానిధ్వనుల గనిపెట్టి జాగ్రత్తపడుచు, వానితోకలసి మెలసి పనిచేయును, పరస్పరసహాయముకలిగి, ఒకదానికొకటి లోబడియుండును ప్రపంచమున బోధ్యజాతిజీవులు నవజీవయుగమందే మొదలిడెను

నవజీవయుగపు మొదటిసస్తనుల మెదడు, అంతకు వెనుకటిమాంసభక్షక దినోసారుల మెదటికన్న, అంతగా

ప్రశస్తముకాదు, కాని ముందువచ్చు శిలాధాతువుల బరీక్షించినకొలదిని, అన్నిస్తనులలోను సామాన్యముగా మెదటిబలము చాల వృద్ధియగుచుండినట్లు కనపడును ఆయుగారంభమందే, ఖడ్గమృగమువంటి జంతువులుండెను. ఆకాలమందే యుండిన 'టిటానోథెరియం' అను మహామృగము తనచర్యలందు ఖడ్గమృగమును బోలియుండెను ఇది ప్రారంభదశయగుటచే, దానిమస్తిష్కమిప్పటి ఖడ్గమృగముల మెదటిపదవవంతుకును తీసిపోవును

మొదటిస్తనులు తమశిశువులకు బాలీయగనే, వానిని విడుచుచుండెను కాని తల్లి శిశువులు తమపరస్పరభావముల గ్రహించి కలసియుండుటచే లాభకరమని అవి క్రమముగా గ్రహించియుండును, తరువాతవచ్చు స్తనులు మందలుగా తిరుగుచు, పరస్పరచర్యల గమనించుచు, ఒక్కొకదానికి కలుగు ప్రమాదములను, హానిచేష్టాశబ్దములబట్టి కనిపెట్టుచుండినట్లు తోచును ఈబుద్ధివికాసము వెనుకటియుగపువంశాస్థికజంతువులలో కనబడదు. సరీసృపములు చేపలు కూడ బృందములుగా నుండుట, వాటి గ్రుడ్లనొకచోటనే పొదిగి ఏకస్థలమందుండుటయు కలదు; నిజమే, కాని స్తనుల [illegible]భావమునకు కారణము పరస్పరప్రీతి, కేవల బాహ్యా[illegible]మేకాదు.

సరీసృప ప్రపంచమునకు మనసస్తనులకుగల యీ ముఖ్యభేదమును, సరిగా గ్రహించుట కష్టము సరీసృపముల తీవ్రత, తృష్ణ, వాటిభయక్రోధములు, మన యూహాల కతీతములు వాటియుద్దేశము లేక భావచోదితములు, సహజోద్రేకరూపములు, మనసస్తనుల యుద్దేశము లట్లుండక, మిశ్రితములై, అనేకసందర్భముల చర్చచే నేర్పడుచుండును సస్తనజంతువులకు పక్షులకు, కొంతవరకు మనవలెనే, నిదానము, సానుభూతి సాంఘికబుద్ధియు నుండును అందుచే సాధారణముగ అట్టిజంతువులతో మనము సంబంధము పెట్టుకొనవచ్చును, బాధకలుగుచో, అరచియు, ముఖాది చేష్టలచేతను, అవి మనసానుభూతిని సంపాదించును అవి మన భావముల గ్రహించి లోబడి మనతోనుండునట్లు మనము వానిని పెంచి, మనవిషయమున నిగ్రహాసక్తులు కలిగించి నేర్పవచ్చును 'నవజీవయుగ' చిహ్నమగు యీనూతనచిత్త వికాసముచే, వ్యక్తులలో పరస్పరసహాయము, సంప్రదింపు మొదలిడెను ఈ పరిణామము ముందు రాబోవు మానవ సాంఘికాభివృద్ధికి పూర్వరంగము

ఈ నవజీవయుగము గడచినకొలదిని, అప్పటి చరాచరప్రాణుల కిప్పటివానితో పోలిక యెక్కువగుచు వచ్చినది. ఇప్పటి ప్రాణులతో పోలికలేని వికృతరూపమగు 'ఇంటాథె

రస్' మున్నగు అప్పటి క్రూరమహామృగములు క్రమముగా నశించిపోయెను కొన్ని పూర్వమృగముల స్వరూపము కాలక్రమమున మారుచు రాగా, అందుండి యిప్పటి గుఱ్ఱములు, నీటి గుఱ్ఱములును, ఒంటెలు, ఏనుగలు, దుప్పులు, కుక్కలు, సింహములు, పులిజాతులు, కలిగినవి గుఱ్ఱము క్రమముగా పరిణామమొందిన విధము అప్పటి శిలాధాతువులచే బాగుగ తెలియును శవజీవయుగారంభపు 'టాపిర్' జాతి మృగము క్రమముగా మారి గుఱ్ఱమేర్పడెను, దాని అన్ని స్వరూపముల చిహ్నములు దొరికెను. ఇట్లే 'లామా' జంతువులకును ఒంటెలకును జరిగిన పరిణామ క్రమమును దెలసినది *

---

* భూమి పంక్తిశిలలోను శిలోత్పన్నస్థితిలోను ఆయా యుగాంతములందు ఇట్లు విపర్యయము కలిగి, తరువాతవచ్చు యుగస్థితి అంతకు వెనుకటి స్థితికన్న వేరుగానుండుటకు, భూచక్రమే రీతిగా జరుగకపోవుటకును, సౌరమండలములోని స్థితి కొంత కారణమే, అదియు బాగుగ తెలియదు, కాని ఇంకను వేరేముఖ్యకారణములుండును, కనుక నీ ముఖ్యస్థితి యిట్లు ఉండుట గ్రహించుటకు మన విజ్ఞానముపయోగించుటలేదు భూమి తాను తిరుగుచుండుటయే సూర్యుని చుట్టి వచ్చుచుండుటచే కాలంకగముని సౌర మండలము [illegible] భాగములను మరము [illegible] ఇంతేగాక, [illegible] స్వతంత్రుడు కాడు, తనచుట్టూతిరుగు మనభూమి అంతారక్షము [illegible] సౌరకుటుంబములోనిదిగదా! కాని

సూర్యుడును, మహాకాశమందలి 'గలక్టిక్ సిస్టం' అనబడు విచిత్రమహా చక్రములో నొక అంశము, ఈ యద్భుతచక్రములో సూర్యునివంటివి ఇంకను లక్షలకొలది నక్షత్రగోళములు పరస్పరాకర్షణగలిగి, అగణ్యవేగముతో తిరుగుచుండును గనుక, సూర్యుడును (తన పరివారమగు) సౌరకుటుంబపు గ్రహములుగూడ అవశముగ విశ్వములో నిరంతరము తిరుగుచు, అర్బుదములకొలది మైళ్ళదూరమందున్న యేదో కేంద్రము వైపు అసంభావ్యవేగముతో పోవుచున్నవి (ఈగమనవేగము సెకండునకు అనగా క్షణమునకు 200 మైళ్లుండుననియు, అద్భుతవిస్తృతిగల ఈబ్రహ్మాండమున సూర్యుడొకసారి ఆ వేగముతో చుట్టి స్వస్థలమును వచ్చుటకు 25 కోట్ల యేండ్లుపట్టుననియు, సర్ జేమ్సుజీన్సుగారి అభిప్రాయము) ఈ చక్రగతిచే సూర్యునితో బాటు (సౌరకుటుంబపుదగు) మనభూమియు అట్టి మనోవేగముతో మహావిశ్వమందు మనకు తెలియుటవీలులేని క్రొత్తప్రాంతములకు పోవుచున్నది ఇట్లు అమితవేగముతో పోవుచుండగా, కొంతకాలమునకు ఆప్రాంతముల నూతనపరిసరముల ప్రవేశించుటచేతను, ఇతర మహాగోళముల సామీప్యముచేతను, సూర్యునిలోను భూమివాతావరణముందును భూమిగోళమునను గూడ క్రొత్తపరిస్థితులు కలిగి అందలి జీవకోటి స్థితిగతులు మారిపోవచ్చును, అందుచే ఆ యుగస్థితిమారి క్రొత్తపరిస్థితిచే నూతనయుగము కలుగవచ్చును ఈ అద్భుత మహాచక్రగతిచే దీనిని నియమించు (మనకు తెలియని) మహాకేంద్రపుసామీప్యమో, ఆప్రాంతపు మరియొక మహాశక్తియో, మన వాతావరణస్థితిని మార్చి భూమిపై జీవశక్తిని వృద్ధిచేయవచ్చును ఆప్రభావముచే ఒక్కొక యుగము దాటినకొలది క్రమముగా వెనుకటికన్న హెచ్చుమేధాబలమును అంతశ్శక్తియుగల క్రొత్త ప్రాణిజాతులుదయించుచున్నవని యూహింపవచ్చును ఇట్టి ప్రభావమున

నేకకోటి యుగముల మృగజాతికన్న ఎక్కువజ్ఞానము నైతిక శక్తికల నరజాతి ఈయుగమున కలిగినట్లే, భావియుగములందు సృష్టివికాసమున ఇంతకన్న హెచ్చు నైతిక మానసిక శక్తులుకలిగి మనకిప్పు డద్భుతముగ తోచు దేవజాతులు మన భూమిపైన కలుగునేమో !



## 9 వానరయుగము

జీవశాస్త్రజ్ఞులు ఈసస్తనజాతిని కొన్ని శాఖలుగా విభజించిరి వీటిలో నగ్రగణ్యమగు 'ప్రైమేటు'లను ప్రథమ శాఖలో, 'లెమూరు'లు, కోతులు, తోకలేని వానరములు, మనుష్యకోటియు, చేరును మొదట నీవిభజన ఆజంతువుల దేహాంగసామ్యమును బట్టియే చేయబడినది, అప్పటికి వాటి మనస్తత్వముల బరిగణింపలేదు ఈ ప్రథమశాఖ యెందుండి వచ్చెనో, పురాతన శిలాది పరీక్షచే తేలుటలేదు ఈ శాఖలోని లెమూరుకోతు లరణ్యములలోను, కొండముచ్చులు రాతిస్థలములందును, వసించున ఈ జంతువులు హఠాత్తుగా అణగి శిలాదులందు కప్పబడిపోవుట చాల యరుదు; ఈ జాతివి తక్కిన జాతులంత హెచ్చుగాను లేవు; అందుచే, వీటి దేహశేషములు భూగర్భమున జిక్కి శిలాధాతువులలో జేరి మన పరీక్షకు దొరకుట కష్టము. గుఱ్ఱములు, ఒంటెలు మొదలగు జంతువుల తాలూకు దొరకినన్ని దేహశేషములు వీటివి దొరకలేదు కాని ఈ శాఖ పురాతన వానరములు లేమూరులు నవజీవయుగారంభమందే (అనగా 4 కోట్ల ఏండ్ల క్రిందనే) ఆరంభించెను, వాని మొదడును, అంగవిస్పష్టతయు లోటుగా నుండినవి, అవి ఇప్పటి యీజాతికి తీసిపోవున.

నవజీవయుగపు సంకులప్రాణిలోకము కూడ చివరకు క్షీణించెను కూర్మయుగపు మహాజంతువులకు కలిగిన గతియే వీటికిని కలిగినది ఇంకొకసారి మన ప్రపంచము హిమప్రళయముపాలై, బత్తుగా చల్లబడిపోయెను, తిరుగ కొంత వెచ్చనై, మరల చల్లబడెను. వెనుకటియుష్ణకాలపు నాచులో తిరుగుచుండిన నీటిగుఱ్ఱములు, ఇతరమృగముల వేటాడిన ఖడ్గదంష్ట్రిలగు భీకరశార్దూలములును, ఆహిమప్రళయమున చాలవరకు నశించెను. రోమావృత దేహులగు నొకజాతి ఖడ్గమృగములు, 'మామతు'లు శీతదేశపు ఋషభములు, ధవళమృగములును మాత్రము, ఈశైత్యాహతికి నిలువగలిగెను. క్రమముగా శతాబ్దములు గడచి, ఆర్కిటికుప్రాంతపు మంచుగడ్డ ఉత్తరమునుండి దక్షిణముగాజారి వ్యాపించి, ఇంగ్లండులో థేమ్సునదివరకు, అమెరికాలో ఓహియోవరకును,* వచ్చినవి తరువాత కొంత కాలము వెచ్చగానుండుచు, తిరుగ ఆయాదేశములు తీవ్ర శిశిరములగుచువచ్చెను

ఇట్లు మధ్య మధ్య వచ్చుచుండిన ఈ శిశిరకాలములను ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, హిమయుగము

* అనగా, ఆ హద్దు మన ఆసియాలో ఉత్తర హిమాలయముల ప్రాంతమువరకు సరిపోవచ్చును



'మామత్తు' (నవజీవయుగపు ఈజంతువునుండి ఇప్పటి యేనుగు
పరిణమించినది )

లనియు, వాటిమధ్యనుండిన వెచ్చని కాలములను 'ఇంటర్ గ్లేషల్ పీరియడ్' అనగా హిమమధ్య యుగములనియు, భూతత్వజ్ఞులు చెప్పెదరు మన భూమిపైన ఆ హిమాఘాతముల చిహ్నములింకను కలవు మొదటి హిమయుగము ఆరులక్షల వత్సరములకు పూర్వమును, నాల్గవది 50,000 యేండ్ల క్రిందటను, కలిగెను ఈ దీర్ఘశీతకాలమందలి పరమ హిమముననే నరులబోలు మొదటి జీవు లవతరించెను

నవజీవయుగమధ్యమందును, దవడలు, కాలినరములు కలిగి, తోకలేక, కొంత నరచిహ్నములుగల కోతులుండెను. కాని, ఈ హిమయుగములు వచ్చినపుడే నరులని భ్రమింపదగిన వానరజాతి జనించెనని, ఆకాలపు పనిముట్లను బట్టి తేలును యూరపుఖండమున, 10 లక్షలు మొదలు 5 లక్షలలోపు యేండ్లకిందటివి కొన్ని పూర్వపురాళ్లు (పనిముట్లుగాను, ఆయుధములుగాను, ఎవరో చెక్కినవి) కలవు ఈవస్తువులను 'ఎయొలిత్తు'లు అనగా ఉదయశిలలందురు యూరపులో సీటినిర్మాతల దేహశేషములిప్పుడు లేవు. ఆయుపకరణములే మిగిలినవి నరులుకాక, సూక్ష్మబుద్ధిగల వానరములే వాటిని నిర్మించియుండును. జావాద్వీపములోని 'టిన్రిల్' అనుచోట, ఆకాలపు పురాతనవస్తు శేషములలో నొక 'నరవానర' కపాలమున్నది, దానికి పండ్లు,

ఎముకలు, కోతుల మెదటికన్న పెద్ద మెందడును, కలవు. ఈ జాతి జీవులు నిలిచి నడచినట్లును చిహ్నములున్నవి. 'గచ్ఛన్నరవానరు లనబడు ఉదయశిలానిర్మాతలగు ఈజాతి జీవుల గూర్చి సమాలోచనకీ అస్థిపుంజము మాత్రము మనకు మిగిలినది

ఇక రమారమి [illegible] లక్షల యేండ్లక్రిందటికి వచ్చిన తరువాతనే, నరులజోలు జీవుల చిహ్నములు మనకు మరల కనబడును. అవి వెనుకటివానికన్న నెక్కువ వృద్ధిపొందినవి, [illegible]ప్పటివనివలెనే ఉదయశిలలకంటె చక్కనివి, హెచ్చు పనితనముగలవి, ప్రస్తుత మనుష్యనిర్మితములకన్న పెద్దవి తరువాత (జర్మనీప్రాంతపు) 'హీడెల్బర్గు పురమునొద్ద నొక యిసుకగుంటలో, ఆ కాలపు (గడ్డము లేనిది) దవుడ ఎముక యొకటి దొరకినది. ఇది నరులదానికన్న చాల బరువుగా సన్నముగా నున్నది కనుక, ఇందువాలుక తిరిగి విస్పష్టముగా మాటాడుటకు వీలుకలిగి యుండదు. ఈయస్థికనుబట్టి, ఆ కాలమున మనవారికన్న బలిష్ఠులై నరతుల్యులు రోమావృతులగు వానరసింహజాతివా రుండిరని వైజ్ఞానికు లూహించు [illegible] "హీడెల్బర్గు" [illegible]. ఈదవుడ [illegible] కలిగించును. దీనిని చూచిన అప్పటి [illegible] [illegible]ద్ధము ద్వారా

(62 అ)



పితెకాంత్రపసు (=గచ్ఛన్నరవానరము)



హీడెల్బర్గ నరుడు

చూచినట్లుండును అప్పటి చల్లనిమహాగహనములలో ఖడ్గదంష్ట్రిములగు ఆఘోర శార్దూలముల నోటినుండి తప్పించుకొనా నిడుములబడుచు, ఈ 'హీడిల్బర్గ'నరు డానిబిడారణ్యపు మధ్యను రోమావృత ఖడ్గమృగములకు బెదురుచు తిరుగుచుండెనని తలపవచ్చును ఇంతకన్న నితనిగూర్చి తెలియదు, కాని యీతడు భేదించి తయారుచేసిన పనిముట్లు మాత్రము నిల్చియున్నవి ఆంగ్లదేశపు సస్సెక్సులోని 'పిల్టుడౌను' వద్ద నింకను చమత్కారమగు జంతుశేషములు కలవు ఇవి 'హీడిల్బర్గ' యెముకకన్న పూర్వపువని కొందరు తలచిరి కాని, ఇవి ఒకలక్ష లక్షన్నరయేండ్లవే యని తోచును, దీని కపాలము వానరముల పుర్రెకన్న చాలపెద్దది, దీనివద్దదొరకిన చింపాంజినిబోలు దౌడయెముక దీనిదగునో, కాదో, తెలియదు, ప్రక్కనొక్క యేనుగయెముక గబ్బిలపురూపుగా నేర్పుతో చెక్కి, అందులో నొకకన్నముగూడ దొలిచియున్నది దీనిపైదుప్పితోడ శల్యమొకటి అమర్చియున్నది ఇట్లెముకలలో రంధ్రము గావించిన దెట్టిజంతువు? వైజ్ఞానికులు దీనికి 'ఇయాంథ్రపస్' అనగా 'ఉదయనరుడు' అని పేరిడిరి ఇది 'హీడిల్బర్గ' వానరునికిని తోకలేని కోతులకు నడుమ నిల్చును; ఇట్టిది మరియొకటి దొరకలేదు, చకిముకి రాయివగైరా శిలలతో వీరుచేసిన చక్కని పనిముట్లు మా

ములందు జరుగు అమ్మవారుమున్నగు క్షుద్రదేవతలపూజనను, వర్ణించును, కాని వేదమతమునకు వర్తించదని తోచును వేదములందు గీతలలో, వేదాంతసూత్రములందుగూడ, దేవాలయవిగ్రహముల ప్రశంసయేలేదు ఆర్యహిందువులెవరును గుళ్ళలోనే దేవుడున్నట్లు, ఒక్కొక్క ప్రాంతమునకు ప్రత్యేకపుదేవుడున్నట్లును, భావింపరు మఱియు, యూదుల క్రైస్తవులు తలచునట్లు దేవుండంతరిక్షమందు దెచ్చటనో ఉన్నాడనుభావముగూడ లేదనియు, దేవుడు మహావిశ్వమంతటను సర్వభూతములలోపలనుగూడ ఉన్నాడనియే హిందూమతసిద్ధాంతము హిందూమతము వ్యక్తి స్థాపితముకాదు అది తక్కినమతములకన్న ఎక్కువ విశాలము యూదమతములోను అందుండివచ్చిన క్రైస్తవమతములోను ఉన్న ధర్మదేవతాసూత్రము పశ్చిమ ఆసియాకు యూదపుకు నూతనమే, కాని అప్పటికి పూర్వమే మన వేదములందా సిద్ధాంతము స్పష్టముగా నిర్దేశింపబడినది "సత్యంవద, ధర్మంచర ధర్మాన్నప్రమదితవ్యం" (తై ఉ శిక్షావల్లి) "ఏతస్మాజ్జాయతే ఖంవాయుర్జ్యోతిరాపః ") (ముం ఉ. 2-1-3) అగ్నిర్మూర్ధా (ముం ఉ 3-4) మున్నగు వేదవచనములజూచుడు మఱియు "ఏకోవశీసర్వభూతాంతరాత్మా "(క ఉ 2-5-3) "ఏకోదేవః సర్వభూతా " (శ్వే ఉ 6-11) మొదలగు వేదవచనములలో దేవుడాకాశమందే గాక సర్వభూతములందును ఒక్కడేఅయి వ్యాపించియున్నసంగతి యూదప్రవక్తలకు చాలపూర్వమే ప్రపంచమున ప్రథమపర్యాయము తెలుపబడెను క్రీస్తు పుట్టుటకు చాలశతాబ్దములముందే అనేక హిందూవిద్వాంసులు గాంధారప్రాంతమునుండి, పారసీకదేశముకు బాబిలను యూదదేశప్రాంతములకును వెళ్ళియుండిరి వేదమతములోని సిద్ధాంతములు ఆయాదేశమందలి జ్ఞానవంతులకు తెలియుటచే క్రైస్తవమతసిద్ధాంతము లేర్పడుటకు

సహాయకములయ్యెనని, కొందరు విమర్శకుల అభిప్రాయము ధార్మిక భావములందును, వ్యాపారమందును, అప్పుడు క్రైస్తవమతము జనించిన దేశములకును భారతదేశమునకును మధ్య పరస్పరసంబంధము చాల గలిగి యుండెను

ఈ అధ్యాయమున సూచించిన బలులు మూఢవిశ్వాసముచేతను దేవతల క్రోధశాంతికని చేయు బలుల నుద్దేశించినవి మన దేశమందును ఆదిమద్రావిడజాతు లట్టి బలులిచ్చుచుండిరి ఇప్పటికిని కొంతవర కట్టిబలులు జాతరలు నిమ్నజాతులలో కలవు వేదవిహితమగు యజ్ఞము అట్లుగాక, ఆత్మార్పణసిద్ధాంతముపై ఆధారపడినది వేదయజ్ఞములలోను జంతుహింస కడ కొంచెముగా నుండెను, కాని అది భీతివలనను అభిచారబుద్ధిచేతను చేయునది కాదు, సంతోషముతో స్వార్థరాహిత్యముతో ఈశ్వరార్పణ రూపముగా జనులందరి సేవచేయు సిద్ధాంతముకది సూచకము అప్పటికి ఆర్యబ్రాహ్మణులు ఇంకను మాంసాహారము త్యజింపలేదు తరువాత గంగా యమునా ప్రాంతవాసపుకాలమున, జంతుహింసాయజ్ఞమును జినబుద్ధాదులు తీవ్రముగ గర్హించిరి, జీవహింస ఉపనిషత్తులయందును, తరువాత భగవద్గీతాదులందును గూడ, నిందింపబడినది ఈసంగతి సరిగ గమనింపక, కేవల శాకాహారులగు ఈకాలపు బ్రాహ్మణులు వేదవిహితమను భావముతో యాగములచ్చటచ్చట జీవహింసాయుతముగనే చేయుచున్నారు ఇటీవల కుంభకోణాదులలో జరిగిన యాగములందు శ్రోత్రియబ్రాహ్మణులు అభినివేశముతో జరిగించిన అధిక జీవహింస ఆర్యమతమునుగాక, ప్రాచీనద్రావిడసంప్రదాయప్రవాసననే సూచించునేమో !

---

# 23 గ్రీకులు

క్రీ పూ సుమారు 960 ప్రాంతమందుండిన సాలొమనుకు తరువాత, ఇస్రెయిలు జుడా అను యూదుల విభక్తరాజ్యములు క్షీణించుచుండెను, బాబిలనులో దాసులైన యూదులు తమ నూతన సంప్రదాయ మారంభించుచుండిరి నరులకు మనోవికాసమిచ్చు గ్రీకు సంస్కృతియు నప్పుడే యుదయించు చుండెను. నిత్యుడు సర్వవ్యాపి ధర్మస్వరూపుడు నగు దేవునికే జనులు నైతికముగ బాధ్యులను ప్రత్యక్ష సంబంధమును యూద ప్రవక్తలు నిర్ణయించుచుండిరి, గ్రీకు తత్వజ్ఞులు నరుల మనస్సులకు తార్కిక చర్చాపద్ధతి నలవరచుచుండిరి ఈగ్రీకు లార్యశాఖీయులు; వీరు క్రీ పూ 1000 కి కొన్ని శతాబ్దులు పూర్వమే ఈజియనుల పురములలోనికి ద్వీపములలోనికి ప్రవేశించిరి 'థాథ్మెసు' అను ఫారో తాను జయించిన యూఫ్రటీసు నది కావలిప్రాంతమున గజదళమును మొదట నెదుర్కొను నప్పటికే గ్రీకులు దక్షిణదిశకు బయలుదేరియుందురు. ఆ రోజులలో మెసొపొటేమియాలో గజములు గ్రీసులో సింహములు నుండినవి

నోసను దగ్ధమగుటకు గ్రీకుధాటి కారణము కావచ్చును. ఐతే 'మినాసు' గూర్చియు, ఆయన పాలిసాదమగు

లేబిరిన్తును గూర్చియు, క్రీటనుల కళానైపుణ్యమును గూర్చియు, గ్రీకుకథలు కలవు, గాని వారిని గ్రీకులు జయించినట్లు, గ్రీకుగాథ లేమియులేవు ఇతరార్యులలోవలెనే, గ్రీకులలో గూడ కవులు గాయకులు నుండిరి సాంఘిక సమావేశములందు వీరి గానాదులు ముఖ్యమయ్యెను కొన్ని గ్రీకు తెగలవారు కలసి, ఆసియామైనరులో ట్రాయ్‌నగరమును ముట్టడించి పట్టుకొని కొల్లగొనిన విధమును 'ఇలియడ్' కావ్యములోను, 'ట్రాయ్'నుండి తన స్వంతద్వీపమునకు వచ్చునపుడాయునకు కలిగిన యాత్రానుభవములను 'ఒడెస్సె' కావ్యములోను, గ్రీకుగాయక కవులు, వర్ణించిరి క్రీ పూ. 7, 8, శతాబ్దములలో తమసమీప నాగరికులనుండి అక్షరమాలను గ్రీకులు నేర్చుకొనిరి, ఆ మీదట ఈరెండు యితిహాస కావ్యములు వ్రాయబడినవి కాని, అంతకు చాల పూర్వమే యివి ముఖస్థముగ నుండియుండును. ఆంగ్లాంధకవియగు మిల్టను 'పారడైజ్‌లాస్టు'ను రచించినట్లు, హోమరను నొక యంధకవి యీ రెండు గ్రంథములను రచించెనని కొంత కాలము భావింపబడెను అట్టికవివ్యక్తియొకడుండెనో లేదో, ఉన్నను గ్రంథమాతడే రచించెనో, లేక అప్పటికి వాడుకలో నున్నదానినే సవరించి లిఖితముచేసెనో, అనిపండితవర్యులు వినోదచర్చల జేయుచున్నారు క్రీ పూ 8వ శతా

బ్దమున గ్రీకుజాతి జనులందరిలో నీరెండు యితిహాసములు వ్యాపించి, అందుచే తామొకేజాతివారు ఇతరులు పరజాతి వారు అనుభావము గల్గుచుండెను ఏకభాష ఏకవాఙ్మయము గలిగి ఆచారవ్యవహారయుద్ధాదులం దేకాదర్శము అన్యోన్యత గలిగిన గ్రీకుల సంఘీభావ మిందుచే వృద్ధియయినది

గ్రీకుల కప్పటి కినుము తెలియదు, లేఖనశక్తిలేదు వారనాగరికులుగనుండినట్లు ఆ మహాకావ్యములు తెలుపును మొదట తమచే నాశమొందిన ఈజియనుపురముల ప్రదేశము లందు కుగ్రామములందు వారు తమనాయకుల కొలువుకూటముచుట్టును వసించుచుండిరి. తరువాత తమపురములచుట్టు ప్రాకారములగట్టి, తాముజయించిన జనులనుండి దేవాలయ పద్ధతినిగూడ అలవర్చుకొనిరి ప్రాచీన నాగరికుల పురములాయాజనుల గుడులచుట్టును క్రమముగాకట్టబడెనని, తరువాత ప్రాకారపుగోడ చేర్చబడుచుండెనని, చెప్పుదురు, కాని గ్రీకులపురములో మాత్రము ఆలయముకన్న ప్రాకారమే ముం దేర్పడుచుండెను వారు వర్తకము జేయుచుండిరి, వలస పోవుచుండిరి క్రీ పూ 7 వ శతాబ్దివరకుండిన ఈజియను నగరములును వాటినాగరికతయు అంతరించెను, వాటికిబదులు గ్రీసులోను ఆప్రాంతపు ద్వీపములలోను క్రొత్తపురములు బయలుదేరెను. వీటిలో ముఖ్యమైనవి 'ఆథెన్సు, స్పార్టా,

కోరిన్తు, థీబ్సు, సామోస్, మైలిటస్, నల్లసముద్రపుతీరము పొడుగునను, ఇటలీ సిసిలీలలో గూడ, అప్పటికి గ్రీకునగరము లేర్పడెను. ఇటలీదేశపు పాదభాగము మహాగ్రీసు (మగ్నాగ్రీషియా) అని చెప్పబడుచుండెను ఫ్రాంసుదేశమందలి మార్సి ల్సు నగరమును, అంతకుపూర్వ మాస్థలమందుండిన ఫనీషను పురస్థానమును, గ్రీకులే కట్టిరి పెద్దమైదానముగా నుండి యూఫ్రటీసు నైలువంటి మహానదీప్రయాణ సౌకర్యముగల దేశము లొకే పాలకునిక్రింద ఏకరాజ్యముగా నుండు టసహాజము ఈజిప్టుపురములు, సుమేరియా నగరములు, ఇట్లేకరాజ్య పద్ధతిలో నుండినవి కాని, గ్రీకు నగరములు కొండలోయలలోను ద్వీపములందును చెదిరియుండెను గ్రీసు 'మహాగ్రీస'నబడు దక్షిణాగ్రము గూడ, పర్వతమయములు, గ్రీకుల ధోరణియు నిట్టిదే. వారి చరిత్రారంభముననే, వారు చిన్న విడిరాజ్యములలో నుండుచు, ఏకీభావము లేకుం డిరి వారిలో కొంతజాతిభేదము నుండినది, అయోనియను (యవన), అయోలికు, డోరికు, అను గ్రీకుల మూడుశాఖ లలో నొక్కొక శాఖవారు కొన్ని వేరు నగరములందుండిరి కొన్నిటిలో కొందరు గ్రీకులు మధ్యధరా ప్రాంతపు పూర్వ జాతివారు కలిసియుండిరి. కొన్నిటిలో అచ్చటి పరాధీన జనులపై కొందరు గ్రీకువీరు లధికారులై యుండిరి

స్పార్టా నగరమందలి 'హీలట్లు' ఇట్టి బానిసలే, కొన్ని పట్టణములందలి ప్రాచీనార్య కుటుంబములు ఇతర సంబంధములేని కులీనవంశములుగా నేర్పడినవి, కొన్నిటిలో ఆర్యజాతీయులందరును ప్రజాసత్తాకపద్ధతిలో నుండిరి కొన్నిటిలో ఎన్నికరాజులు, వంశపారంపర్య రాజులును, కొన్నిటిలో బలవంతముగ ఆక్రమణచేసిన రాజులు, సర్వాధికారులగు నియంతలు నుండిరి

ఈ గ్రీకు రాజ్యములు విడిగా నుండుట కచ్చటి భౌతికస్థితి ముఖ్యకారణము అందలి పెద్ద రాజ్యము కూడ చాల యింగ్లీషు జిల్లాలకన్నను చిన్నవి, అందే రాజ్యపు జనసంఖ్యయు సుమారు 3 లక్షల దాటి యుండదేమో! అందులో చాల పట్టణము లేబదివేల లోపువి ఆయాపౌరులు పరస్పరాభిమానులై ఏకోద్యమపరులైనను, ఆయానగరము లేకరాజ్యములో కలసిపోవు ధోరణి లేదు వ్యాపారము వృద్ధియైనకొలది, ఆయా పురములవారు పరస్పరము సంధులు సమాఖ్యలు చేసికొనుచుండిరి మిక్కిలి చిన్నవగు పురములు రక్షణకై పెద్దవాని నాశ్రయించెను ఆనాటి యసంప్రదాయమును నాలుగేండ్ల కొకసారి 'ఒలింపియా' అనుచోట గ్రీకులందరు కలసి పోటీయాటలు జరుపుటయు, గ్రీకురాజ్యములన్నిటికిని సంఘీభావము కలిగించెను వారిలో

వారికి తగవులు యుద్ధములు లేకపోలేదు, అయితే యుద్ధమందు క్రూరత అనాగరికత తగ్గియుండెను వ్యాయామ వినోదములకు వచ్చిపోవు యాత్రికులకు యుద్ధపుప్రమాదము లేకుండ యుద్ధవిరామముండెను కాలము గడచినకొలది ఏకసంస్కృతిభావము, ఒలింపికు ఆటలో పాల్గొనుటయు, హెచ్చెను, చివరకు గ్రీకు రాజ్యములన్నియును, వీటితో సంబంధించిన 'ఎపిరస్' 'మాసిడోనియా' రాజ్యములును, ఆ యాటలపోటీలలో పాల్గొనుచుండెను

క్రీ పూ 6, 7 శతాబ్దములందు గ్రీకులవ్యాపారము ప్రాబల్యము హెచ్చి, వారినాగరికత గూడ చక్కబడినది వారిజీవనము ఈజియనులు నదీప్రాంతీయులు చేయు జీవనముకు కొన్నివిషయములందు భిన్నమైయుండెను గ్రీకులకు గొప్ప దేవాలయములుండినవి, కాని ఆగురువులకు వెనుకటి గురువులవలె సర్వాధికారము లేదు గ్రీకులకు నాయకులు యజమానికుటుంబములు నుండినను, దైవాంశ రాజపద్ధతిచేగల్గు ఆడంబరము వారిలో లేదు వారి సంఘమున కొన్ని 'కులీన' కుటుంబములునుండి, వారిలోనొకరి నొకరు యుక్తస్థితిలో నుంచెడివారు, వారి 'ప్రజాప్రభుత్వము' గూడ కులీనకుటుంబముల ప్రభుత్వమే సామాన్యసభలలో ప్రతి పౌరుడును వచ్చి సార్వజనిక విషయ చర్చలలో పాల్గొన

వచ్చును కాని, ఈనాటి ప్రజాసత్తాక ప్రభుత్వమున ప్రతి నరునకు ఎన్నికయధికారమున్నటుల గ్రీకు ప్రజాప్రభుత్వము లో ప్రతినరునికిని హక్కుండుటలేదు. చాల గ్రీకుప్రజారాజ్య ములందు, కొన్నివందలో వేలో మాత్రము పౌరసత్వపు హక్కుగలవారుండిరి, వేలకొలది బానిసలు దాస్యవిముక్తులు వగైరాలు రాజ్యాంగ విషయములందెట్టి ప్రసక్తియు లేకుం డిరి గ్రీసులో సాధారణముగా ముఖ్యవిషయములు కొందరు 'సమర్థుల'వశముగా నుండెను జనసామాన్యమునకు ప్రముఖ నాయకులైనవారే రాజులు పాలకులు అగుచుండిరి, వారు 'ఫారో' 'మినోస్' లవలె, మెసొపొటేమియా రాజులవలె, దైవాంశగలవారను భావములేదు ఆర్యేతరులలోవలెగాక, గ్రీకుజనుల మనోభావములందు, పరిపాలనక్రమమందు, నూ తనస్వేచ్ఛయుండెను ఉత్తరాటవుల సంచారకాలమం దా ర్యులకుండిన వ్యక్తిస్వాతంత్ర్యము గ్రీకునగరములందు నుం డెను ఈయార్యులే చారిత్రక కాలమున ప్రజలే తమ్ము పాలిం చుకొను పద్ధతి నారంభించిరి

అనాగరకయుద్ధములు వదలునప్పటికి, గ్రీకులలో వితర్కణజ్ఞానము కలిగినది వారిలో మతగురువులున్నను గ్రీకులు స్వయముగా జ్ఞానార్జనచేయుచు, జ్ఞానము నితరులకు బోధించి గ్రంథస్థము జేయుచు, ప్రాణిస్వభావమునుగూర్చియు

చర్చించుచుండిరి ఇట్టి సమస్యల నిదివరలో తమకు తోచి నట్లు గురువును రాజులును ఆజ్ఞారూపముగ సెలవిచ్చుటయే గాని, సామాన్యజనులు చర్చించుటలేదు. క్రీ పూ 6 వ శతాబ్దముననే, అనగా ఈసయ్య బాబిలనులో భవిష్యత్తును గురించి బోధించుకాలముననే, మైలిటసునగరపు 'థేల్సు' అనక్జిమాండరు' 'ఎఫిసను' నగరపు 'హిరాక్లిటసు' మొదలగు స్వతంత్రజ్ఞానులు, ప్రపంచస్వభావము వానియుత్పత్తి భవిష్యత్తు మొదలగు సమస్యలగూర్చి, యుక్తితో స్వతంత్రముగ విమర్శించిరి. సృష్టిస్థితివిషయమై గ్రీకులారంభించిన చర్చలగూర్చి ముందు కొంత చెప్పబడును క్రీ పూ 6 వ శతాబ్దమునుండియుండిన గ్రీకువిమర్శకులే ప్రపంచమున మొదటి జ్ఞానాభిమానులు, తత్వజ్ఞులు మానవచరిత్రములో, క్రీ పూ 6 వ శతాబ్దము చాలముఖ్యము అప్పుడు సృష్టి స్వభావమును గూర్చి, విశ్వమందు నరునిస్థానమునుగూర్చి యు, పరిశోధన యారంభించెను యూదప్రవక్తయగు ఈ సయ్య అత్యుదారవచనములతో తనసందేశము నిచ్చెను. ఆసమయముననే భారతదేశమున గౌతమబుద్ధుడు తన నూతనోపదేశమును, చీనాలో 'కన్ఫ్యూషియను' ను 'లోత్సే' యును తమ క్రొత్తసిద్ధాంతములను, ప్రారంభించిరి గ్రీసులోని ఆథెన్సు మొదలు ఆసియాచివరనున్న శాంతమహాసముద్ర ము-

వరకు అంతటను నరులమనస్సులో నూతనవికాసము కలిగినది *

---

* గ్రీకుశాఖలలో అయోనియనులది ముఖ్యమైనది ప్రాచీనగ్రీకుల లో నాగరికతకు జ్ఞానవిద్యలకు ప్రసిద్ధికెక్కిన ఆథెన్సురాజ్యవాసు లయోనియనులే ఇట్టి విద్యాంసులు జ్ఞానులు కొందరు అలెగ్జాండరుతోను తరువాతను భారతదేశమునకువచ్చి ఇచ్చటిపండితులను గలసికొని, కొంత జ్ఞానార్జనచేసి వెడలిపోయిరి అయోనియనులబట్టి పూర్వపుగ్రీకులు, ఆ ప్రక్కవారుగూడ, పూర్వపుసంస్కృతగ్రంథములందు 'యవను'లనబడు చుండిరి వారిలిపి 'యవనాని'యనబడెను తరువాత మధ్యకాలమునుండి యవనశబ్దము ముసల్మానులకు అరబ్బులకును వాడబడుచున్నది

ఆర్యులస్వతంత్రాలోచన స్వాతంత్ర్యేచ్ఛ ప్రాచీనభారతీయా ర్యుల చరిత్రమునగూడ కనబడుచున్నది భారతదేశమునగూడ కొన్ని ప్రాంతములందు రాజత్వపద్ధతిలేకుండ, ప్రాచీనకాలమున ప్రజాప్రతినిధులే పాలించుచుండిన సూచనలు కలవు

క్రీ పూ 6 వ శతాబ్దము మొదలు గ్రీకులుపొందిన వైజ్ఞానికభావములు కొంతవరకు భారతీయార్యులనుండి గ్రహించినవే ఆకాలమున భారతవర్ష మనబడు బృహద్భారతదేశము పారసీకప్రాంతమువరకుండెను సింధునది యుత్తరప్రాంతమందలి 'తక్షశిల' గాంధారదేశపు 'పుష్కలావతి' యు విజ్ఞా నపరిశోధనస్థానములుగానుండెను అచ్చటిభారతీయులనుండి గణితతత్వశా స్త్రాదుల నూతనరహస్యములను యవనాదిపాశ్చాత్యులుగ్రహించిరి దశాంక ము(=డెసిమలు) కొన్ని జ్యామితిసిద్ధాంతములు, ప్రస్తుతపు అంకెలును, భా రతీయులనుండియే పాశ్చాత్యులు గ్రహించిరి వైద్యవిద్యగూడ అప్పుడు భారతదేశమున జాలవృద్ధిలో నుండెను మరియు చతురంగపుఆట, కొన్ని

వాఙ్మయవిషయములు, పంచతంత్రాదికథలు, ఇచ్చటినుండియే పారసీక ముకు అందుండి యూరప్పును వ్యాపించెను మరియు గ్రీకులలో జ్ఞానాభిమానము తత్వజ్ఞానము ఆరంభించుటకు చాలశతాబ్దములపూర్వమే, వేదకాలమందు, మనదేశమందలి ఆర్యవిద్వాంసులు సృష్టిస్వరూపము దానియుత్పత్తి మొదలగు అనేకసమస్యలనెత్తి, వాటినిసమర్థతతో చర్చించిరి అనేకతత్వవిషయములగూర్చి ఋషులు తమ స్వతంత్రాభిప్రాయముల వివరించిరి [ఉ "నాసదాసీన్నో సదాసీత్తదానీం నాసీద్రజోనో వ్యోమాపరోయత్, కిమావరీవః కుహ కస్యశర్మన్నంభః కిమాసీద్గహనంగభీరం, సోఅంగవేద యదివా నవేద" (ఋ సం మం 10-11 2). "హిరణ్యగర్భః సమవర్తతాగ్రే పతిరేకఆసీత్" (ఋ సం మం 10-10-10) "కోయమాత్మేతి " (తై ఉ 2-6), "కేనేషితం పతతి ప్రేషితం " (కే ఉ 1 1)

"స్వభావ మేకే కవయో వదంతి " శ్వే ఉ 6-1)

"అస్యలోకస్య కాగతిః " (ఛాం—ఉ 6-9)

ఇట్టి అనేకవేదప్రకరణములందున్నరీతిని అప్పటి మరియేప్రాచీనవాఙ్మయమునందును అధ్యాత్మతత్వవిషయములు చర్చింపబడలేదు సృష్టిస్వభావమునుగూర్చి భౌతికశాస్త్రములగూర్చిగూడ ప్రాచీనభారతీయులు విమర్శించిరి ప్రధానోపనిషత్తులేగాక షడ్దర్శనములుగూడ క్రీస్తుపూర్వము పదవశతాబ్దము ప్రాంతమునకే ఏర్పడెను ఇందు నిరీశ్వరమతములగు యోగన్యాయవైశేషిక వేదాంతదర్శనములకేగాక, ఈశ్వరప్రసక్తిపెట్టుకోని పూర్వమీమాంసకు సాంఖ్యమునకు గూడ ప్రమాణస్థానముండుట భారతీయుల చర్చాస్వాతంత్ర్యమును సూచించును

"ఒడిస్సీ, ఇలియడు"వంటివే, వాటికన్న ప్రాచీనతరములగు మన వేదసంహితలు ఉపనిషత్తులు మొదలగు వాఙ్మయము నెవరు రచించిరో

నిర్ధారణ లేదు. వేదసంహితలలోని కొన్ని కొన్ని భాగములు వసిష్ఠుడు విశ్వామిత్రుడు మొదలగు వేరువేరు ఋషులకు గోచరించెనని ఐతిహ్యము. కొన్ని ఆధ్యాత్మిక విషయములను ఆరుణి యాజ్ఞవల్క్యాది ప్రాచీనమహర్షులు తమ తమ శిష్యుల కుపదేశించిన ట్లాయా ఉపనిషత్తులందు చెప్పబడినది. కొంత కాలమునకు వ్యాసమహర్షి వేదము లన్నిటిని విభజించి వాటికి సరియగు క్రమమేర్పరచుటచే, ఆతనకు వేదవ్యాసుడని పేరు కలిగెనందురు. ఈయన చాల గ్రంథములుగూడ రచించెనందురు. ఇప్పటి బ్రహ్మ (=వేదాంత) సూత్రములను, విపులగ్రంథమగు మహాభారతమును అష్టాదశపురాణములను గూడ, వ్యాసుడే రచించెనని ప్రతీతి. ప్రస్తుతమున్న మహాభారతమునందు వ్యాసునిచర్యలే గాక ఆయనవంశీయులచర్యలు వారి శిష్యుల భావములు గూడ, వివరింపబడినవి. అనేక సంగతులందు పరస్పరభిన్నాభిప్రాయములు గల పురాణము లన్నిటిని ఒకరే రచించిరనుటయు భావ్యముగా తోపదు. వేర్వేరు కాలములందు 'వ్యాస'నామము కలవారనేకులుండిరేమో తెలియదు. శ్రీమద్రామాయణగ్రంథమును వాల్మీకిమహర్షియే రచియించెనని ప్రసిద్ధి. కాలక్రమమున అందు కొన్ని ప్రక్షిప్తశ్లోకములుమాత్రము చేరియుండునని విమర్శకుల యభిప్రాయము.

## 24 గ్రీకు పారసీక యుద్ధములు

ఇట్లు గ్రీసుపురములలోను, దక్షిణయిటలీలోను, ఆసియామైనరులోను, గ్రీకులు స్వతంత్రవిజ్ఞానాన్వేషులై యుండ, జెరూసలెంలోను బాబిలనులోను తుదిహీబ్రూప్రవక్తలు నరజాతికి భావస్వాతంత్ర్యము గల్గించుచుండ, పారసీకులు మీడులు అను సాహసికులు నాగరికులునగు ఆర్యజాతులవారు అప్పటిసామ్రాజ్యములందెల్ల విశాలమగు "పారసీకసామ్రాజ్యము"ను స్థాపించుచుండిరి సైరసు పాలనమున, బాబిలనును చాల నాగరికమగు "లిడియా"యు పారసీకసామ్రాజ్యమున జేరెను, మధ్యధరాసముద్రపు తూర్పుతీరమందున్న ఫనీషను నగరములును, ఆసియామైనరులోని గ్రీకుపురములన్నియు, పారసీకుల సామంతరాజ్యములైనవి 'కాంబిసెస' ఈజిప్టును వశపరచుకొనెను పారసీకసార్వభౌములలో మూడవవాడు మీడువంశీయుడునగు మొదటిడెరయసు (క్రీ పూ 521) అప్పటి లోకమంతటికి పాలకుడైనట్లుండెను అతనియుద్యోగులు రాజాజ్ఞలతో డార్డెనల్సు మొదలు సింధునదివరకును ఈజిప్టుమొదలు మధ్యఆసియా వరకును తిరుగుచుండిరి

యూరపులోని గ్రీకులు, ఇటలీ కార్తేజి సిసిలీ స్పెయిను లలోని ఫనీషను రాజ్యములును, పారసీకసామ్రాజ్యమున జేర

లేదు, కాని వారుదానినిగౌరవించెడివారు, దక్షిణరష్యామధ్య ఆసియాలలోని ప్రాచ్యార్యులగు సితియనుల దండులు మాత్ర ము ఈశాన్యపు సరిహద్దులపై తరచు దండెత్తుచు, బాధించు చుండిరి

ఈవిశాల రాజ్యపు జనులందరును పారసీకులుకారు, దీనివిజేతలగు కొలదిమంది పారసీకులు, మిగిలినవారందరు ఆయాదేశములవారే అందు పారసీ రాజకీయ భావమైనది వర్తకము ద్రవ్యవ్యవహారములు ఇంకను విశేషముగా సెమి టికుపద్ధతులవే, మధ్యధరాసముద్రమున పూర్వమువలె టైరుసిడనుపురములే ముఖ్యమగు రేవుపట్టణములై యుండెను. సెమిటికునౌకలే సముద్రముపై దిరుగుచుండెను ఈసెమిటికు వర్తకులు కోస్తాప్రయాణము చేయుచో, హీబ్రూమతగ్రంథా ధారమున సమానమగు ధర్మములు, మనోభావములు, ఆచారములును, అక్కడకనబడెను ఈసామ్రాజ్యమున నూత గ్రీకులు వ్యాపింపదొడగిరి సముద్రమున గ్రీకులు సెమిటి కులతో పోటీచేయుచు, తమ తీక్ష్ణబుద్ధిచే మంచి యుద్యోగు లగుచుండిరి.

మొదటి డెరయను యూరపుదాడికి సితియనులు, కారణము సితియనురాతుల స్వస్థలమగు దక్షిణ రష్యా వరకు చేరదలచెను. పెద్దసైన్యములతో (యూరపుకుహద్ద

గు) బాస్ఫరస్ దాటి, బల్గేరియాద్వారా డాన్యూబ్ నదిజేరి, నౌకలపై నానదిని దాటి, ఉత్తరప్రాంతము జొచ్చెను, కాని, ఆతనిసైనికులు పదాతులు, సితియను ఆశ్వికులాసేన చుట్టు నుండి, సామగ్రినందనీయక, తీవ్రయుద్ధము చేయక, ఒంటిజనుల బాధించుచు, ఆతనిసైన్యమును చికాకుపర్చిరి డెరయను విధిలేక వెనుకబట్టెను తానుమాత్రము రాజధానియగు 'సుసా'కు మరలిపోయి, కొంతసైన్యమును థ్రేసు మాసిడోని యాలలో వదలెను మాసిడోనియా ఆసేనకు లొంగెను. కాని, డెరయను ఓటమిజూచి, ఆసియాలోని గ్రీకుపురరాజ్యములు తిరుగబడెను, యూరపులోని గ్రీకులు నందుజేరిరి. డెరయను యూరపులోని గ్రీకుల నణప నిశ్చయించి, ఫనీష నునౌకల తోడ్పాటుతో ఆద్వీపముల వరుసగా పట్టుకొని, తుదకు (క్రీ పూ 490) ఆథెన్సునగరముపై బడెను ఆసియా మైనరు తూర్పు మధ్యధరాప్రాంతముల రేవుపట్టణములనుండి, గొప్ప నౌకాదళమువచ్చి ఆథెన్సుకుత్తరమున మారథనువద్ద సైన్యములదింపెను కాని, ఆసైనికులచట ఆథెన్సుపౌరులచే పూర్తిగనోడింపబడిరి

అప్పుడొక చిత్రముజరిగెను అంతవరకు గ్రీసులో ఆథెన్సుకు స్పార్టా ప్రబలవిరోధి, కాని అప్పుడు గ్రీకులు మోటు విదేశీయుల బానిసలుగాకుండ కాపాడుమని ఆథెన్సు

స్పార్టాకు దూత నంపెను మహావేగముతో నాదూత నాటు దారిని రెండుదినములలో నూరుమైళ్ళకు పైగా పరుగిడి స్పార్టాచేరెను స్పార్టను లుదారులై వెంటనేతోడ్పడిరి మూడుదినములలో స్పార్టను సైన్యమూథెన్సుచేరెను కాని అప్పటికి పారసీకుల శవములే మిగిలెను, పారసీక నౌకాదళ మాసియాకు మరలిపోయెను గ్రీసుపై ప్రథమ పారసీక దండయాత్ర ఈరీతిని ముగిసెను

రెండవది మిక్కిలి తీవ్రమైనది మారథను పరాజయము వినినతరువాత డెరయసు మరణించెను ఆతనిపుత్రుడు వారసు అయిన 'క్సర్క్సెను' నాలుగేండ్లతిదీక్షతో నక్షౌహిణుల సిద్ధపరచెను కొంతకాల మీభయముచే గ్రీకులందరు నేకమైరి ప్రపంచమందప్పటి సైన్యములందెల్ల క్సర్క్సెను సైన్యము చాలపెద్దది కాని అందు సామరస్యములేదు క్రీ పూ 480 లో ఆసైన్యము నౌకలపై డార్డెనల్సుదాటి తీరమువెంట నడచెను, సామగ్రితో నౌకాదళముకూడ వచ్చెను 'థర్మాపిలే' అను కనుమసందునొద్ద సుమారు 1400 మంది స్పార్టనువీరు లా మహావాహిని నెదుర్కొని, అరికట్టి, భీమణసమర మొనర్చి, ఆరణరంగమున పూర్తిగా హతులైరి, కాని శత్రుసైన్యము కపారనష్టము గలిగెను. హతశేషులగు క్సర్క్సెను సైనికులు దెబ్బలుతినియు, థీబ్స్

ఆథెన్సులపై బడిరి థీబ్‌న్‌జనులు లొంగిపోయి, సంధియొనర్చు కొనెను ఆథెన్సుప్రజలు పురమువదలి పారిపోగా, ఆనగరము తగులబెట్టబడెను

ఇట్లు గ్రీసు అంతయు క్సర్‌క్సెసు హస్తముల జిక్కినట్లుండెను కాని హఠాత్తుగా గ్రీకుల కింకొక విజయము లభించెను పారసీక నౌకాదళమున మూడవవంతు కూడ లేని గ్రీకు నౌకాదళము 'సలమిస్' అఖాతమున పారసీక నౌకల నెదుర్కొని, వానిని ధ్వంసమొనరించెను అంతట క్సర్‌క్సెసు సైన్యములకు సాధనసామగ్రి సరఫరా ఆగిపోయెను, అతడు భీతిచెంది, తన సైన్యమున అర్ధభాగముతో ఆసియాకు మరలిపోయెను మిగిలినసైన్యము (క్రీ పూ 479) ప్లటియా వద్ద మరల నోడింపబడెను చెదిరిన పారసీక నౌకలు గ్రీకులచే తరుమబడి, ఆసియా మైనరులోని 'మైకేలు' వద్ద ధ్వస్తమయ్యెను

పారసీకభయ మంతటితో నంతరించెను ఆసియాలోని గ్రీకు పట్టణములు చాలవరకు స్వతంత్రము లాయెను. ఈ విషయ మంతయు అతివిరళముగ రసపుష్టితో హెరోడోటస్ వర్ణించి, ప్రథమ చారిత్రక గ్రంథము వ్రాసెను. హెరోడోటస్ క్రీ. పూ 484 ప్రాంతమున ఆసియా మైనరులోని యవననగరమగు 'హెలికార్నసను'లో జనించెను;

సరియగు వివరములకై బాబిలను ఈజిప్టు మున్నగు ప్రదేశములను, దర్శించెను. మైకేలు యుద్ధానంతరము, పర్షియా అంతఃకలహముచే అల్లకల్లోలమునబడెను క్రీ. పూ 465 లో, క్సర్క్సెసు చంపబడెను ఈజిప్టు సిరియా మీడియాలలో విప్లవములు బయలుదేరి, ఆ సామ్రాజ్యము విచ్ఛిన్నమాయెను హెరొడోటస్ తన చరిత్రలో పర్షియా ధార్ఢ్యమును వర్ణించి, గ్రీకులందరు కలసి పర్షియాను జయింపవలెనని ప్రచారముచేసెను 'అరిస్టాగొరస'నువాడప్పటికి తెలిసియున్న ప్రపంచపు పటముతో స్పార్టాచేరి, అచ్చటివారితో నిట్లు చెప్పినట్లందు వ్రాయబడెను.

"ఈ మోటు విదేశీయులు శూరులు కారు మీరో యుద్ధమున నతికుశలురు వెండి, బంగారము, కంచు, విలువగల అల్లికదుస్తులు, జంతువులు, బానిసలు మొదలగు వారి సంపత్తు మరెచ్చటను లేదు మీరు తలచుకొన్నచో ఇదియంతయు మీ వశమగును"*

---

* అప్పుడు పారసీకసామ్రాజ్యమున చేరియుండిన గాంధారులు మున్నగు కొద్దిమంది భారతీయులుగూడ పారసీకవాహినిలో జేరియుండిరని కొందరు తెల్పిరి కొన్ని పారసీక ప్రాంతములును ముఖ్యముగ భారతదేశము అమూల్యములగు అనేకపదార్థములకు యూరపులో చాల ప్రసిద్ధమై యుండెను. గ్రీకులు తమకు విదేశీయులగువారిని 'బార్బరియను'లు అనుచుండిరి పూర్వపు గ్రీకులు తమ నాగరికతయే అత్యుత్తమ

మరి తలచిరి ఆసంప్రదాయమున వృద్ధియైన యూరపియనులకు ‘బార్బేరి యను’ శబ్దము ‘విదేశీయులు’ అనియే గాక, ‘మోటువారు అనాగరికులు’ అనియు సూచకమయ్యెను మనవారు పాశ్చాత్యుల ‘యవనులు మ్లేచ్ఛులు హూణులు’ అనుచుండిరి, తరువాత, మహమ్మదీయులు యితరులను ‘కాఫరు’లనుచుండిరి, ఆపదము లన్నిటిలోను క్రమముగా కొంతనీచత్వ సూచన ఏర్పడెను అట్లే ఆర్యజాతివారు చాలనాగరికులు అయిన పారసీకులను మనభారతీయులనుగూడ అప్పటి గ్రీకులు మోటుజాతివిదేశీయులు అనుసూచనతో ‘బార్బేరియను’ లనుచుండిరి

---

## 25 గ్రీసు విభవము

పర్షియా దాడితొలగినపైన, ఒకటిన్నర శతాబ్దములు గ్రీకునాగరికత యుచ్చస్థితిలోనుండెను, ఆకాలములో క్రీ పూ 431 మొదలు 404 వరకు "పెలపనీసను" యుద్ధమున, ఆథెన్సు స్పార్టా మొదలగు గ్రీకురాజ్యములు అధికారప్రాప్తికై పరస్పరము కలహించెను క్రీ పూ 338 లో ఉత్తర ప్రాంతపు మాసిడోనియా దేశీయులు గ్రీసునుజయించిరి, కాని యీకాలమందే గ్రీకుల జ్ఞానవికాసమును నిర్మాణ కళాకౌశలమునువృద్ధియై, భావిమానవజతికిప్రబోధమిచ్చెను.

ఈజ్ఞానవికాసముకు నాయకమణి ఆథెన్సునగరము క్రీ పూ 466 మొదలు 428 వరకు ముప్పదియేండ్ల పైకాలము ఆథెన్సు పాలకుడు మహాశక్తియుతుడు విశాలహృదయుడునగు పెరికిల్సు పారసీకనాశితమగు ఆనగరమును మరల నిర్మించెను ఇప్పటికిని తమ సుందరశిథిలములచే ఆథెన్సుకు కీర్తినిచ్చు చక్కని ప్రాచీనభవనము లీతడు కట్టించినవే; ఇట్లు సమర్థులగు వాస్తుశిల్పులను శిలాశిల్పులను రప్పించి భవనములచే భౌతికముగనే గాక, గొప్పగొప్ప కవులను నాటకకర్తలను తత్వశాస్త్రజ్ఞులను బోధలకును ప్రోత్సాహపరచి, ఆనగరపు జ్ఞానాభివృద్ధికికూడ కారకుడయ్యెను.

క్రీ పూ 438వ యేట, హెరోడోటస్ ఈపురముకు వచ్చి అచ్చట చరిత్రను లిఖించెను అనక్సాగొరసు ఇచ్చటకువచ్చి, సూర్యగోళముకు నక్షత్రములకు వైజ్ఞానికవివరణల నారంభించెను ఆయుశ్చిలసు సొఫొకిల్సు యూరిపిడీసులు వరుసగా గ్రీకునాటక సాహిత్యమును మనోహరము ఓజస్వంతము జేసి, అత్యుచ్చదశకు దెచ్చిరి పెలపనీసను యుద్ధమువల్లను రాజ్యధికారపు కలహములచేతను గ్రీసులో శాంతి చెడినను, ఆథెన్సులో పెరికెల్సు ప్రోత్సాహముచే, తరువాతకూడ జ్ఞానాభివృద్ధి యగుచునేయుండెను రాజకీయ వాతావరణ మంధకారబంధురమైనను బుద్ధివికాసముకింకను చురుకు గలిగెను. పెరికిల్సుకు చాలపూర్వమే మనస్స్వాతంత్ర్యప్రియులగు గ్రీకుల సంస్థలు చర్చాశక్తికి చాలప్రాముఖ్యము నిచ్చెను తీర్పు చేయు అధికారము రాజుది గురువులదిగాక, సభికులది ప్రజానాయకులదియునై యుండెను వక్తృత్వము వాదశక్తి ప్రవీణలక్షణమై యుండెను యువకులకీకళలునేర్ప, 'సోఫిస్టు'లను తార్కికులుగూడ బయలుదేరిరి విషయజ్ఞానమున సారము లేక విపులచర్చ జరుగవీలులేదు, కనుక, వాగ్ధోరణితో బాటు విషయజ్ఞానముకూడ వృద్ధినొందెను ఈసోఫిస్టులు చేయు కృషిచే, వాదములయుక్తి ప్రామాణ్యము ఆలోచనపద్ధతులు శైలి వీటినిగూర్చి సహజముగ తీవ్రవిమర్శ జరిగెను, కాని,

ఆత్మాటము హెచ్చెను పెరికెల్సు తరువాత ఆథెన్సులో నుండిన సోక్రటీసుపండితుడు ఈసోఫిస్టుల వితండ వాదముల విమర్శించి, ప్రసిద్ధుడయ్యెను ధీమంతులగు కొంతమంది యువకులు సోక్రటీసుకు శిష్యులైరి జనుల మనస్సుల కలవర పర్చెనను నేరముమోపి, క్రి పూ 399వ యేట, సోక్రటీసుకు మరణశిక్ష విధించిరి, ఆథెన్సులో అప్పటి గౌరవపద్ధతిని, ఆయనచే తనయింట మిత్రులమధ్య విషముద్రావించి, ఆశిక్షనములు జరిపిరి కాని జనుల 'కలవరము' పోలేదు, ఆయన శిష్యులద్వారా ఆబోధలు వ్యాపించెను వీరిలో ముఖ్యుడగు 'ప్లాటో' (క్రీ పూ 427 మొదలు, 347 వరకు) 'అకాడమీ' అను కళాలయములో తత్వశాస్త్రము బోధించెను ఆయన చేసిన రెండుబోధలలో మొదటిది నరుల మనః ప్రవృత్తుల మూలసూత్రముల విమర్శించుట, రెండవది రాజకీయ సంస్థలవిమర్శ, మన సంఘము లన్నిటికన్న ప్రశస్తమగు ఆదర్శ సంఘ పద్ధతిని గూర్చి యీాయన 'ఉటోపియా'ను రచించెను అదియీావిషయమును గూర్చిన మొదటి గ్రంథము ఇంతవరకు సాంఘిక కులాచారముల మాటాడక శిరసావహించు జనులకింకచే నూతన ధైర్య సాహసములు కలిగెను "మీాకు తగు ధైర్యసాహసములున్న [illegible]లవరకు మీాకున్న సాంఘిక రాజకీయ బాధలన్నియు

మీరు స్వయముగా వారింపవీఁగునవే మీసామర్థ్యమును మీరెరుగరు, కాని మీరునిశ్చితులై కార్యవీరులైనచో, ఇంతకన్న చక్కఁగా మీరుజీవింపవచ్చు" అని 'ప్లాటో' జనులకు విశదపరచెను, ఇట్టి యుపదేశమప్పటిసామాన్యజనులకు బోధపడలేదు ప్రజాస్వాతంత్రతక్రింద కులీనులపాలనను సూచించు "రిపబ్లిక్" అను గ్రంధమునంతకుముందే ప్లాటో రచించెను, ఇట్టియూహతో రాజ్యమునకు న్యాయనిబంధనల నిర్ణయింప, 'లాజ్' అను గ్రంథమును చివరవ్రాసెను, కాని, అదిపూర్తికాలేదు ప్లాటో అనంతరమాతని శిష్యుడగు 'అరిస్టాటిల్' తార్కికరాజకీయపద్ధతుల విమర్శనుసాగించెను ఆయన మాసిడోనియాలోని 'స్టగీరా' నుండివచ్చి, 'లిసియం' లో బోధించుచుండెను ఆయనతండ్రి మాసిడోనియాలో ఆస్థానవైద్యుడు, (మహాపురుషుడుకాబోవు) అక్కడి యువరాజగు అలెగ్జాండరుకు అరిస్టాటిలు కొంతకాలము గురువు అనుమానపద్ధతుల గూర్చి అరిస్టాటిలురచించిన గ్రంథము తర్కశాస్త్రము నుచ్చస్థితికి తెచ్చినది తరువాత 15 శతాబ్దులాసమస్యలట్లేయుండెను, మధ్యకాలపండితులంతట వాటిని చర్చింపనారంభించిరి ప్లాటోవలె "ఉటోపియా"లను రచింపక, అరిస్టాటిలు 'నరులింకను విజ్ఞానులైనగాని తమ భావిస్థితిని బాగుపర్చుకొనలేర'ని కనిపెట్టెను. అందుచేనతడు శాస్త్రీయ

జ్ఞానమును క్రమపద్ధతితో సంపాదింపదొడగెను, యధార్థసంగతులగ్రహింప బరిశోధకులబంపెను అతడు జీవప్రకృతిచరితము రాజకీయశాస్త్రము గూడ ప్రారంభించెను, "లిసియం" వద్ద ఆయన శిష్యులు 158 వేరువేరు రాజ్యముల రాజ్యాంగ నిర్మాణమును పరీక్షించి, వాటి తారతమ్యమును చర్చించిరి. క్రీ పూ 4 వ శతాబ్దియందే, మన ఆధునికవిమర్శకుల బోలువా రుండిరి. పిల్లలయాలోచనవలెను స్వప్నసంగతుల వలెనుండిన ఆదిమాలోచకులపద్ధతులుపోయి, జీవితసమస్యల గూర్చి కట్టుదిట్టమగు విమర్శలిట్లువచ్చెను. అంతకువెనుకటి మాయిక వికృత దేవతలవిగ్రహములు, సాంకేతికచిహ్నములు కులశిక్షలు మనోవికారబంధములన్నియు నిందుతోపూర్తిగా తొలగెను, క్రమపద్ధతులపైన స్వతంత్రచర్చ మొదలిడెను. ఉత్తరారణ్యములనుండివచ్చిన ఈనవీనుల స్వతంత్రమనోభావము గుడుల గూఢాంధకారమును ఛేదించి వెలుగునిచ్చెను.



క్రీ పూ 431-404 వరకు 'పెలపనీసను' యుద్ధమున గ్రీకులు నష్టమొందుచుండ, వారికుత్తరమందలి 'మాసిడోనియను'లు బలీయులై నాగరికులగుచుండిరి మాసిడోనియా వారి భాష గ్రీకుకు సంబంధించినదే ఒలింపిక ఆటలలో మాసిడోనియనులును చాలసార్లు పోటీచేసిరి క్రీ పూ 359 వయేట 'ఫిలిప్' అను శూరుడీచిన్న రాజ్యపుప్రభువయ్యెను అతడు సామ్రాజ్యకాంక్షి, ఇదివరలో గ్రీసులో పట్టుబడి బందీయై, అచ్చటి గ్రీకువిద్యను చక్కగా నభ్యసించెను గ్రీకు లేకీభవించినచో ఆసియాను జయింపవచ్చునను (హెరోడొటస్ వివరించిన) భావము నాతడక్కడ గ్రహించియుండును. అతడు ముందుగా తనరాజ్యమును సేనను చక్కబెట్టుకొనెను అప్పటికి వేయేండ్లనుండి ఆశ్వికరథములు, వాటికి తోడుగ పదాతులును, యుద్ధములందు జయసాధనములుగ నుండెను. ఆశ్వికనరులు యుద్ధములందు పాల్గొనినను, అంతవరకు వారు క్రమశిక్షసహకారము లేక, యుద్ధమున అప్రధానులుగ నుండిరి ఫిలిపు పదాతిజను లొకరినంటి యొకరుగ మధ్యనెడములేని దట్టనిదళముగనమర్చి, వారిప్రక్కలను ఆశ్వికులు యుక్తితోను క్రమశిక్షతోను పోరునట్లుతయారుచేసి, గుర్రపు దళముల నేర్పరచెను ఇతడు, ఇతనికుమారుడు అలెగ్జాండ

రును, తమయుద్ధవ్యూహములందు పెట్టినపద్ధతులలో, ఆశ్వీక దళపు ముట్టడియే ముఖ్యము ఎదుటను దట్టని పదాతిదళము శత్రుసేనతో పోరుచుండ, ప్రక్కలనుండి గుర్రపుపటాలము శత్రువులయశ్వములదరిమి, శత్రుపదాతులను ప్రక్కలనుండి, వెనుకనుండి, ముట్టడింతురు మరియు, వీరి సేనలోని ధనుర్ధరులు తమబాణములతో శత్రువుల రథాశ్వములను గురిపెట్టి చంపుదురు, అంతట శత్రురథములు నిరుపయోగములై, దళములును చెదురును

ఈనూతనసేనతో ఫిలిపు థెసలీగుండ గ్రీసువరకు తనరాజ్యము విస్తరింపజేసెను అతడు క్రీ పూ ౩౩౮ నందు 'చరోనియా' వద్ద ఆథెన్సుతోను వారి మిత్రరాజ్యముల తోను యుద్ధముచేసెను, అంతట, గ్రీసంతయు అతని పాదాక్రాంతమాయెను. చివరకు హెరోడోటసు ఆశాస్వప్నము ఫలించెను, గ్రీకురాజ్యప్రతినిధులందరుగూడి, గ్రీకు మాసిడోనియా రాజ్యములసమితి పారసీకదేశముపై దాడి చేయ నిశ్చయించిరి, అందుకు ఫిలిపును సర్వసేనానిగా నియమించిరి అతని సేనాముఖము, క్రీ పూ ౩౩౬ వయేట డార్డనల్సు జలసంధిదాటి, ఆసియాలోనికి ప్రవేశించెను కాని ఫిలిపు ఆ జయప్రాప్తిలేకుండగనే హత్యజేయబడెను ఫిలపు ద్వితీయవివాహము జేసికొనెను, అందుకీర్ష్యవహించి,

ప్రథమభార్యయగు అలెగ్జాండరుతల్లి యీహత్యను జేయించి యుండును.

ఫిలిపు తన కుమారునివిద్యవిషయమై ప్రత్యేక శ్రద్ధ వహించెను. అప్పటి తత్వజ్ఞులలో శ్రేష్ఠుడగు అరిస్టాటిలు నా బాలునికి గురువుగా నేర్పరచెను. తన భావములను యుద్ధానుభవములను అలెగ్జాండరుకు స్వయముగ నేర్పుచు, అతనితో చర్చించుచుండెను. చరోనియాయుద్ధమున అప్పటికి 18 యేండ్ల బాలుడయ్యు, అలెగ్జాండరే అచట అశ్వదళ నాయకుడైయుండెను. అందువల్లనే తానురాజగునప్పటి కిరువదేండ్ల యువకుడేయైనను, తన తండ్రి యుద్దేశించిన పారసీక దండయాత్ర నాతడు వెంటనే ప్రారంభింపగల్గెను.

మాసిడోనియాలోను గ్రీసులోను అలెగ్జాండరు అధికారస్థాపనకు మొదటిరెండేండ్లు పట్టెను. అంత నతడు క్రీ పూ 334 లో ఆసియాలోనికి ప్రవేశించి, "గ్రానికసు" వద్ద సుమారు తనసేన యంతయున్న పారసీకసేన నోడించి, ఆసియామైనరులో కొన్ని పురముల స్వాధీనపరచుకొనెను. రేవుపట్టణములగు టైర్ సిడెనుల నౌకాదళములును సముద్రాధికారమును అప్పటికి పారసీకులవశమందుండెను. కనుక, అతడు ముందుగా తీరనగరముల లోబరచుకొని, తన రక్షక సేనల నందుంచెను, అచ్చట రేవుపట్టణమేదైన పారసీకుల

వశమందుండినచో, స్వదేశముతో సముద్రముపై తన రాక పోకలను వారరి కట్టియుందురు క్రీ పూ 333వ ఇస్సను వద్ద, మూడవ డెరయసు అను పారసీక రాజు నడపిన నానా జాతి సంకులమగు మహాసేన నలెగ్జాండ రోడించెను ఆ పారసీక సేన $1\frac{1}{2}$ శతాబ్దములక్రింద గ్రీసుకువచ్చిన 'క్సర్క్సెసు' అక్షౌహిణివలె సంఘటన లేనిదైయుండెను, యుద్ధప్రసక్తి లేని రాజసభికులు, అంతఃపురస్త్రీలు, అనుచరులునుగూడ, అం దుండిరి యుద్ధసమయమున వారిరక్షణ పారసీకసేనకు మరింత భారమయ్యెను 'సిడను' వెంటనే లొంగెను, కాని 'టైరు'పుర మలెగ్జాండరును పట్టుదలతో నెదిరించి, చివరకు సంకులరణమున బట్టువడి, దోపిడియై, విధ్వస్త మయ్యెను "గాజా"నగరమును ముట్టడిపైన బట్టుబడెను క్రీ పూ 332 చివరకు, అలెగ్జాండరు విజయియై, ఈజిప్టు ప్రవేశించి, ఆదేశపాలనను పారసీకులనుండి వశపరచుకొనెను

మిశ్రిదేశీయులు తనపై తిరుగుబాటు చేయకుండ, భూస్థలినుండి అందుబాటైన తనకులోబడు స్థలములందు, 'అలె గ్జాండెట్టా' 'అలెగ్జాండ్రియా' అను రెండు నగరముల నీజి ప్టులో నలెగ్జాండరు కట్టించెను. పశ్చిమ మధ్యధరాప్రాంత ములందలి ఫనీషను యూదవర్తకు లాప్రదేశముల వదలి, ఈ నూతననగరములందు నిండిరి, ఆపశ్చిమరాజ్యవ్యాపార

షమంతయు నీ నగరములకు జేరెను క్రీ పూ 331 లో అలె గ్జాండ రీజిప్టునుండి, అంతకుపూర్వపు 'తాథ్మెసు, రామ్సెస్, నెకో' రాజులవలె, బాబిలనుపై దైత్రయాత్రకు బయలు దేరెను అయితే, ఈయన టైరుపురముద్వారా వెళ్లెను అప్పటికి విస్మృతమైన 'నినేవా' పురపు శిథిలసమీపమున 'ఆర్బెలావద్ద' డెరయసు నత డెదుర్కొని, మహాయుద్ధము జేసెను అందు పారసీకుల రథములదాడి నిరుపయోగమై నది, నానాజాతి సంకులమగు వారిసేనలు మాసిడోనియనుల అశ్వదళముల పార్శ్వపుముట్టడికితాళక చెదిరెను, అంతట యెదుటనున్న గ్రీకు కాల్బలముచే పారసీకులు పూర్తిగ నోడింపబడిరి పలాయితులలో డెరయసే ముందై, ఇంక శత్రువు నెదుర్చుటకు యత్నింపక, ఉత్తరముగా మీడుల దేశములోనికి పోయెను అప్పటి కింకను గొప్పదై సుప్రసిద్ధ మగు బాబిలనును, అచ్చటినుండి తరువాత 'సుసా' 'పెర్సి పోలి'పురములను, అంతట అలెగ్జాండరు ప్రవేశించెను అచ్చ ట ఉత్సవము మద్యపానము జరిగి, అందు రాజరాజగు డెర యసు ప్రాసాదము దగ్ధముచేయబడెను

అంతట అలెగ్జాండరు మధ్యఆసియాలో పారసీక సామ్రాజ్యపు ఉత్తరసరిహద్దువరకు దైత్రయాత్ర సాగిం చెను, మొదట ఉత్తరముగా పోయి డెరయసును వెంబడించి,

ఉదయవేళ నాతని నందుకొనెను, ఆలోగా డెరయసు అనుచరులే తమ రాజును హత్యజేసిరి గ్రీకు సేనాముఖము వచ్చునప్పటికి జీవించియున్నను, అలెగ్జాండరు చేరునప్పటి కాతడు చనిపోయెను. అలెగ్జాండరంతట కాస్పియను సముద్రముచుట్టి పశ్చిమతుర్కిస్థానపు కొండల నెక్కి, దక్షిణముగ వచ్చి, 'హీరటు' నగరమును స్థాపించి, ఆఫ్ఘనిస్థానములోని కాబూలు వచ్చి, అచ్చటనుండి కైబరు కనుమలగుండ భారతదేశము జేరెను. అచ్చట పంజాబులో రాజగు 'పోరసు' అను పురుషోత్తమునితో సింధునదీతీరమున నొక మహాయుద్ధము జరిగెను, ఈ రణరంగమున ప్రిథమపర్యాయము మ్యాసిడోనియనులు గజదళము నెదుర్కొని, గెల్చిరి తరువాత నతడు నౌకలపై సింధునదీముఖద్వారమువరకు వెళ్ళి, బెలూచిస్థానపు తీరమువెంట వెనుకకుపోయి, క్రీ. పూ 324 వ యేట అనగా ఆరేండ్లకు, తిరుగ 'సుసా'నగరి జేరెను అంత నాతడామహాసామ్రాజ్యమునకు బలస్థైర్యముల జేకూర్ప యత్నించెను, తన నూతనప్రజల యనురాగము సంపాదించుటకై, పారసీకరాజవేషములను పగిడీని అతడు ధరించెను; అందుచే మ్యాసిడోనియను లసూయ వహించి, చిక్కుపెట్టిరి, మ్యాసిడోనియను సేనానులకు ఆప్రాంతపు పారసీక బ్రాబిలను స్త్రీలకు మధ్య వివాహములు జరిపి, ప్రాచ్య పాశ్చాత్య

సంయోగము గలిగింప నాతడు యత్నించెను కాని యిట్లు సామ్రాజ్యైక్యము గలుగదగువరకతడు జీవింపలేదు, బాబిలను నగరమున విశేష మధుపానముచేసి, జ్వరపీడితుడై, క్రీ పూ 323 లో మరణించెను

వెంటనే, ఆ మహాసామ్రాజ్యము విచ్ఛిన్నమైపోయెను అతని సేనానులలో 'సెల్యూకస్' అందలి ప్రాచ్యసామ్రాజ్యమును (అనగా సింధునది మొదలు ఎఫెసనువరకు) దేశమంతను స్వాధీనమందుంచుకొనెను, 'టాలమీ' అను సేనాని యీజిప్టును వశపరచుకొనెను, 'ఆంటిగోనసు' మాసిడోనియా ప్రభువయ్యెను ఆ మహాసామ్రాజ్యపు యితర ప్రదేశములు, స్థిరపాలన లేక, ఆయా ప్రాంతపు సాహసికుల హస్తగతమగుచుండెను ఇంతలో, ఉత్తర ప్రాంతములనుండి విదేశీయుల దాడులారంభమై, క్రమముగా ముట్టడులు వృద్ధియయ్యెను చివరకు రోమను ప్రజాప్రభుత్వమువారను క్రొత్తపాలకులు పశ్చిమదిశనుండి వచ్చి, ఇండోగ్రీక ప్రాంతమును జయించి, వశపర్చుకొని, చిరస్థాయియగు నొక నూతన సామ్రాజ్యము స్థాపించిరి.

---

## 27 అలెగ్జాండ్రియా కళాలయము, గ్రంథాలయము

అలెగ్జాండరుకు పూర్వమే, పారసీకరాజ్యములందు చాలచోట్ల గ్రీకులు వర్తకులుగను శిల్పులుగను ఉద్యోగస్థులుగను జీతపుయోధులుగను వ్యాపించిరి. క్సర్క్సెసు అనంతరము కలిగిన రాజ్యాధికారపు తగవులలో, దర్యావుషుతో పదివేల గ్రీకుసైనికుల జట్టొకటి 'గ్జనఫన్' నాయకత్వమున పనిచేసిరి, వారు బాబిలనునుండి ఆసియాలోని గ్రీకు నగరములకు మరలివచ్చుటను గూర్చి, "రిట్రీట్ ఆఫ్ ది టెన్ తౌజండ్" అను కావ్యము నా సేనాని స్వయముగ రచించెను, ఇదే సేనాని స్వరచితమగు మొదటి యుద్ధకథ. కాని అలెగ్జాండరు విజయమొంది, ఆయన సామ్రాజ్యము నతని సేనానులు పంచుకొనగనే, ఆప్రాంతములందు గ్రీకులు వారి వేషభాషలు సంస్కృతియు బాగుగ వ్యాపించెను. ఈగ్రీకు వ్యాప్తిచిహ్నములు దూరస్థములగు మధ్య ఆసియాలోను, హిందూదేశపు ఈశాన్యప్రాంతమున గూడ, కన్పడుచున్నవి. భారతీయ కళాపరిణామమునను గ్రీకుల కళాస్పర్శ కనబడును.

చాల శతాబ్దములవర కాథెన్సే గ్రీకుకళలకు సంస్కృతికి నాయకమణిగా నుండెను. క్రీ త 529 వరకు, అనగా

రకూరమి వేయేండ్లు, అచ్చట విద్యాలయములుండెను. కాని కొంతకాలముకు అలెగ్జాండరు స్థాపించిన క్రొత్తవ్యాపారస్థానమగు అలెగ్జాండ్రియాయే విజ్ఞానకృషికి కేంద్రమయ్యెను ఈనగరరాజమున గ్రీకుసేనాని యగు టాలమీయాస్థానమున గ్రీకుభాషనే మాట్లాడుచుండిరి. అంతకుపూర్వ మీటాలమీ అలెగ్జాండరుకాంతరంగికుడై, అరిస్టాటిలు భావముల బాగుగ గ్రహించియుండెను, అందుచే నితడు విజ్ఞాన పరిశోధనల బహుసమర్థతతో సాగించెను అలెగ్జాండరు యుద్ధముల గూర్చిన యితని గ్రంథము ఖిలమైపోయెను

అరిస్టాటిలు జరిగించిన శాస్త్రీయచర్చలకై, అలెగ్జాండరు కొద్దిగ ద్రవ్యసహాయము చేసెను, కాని విజ్ఞాన సహాయమునకై టాలమీ స్థిరనిధి నేర్పర్చి, దాని నలెగ్జాండ్రియాలో కళాలయముకు కళాదేవతలకును దత్తము చేసెను రెండుమూడు తరములవరకీనగరమున చక్కని వైజ్ఞానిక పరిశోధనలు జరిగెను. అచ్చటి వైజ్ఞానిక రత్నములలో 'యూక్లిడు' జ్యామితి అనగా క్షేత్రగణితము రచించెను, 'ఎరటస్థనిను' భూపరిమాణమును ఏబదిమైళ్ళ వ్యాసపు భేదముతో నిర్ణయింపగల్గెను, 'అపలోనియసు' సూచ్యగ్రవస్తువులగూర్చి లిఖించెను, 'హిప్పార్కసు' ఆకాశపునక్షత్రపటమును సూచీ పత్రమును ప్రథమమున రచించెను.

"హెరోన్" ఆవిరియంత్రపు పద్ధతిని మొదట కనిపెట్టెను. అప్పుడే సిరాక్యూసునుండి అచ్చటికి సుప్రసిద్ధ పదార్థవిజ్ఞాన వేత్తయగు "ఆర్కిమిడీసు" వచ్చి, తరుచు అచ్చట పరిశోధన సలుపుచుండెను. గ్రీకులలో జీవాంగవిభాగజ్ఞుడగు హెరోఫిలసు, జీవ్యంగ శస్త్రచికిత్స గూడ చేసెడివాడని చెప్పెదరు.

మొదటి రెండవ టాలమీలకాలమున జరిగినంతటి విజ్ఞానాభివృద్ధి తిరుగ క్రీ. త. 15 వ శతాబ్దమువరకు జరుగలేదు. కాని ఆయభివృద్ధి చిరస్థాయిగాక, మరొకతరము మాత్రముండెను, అంతత్వరలో నది క్షీణించుటకు కారణము లనేకములు. ఆకళాలయము రాజస్థాపితమై, అందుల పండితులందరును రాజాదరణపైనే ఆధారపడవలసివచ్చుట ముఖ్యకారణమని "మహాఫీ" పండితుడు సూచించెను. అరిస్టాటిలుకు విధేయమిత్రుడగు మొదటి టాలమీ దానినాదరించెను, కాని, కొన్నితరములైనంతట ఆరాజవంశీయులు ఈజిప్టుమతగురువులకు లోనై, ఆవిజ్ఞానాన్వేషకు ప్రోత్సాహమొసగక, పరిశోధన పద్ధతిని నిల్పుచేసిరి. ఆకళాలయమారంభమైన ఒక శతాబ్దముకే, పరిశోధన నిల్చిపోయెను. మొదటిటాలమీ అలెగ్జాండ్రియాలో శాస్త్రీయవిద్యల కాలవాలమగు గ్రంథాలయమును గూడ, స్థాపించెను. అందలి గ్రంథములకు నకలు ప్రతులగూడవ్రాసి అమ్ముచుండిరి.

అందుచే ననేకలేఖకు లందుపనిచేయుచుండిరి. ఇప్పటి మన విజ్ఞానాభివృద్ధి కీరీతిగా అప్పుడు జ్ఞానాంకురము కలిగినది. ఆ కళాలయగ్రంథాలయముల స్థాపనము మానవచరిత్రపు ముఖ్యసంగతులలో నొకటి, అది ఆధునికేతిహాసమునకు ఆరంభకము.

ఆపరిశోధనకును జ్ఞానవ్యాప్తికిని గొప్ప ప్రతిబంధక ముండెను, అప్పటి వైజ్ఞానికులకు వర్తకులతోను, శిల్పులతోను, సాంఘికసంబంధము లేకుండెను. అద్దపుపనులు లోహపుపనులు చేయు శిల్పులతో వైజ్ఞానికులకు ఆవిషయమున సంప్రతింపులు లేకుండెను. చిత్రవిచిత్రములగు రంగుల గాజుపూసలను డబ్బీలనేగాని, అప్పటి గాజుపనివాండ్రు "ఫ్లారెంసైనుఫ్లాస్కు" (అనగా ఉష్ణరక్షకములగు సీసాలు), "లెన్సు" (అనగా దుర్భిణిఅద్దము) ఇట్టివానిని చేయలేదు. సాదాఅద్దము మంచిదని వారికి తోచలేదు, లోహకారు డాయుధములను నగలనేగాని, సున్నితమగు త్రాసుల నెన్నడును చేయలేదు. శాస్త్రజ్ఞులు పరమాణువులనుగూర్చి పదార్థతత్వముగూర్చి దీర్ఘాలోచనల జేయుచుండిరిగాని, నిత్యకృత్యముల కుపయోగించు ఎనామలురంగు తయారు మొదలగువానినిగూర్చి వారికనుభవము లేకుండెను. కనుక ఆ కాలపు అలెగ్జాండ్రియావారు సూక్ష్మదర్శని యంత్రముల

గాని, రసాయన శాస్త్రముగాని, కనిపెట్టలేదు ఆవిరి యంత్రమును కనిపెట్టిన "హెరో" ఆయంత్రమును పంపులకుగాని ఓడలకుగాని ఉపయోగించలేదు, అది నిరుపయోగమయ్యెను ఒకవైద్యము తప్ప యితరసంగతులందు వైజ్ఞానికా విష్కారములను జనులకు నిత్యోపయోగకరమగు పనుల కుపయోగించనందున, జనులకందుశ్రద్ధలేక, విజ్ఞానాభివృద్ధికి తగుప్రోత్సాహములేకుండెను. ఇట్లు, మొదటి రెండవ టాలమీలతరువాత జ్ఞానవికాసముకు సహాయములేక, ఆకాలయపు ఆవిష్కారములు పురాతనగ్రంథములందే నిలచిపోయెను 'రినస్సన్స' నబడు 16 వ శతాబ్దపు పునర్వికాసమువలన ఆవిజ్ఞానము కుజీవము కలిగి, అప్పుడు జనసామాన్యమునకు దానివాసనతగిలెను.

ఆగ్రంథాలయమున క్రొత్తపుస్తకముల దయారుచేయు విధమును బాగుపడలేదు పేలికలనుండి పొందికగా కాగితముల జేయుట ప్రాచీనజనులకు తెలియదు కాగితములన్ని ప్రప్రథమమున చీనావారు తయారుచేసిరి, అది [illegible] త. [illegible] శతాబ్దమువరకు పాశ్చాత్యులకు చేరక, తోళ్లు [illegible] షెక్కలను మాత్రమే వ్రాత కుపయోగిం[illegible] చుట్టుటకును, తీసి చదువుకొనుటకును, [illegible] అందుచే పత్రములను అచ్చు పుస్త

కములను తయారుచేయ వీలులేకపోయెను. పూర్వశిలాయుగపుకాలముననే, జనులకు అచ్చువేయుటగూర్చి తెలిసియుండెను, ప్రాచీనసుమేరియాలో ముద్రికలుండినవి కాని సమృద్ధిగా కాగితములు లేనందున, అచ్చువలన లాభము లేకపోయినది ప్రతులువ్రాయు లేఖకులును అచ్చుపద్ధతికి వ్యతిరేకులై యుందురు అలెగ్జాండ్రియాలో గ్రంథములు చాలప్రియముగ నుండెను అందువల్ల శ్రీమంతులు పలుకుబడికలవారు తప్ప, మిగిలిన ప్రాచీనులలో జ్ఞానవ్యాప్తి లేకపోయెను మొదటి యిద్దరి టాలమీలవద్దనుండిన తత్త్వజ్ఞుల సంబంధికులకు దప్ప, మిగిలినవారికి ఆ జ్ఞానరశ్మి సోకలేదు. అది బాహ్యప్రపంచమునకు గనబడకుండ, మసిబారిన లాంతరుదీపమువలె (లోనవెలుగుచున్నను) బయటకు గోచరింపలేదు ముందు వైజ్ఞానికవిద్యలో సంపూర్ణపరివర్తనము గలిగించు బీజమప్పుడు నాటబడినదని తెలియక, మిగిలినవారందరు పూర్వపద్ధతినే సంచరించుచుండిరి ఈలోగా అలెగ్జాండ్రియాయే ఒకమూఢవిశ్వాసపు అంధకారము పాలబడెను.* తరువాత వేయేండ్లవరకు అరిస్టాటిలు నాటిన బీజము లీనముగనే యుండి, ఆతరువాత కదలి మొలకరించి,

* ఏడవశతాబ్దమున అరబులు అలెగ్జాండ్రియాలోని ప్రసిద్ధగ్రంథాలయమును తగలబెట్టిరను ఆరోపణ ఈవాక్యమునమూచితమగుచున్నది చుచు

కొన్ని శతాబ్దములలో ఆధునికజ్ఞానముగను భావములుగను పరిణమించెను, అవి ఇప్పుడు మానవ జీవితమునంతను మార్చివేయుచున్నవి

క్రీ పూ ౩ వ శతాబ్దములో అలెగ్జాండ్రియాలోనే గాక, ఇతరనగరములలో (అచ్చటి రాజ్యము భిన్నముగ చుండినను) ప్రతిభావంతులు జ్ఞానవ్యాప్తి జేయుచుండిరి సిసిలీ ద్వీపములోని సిరాక్యూసు అను గ్రీకునగరమున విద్యాజ్ఞానము లభివృద్ధిలో నుండెను ఆసియామైనరులోని 'పెర్గమం' అను చోట నొక పెద్ద గ్రంథాలయము నుండెను కాని యీ యవనరాజ్యమున కుత్తరదేశీయుల దాడిచే ముప్పుకలిగెను ఇదివరలో గ్రీకు ఫ్రిజియను మాసిడోనియను జనుల పూర్వీకులు వచ్చిన మార్గముననే, 'గాలు' లను ఆర్యజాతి నూతనవన్యజనులు దాడివెడలి, అనేకపురములు ముట్టడించి ధ్వంసముచేసిరి వీరి వెనుక ఇటలీయుండి 'రోమనుల'ను మరియొక తెగ విజృంభించి, డెరయసు అలెగ్జాండరుల మహాసామ్రాజ్యపు పశ్చిమార్ధభాగమును తమ స్వాధీనము చేసుకొనిరి వారు సమర్థులు న్యాయశాస్త్రజ్ఞులు, ఐనను, విజ్ఞానకళా[illegible]ందు వారికభిరుచిలేదు మరియు మధ్యఆసియానుండి [illegible]ల'ను అశ్వారూఢులగు సైనికులు చాపహస్తులై [illegible]లించిన రాజ్యముపై క్రొత్తగా దాడివెడలిరి.

వారు (క్రీ పూ 6, 7 శతాబ్దములందు మీడులు పారసీకులవలె) క్రీ పూ 3 వ శతాబ్దియందు 'పెర్సిపోలి' 'సూసా' నగరములనుండి పాలింపబడు గ్రీకు పారసీక సామ్రాజ్యము నాక్రమించి, తదితర దేశములకు పాశ్చాత్య దేశములతో, సంబంధము విడగొట్టిరి మరియు ఈసమయమున స్ఫురద్రూపులై ఆర్యభాషకులగు నార్డికుజాతివారేగాక, ఈశాన్య ప్రాంతము నుండి స్వర్ణదేహచ్ఛాయ నీలశిరోజములు గల్గిన మంగోలియను భాషికులగు కొందరు సంచారిజాతివారుగూడ రాదొడగిరి ఈజనులగూర్చి ముందు వివరింపబడును *

---

* గ్రీకులనుండి కొన్ని విషయములు భారతీయులు గ్రహించినట్లే, భారతీయవిద్వాంసులనుండియు గ్రీకులు చాల విషయముల గ్రహించిరని టాలమీ మొదలగు గ్రీకు ప్రముఖులే స్పష్టపరచిరి ఈ యుభయజాతుల వైజ్ఞానికులమధ్య అలెగ్జాండరుకు పూర్వమును, అలెగ్జాండరువచ్చినప్పుడును, తరువాతనుగూడ, తరుచు పరస్పర సమావేశముకలిగి, అందుచే నుభయ జాతుల శాస్త్రవిజ్ఞానము వృద్ధియయ్యెను అయితే భారతీయుల ప్రాచీన వైజ్ఞానికగ్రంథములు తరువాత చాలవరకు నశించుటచేత, అప్పటి వైజ్ఞానికాభివృద్ధిస్థితిని సరిగా నిర్ణయింప సాధ్యమగుటలేదు తక్షశిలావిశ్వవిద్యాలయము అలెగ్జాండ్రియాకు పూర్వమే మహోచ్ఛదశయందుండెను

ఇట్లు పాశ్చాత్యుల ప్రాచీన నాగరికత వివరింపబడినది, ఇక 28వ అధ్యాయమున భారతదేశపు బుద్ధుని సిద్ధాంత రహస్యము చెప్పబడును. దానిని గ్రహించుటకు ముందు అప్పటికి మనదేశస్థితి యెట్లుండెనో, శ్రద్ధాముగ గమనింపదగును

భారతీయార్యుల ముఖ్య ప్రాచీనగ్రంథమగు వేదవాఙ్మయము చే, వారి పరిస్థితులు, ప్రపంచమునకు కలిగిన లాభములు, ప్రపంచమున ఆ వాఙ్మయపు స్థానమునుగూడ, సూక్ష్మముగ గమనింపవచ్చును ఆర్య జాతులందరి వాఙ్మయములలో ఋగ్వేదసంహితయే అత్యంత ప్రాచీనము, ప్రధానము, మరియు నీవేదమంత్రము లిన్ని వేలయేండ్లనుండి యెట్టి మార్పులు కలుగకుండ పదక్రమముల యేర్పాటుతో నతి జాగ్రత్తగ కాపాడబడి, అందలి భావము గ్రహించుటకు శిక్షానిరుక్తాది వేదాంగములు గూడ వ్రాయబడినవి కనుక గ్రీకులాటినుల మొదలగు ఇతరార్య జాతుల ఇలియడ్, ఒడెస్సి మొదలగువాఙ్మయగ్రంథములకన్న ఋగ్వేద సంహితయందే, ప్రథమార్యజాతియొక్క మూలభాష, వారి భావములు ఆచారములు బాగుగా గోచరించును అందుచే, అసలు ఆర్యజాతియొక్క యథాస్థితి ఋగ్వేదమువలననే చక్కగా తెలియును మరియు ఆర్య భాష ఋగ్వేదభాషయందే విశేషపరిణామములేని సహజస్థితిలో నుండుటచే, దానిభాషకు యితరార్యభాషలతో పోలిక విస్పష్టముగ నున్నది గ్రీకు లాటిను ఇంగ్లీషు సంస్కృతము మొదలగు భాషల పరస్పర సంబంధమును, భాషలన్నియు కాలక్రమమున వృద్ధినొంది పరిణామమొందు రీతులను, తెలియజేయు శాస్త్రమగు 'కంపారటివ్ ఫిలాలజి' అను తారతమ్య భాషాశాస్త్రము సంస్కృతసహాయమువలన (ముఖ్యముగ ఋగ్వేదము వలన)నే యేర్పడెను. మరియు ఆదిమజనుల మనోభావములు యెట్లు [illegible]యగుచుండునో, సాదృశ్యాదులచేతను, ఉత్ప్రేక్షారూపకాదులచేతను [illegible]ట్లు కాలక్రమమున మార్పుచెంది వితివ్యాము లేర్పడునో, [illegible] 'కంపారటివ్ మిథాలజీ' అను తారతమ్యగాథాశాస్త్ర [illegible]ఋగ్వేద సంహితను బట్టియే 'మాక్సుముల్లరు' మొద [illegible]. సిద్ధాంతము లేర్పరచిరి పాశ్చాత్య గ్రంథములలోనవతె

గాక, ఋగ్వేద సంహితలోని ఈ కథలు గాథలు నిష్కపటమగు సహజశైలిలో, అందలి యదార్థ భావములు పూర్తిగా మరుగుపడకుండ గనే, కనబడుచున్నవి (యాస్క కుమారిలాదుల గ్రంథము లీగాథల యుద్దేశములను కొంతవరకు తెల్పుచున్నవి) వీటి సహాయముచే పాశ్చాత్యులు హోమరు మొదలగువారి తమ మూలగ్రంథముల గాథల భావములగూడ సమన్వయముచేసి, గ్రహింపగలిగిరి ఇంతేగాక మతవిషయమున వాయువు అగ్ని ఆకాశము (ద్యౌః) జలము (వరుణుడు) సూర్యుడు (మిత్రుడు) మొదలగు ప్రకృతి వస్తువుల తేజస్సును మొదట వేర్వేరుగా ఈశ్వరునిగా భావించి, తరువాత వీటియన్నిటి అంతర్యామియగు పరమేశ్వరు డొక్కడేయనియు, అట్టి పరమాత్మ విశ్వమంతటను వ్యాపించి యుండుననియు, జీవేశ్వరులకు ప్రకృతిఆత్మలకునుండు సంబంధమును గూర్చిన నరుల భావములు, విమర్శలు వాటిలో క్రమపరిణామము, ప్రపంచపు ప్రాచీన వాఙ్మయములలో నెల్ల మన వేదసంహితలందు ఉపనిషత్తులయందు మాత్రమే సరిగా కనబడును ఇట్లే అనాగరికులగు ఆదిమజనుల భావము లెట్లుండునో, ఎట్లు మార్పుచెందునో, ఆసంగతికూడ అథర్వవేదమున తెలియనగును (అథర్వసంహితలోని సంగతులు కొంతవరకు ఆదిమద్రావిడ సంపర్కమున వారిభావముల ద్యోతన చేయుచు రచింపబడినదని చాలమంది విమర్శకుల అభిప్రాయము) ఈ సిద్ధాంతములచే నూతనముగ నేర్పడిన "కంపారటివ్ రెలిజియన్" అను తారతమ్య మతశాస్త్రముగూడ మన వేదములందలి సంగతుల గ్రహించుటవలననే (19 వ శతాబ్దమున) ఉత్పన్నమైనది ఆధ్యాత్మిక విషయముల గూర్చి యితరదేశముల ప్రాచీనార్య గ్రంథములలో స్పష్టభావములేవియు లేవు ఇతరదేశార్యులు ప్రపంచమునకు ప్రత్యేకమతము నీయలేరు సరిగదా, తామునుస్వతంత్రమతములేక, చిరకాలముక్రిందనే అన్య

జాతీయము అన్యదేశీయము అగు క్రైస్తవమతమును (కొందరు మహమ్మదీయమతమును) అవలంబించిరి ఒక్క భారతీయార్యులే మొదటినుండి ఆధ్యాత్మికవిషయములందు ఇతరుల సంబంధములేకుండ స్వతంత్రకృషి చేసి, స్థైర్యము ప్రత్యేకవ్యక్తిత్వము గల హిందూసనాతన ధర్మమును స్థాపించి, దానిని అయిదువేలయేండ్లనుండి పోషించుటయేగాక, ప్రపంచ చరిత్రలో విశేషపరిణామము గావించి, నేటికిని ప్రపంచపు ముఖ్యమతములలో నొకటిగా నెంచబడు బౌద్ధమతస్థాపకుని గూడ కనిరి

క్రీ పూ 3000, 2000 ఆ ప్రాంతమున, ముఖ్యముగా సింధునది కాశ్మీరప్రాంతములందే, ఈఆర్యులుండిరి అప్పటికి చాలపూర్వముచ్చదశలోనుండి ఆదిమజాతివారితో మిశ్రితులై, నాగరికులగు ద్రావిడులు మన దేశమంతటను వ్యాపించియుండిరి క్రీ పూ 1000 నాటికి, ఆర్యులును వారిభాషయు ఆర్యావర్తమంతయు వ్యాపించిరి మరియు, అగస్త్య పరశురామాదుల నాయకత్వమున, సాహసికులగు కొందరార్యులు ఆశ్రమములద్వారా దక్షిణదేశమునగూడ ఆర్యనాగరికతను వ్యాపింపజేయుచుండిరి అయినను ఆర్యద్రావిడ సంఘర్షమునను ఇతరకారణములవల్లను ప్రాచీనార్యమతమందు కాలక్రమమునచాలపరిణామముకలుగుచుండెను ఋగ్వేద సంహితలోని ఆయామండలముల ద్రష్టలగు విశ్వామిత్ర వసిష్ఠాదుల ఆయా ఋక్కుల వివరములనుబట్టి, ఋషిసత్తములు లౌకికవిషయములందును ముఖ్యముగా తమ సంఘక్షేమమందును చాలశ్రద్ధవహించుచు, తమ రాజులకు సంఘములకు తోడ్పడుచుండినటుల గన్పడును గాయత్రీమంత్రమును మొదట కనిపెట్టిన విశ్వామిత్రుడు క్షాత్రమందును సాహసమందును మరి యెవరికిని తీసిపోలేదు వారార్యేతరులలో ఆర్యనాగరికతను శ్రద్ధతో వ్యాపింపజేసిరి అప్పటియార్యులమధ్య జన్మచేకులాచారభేదములుగాని, వారిలో అంతర్వివాహము అంతర్భోజనములు నిషేధించుటగాని

కనబడెను సంఘమున దేశీభావ మధికముగా నుండెను అప్పటిభారతీయార్యులు హిమాలయముల అద్భుత ప్రకృతిసౌందర్యమునందు ఈశ్వరుని చిద్విలాసమునను భవించుచు ఈశ్వరు నారాధించుచు, తమజాతియొక్క ప్రపంచముయొక్క భావి అభివృద్ధియందు విశ్వాసము కలిగి, ఉత్సాహ సాహసపూరితులై ఆనందాన్వితులై లౌకికవృద్ధిని గూడ అపేక్షించుచు, ప్రకృతిరహస్యములనుకూడ గ్రహించుచుండినట్లు, కనబడును ఆశీతలపర్వతములందు వారు మాంసభోజనము సోమపానముగూడ చేయుచు, యజ్ఞాదుల నిర్వర్తించుచు, నిత్యాగ్నిహోత్రముల నుంచుకొనుచుండిరి బదరికాశ్రమము నైమిశారణ్యములు పురాణవిద్యాకేంద్రములుగ నుండెను తరువాత యజుర్వేదము ఆయా బ్రాహ్మణములు ఆరణ్యకములు ఏర్పడిన కాలమునకు, ఆర్యులు కోసల విదేహ కురుపాంచాలాది దేశములందుండినట్లును, యాజ్ఞవల్క్యాది జ్ఞానాన్వేషణపరులు కొందరు ఆధ్యాత్మికవిషయములందును జ్యోతిశ్శాస్త్రాదులందును ప్రత్యేకపరిశోధన సల్పుచుండినట్లును, కన్పడును అప్పటికి మొదట ఇక్ష్వాకు హరిశ్చంద్ర సగర దిలీప శ్రీరామాదులక్రింద కోసలరాజ్యమును తరువాత మహాభారతయుద్ధకాలమున కురుపాంచాలరాజ్యమును, హస్తినాపురాది నగరములును, ప్రధానముగనుండెను కోసలరాజ్యము వృద్ధిలోనుండిన శ్రీరాముల కాలమునకే, మిథిలాధిపతియగు జనకుడు పాలించిన విదేహరాజ్యమాధ్యాత్మికపరిశోధనకు ప్రసిద్ధికెక్కియుండెను జనకుడును ఆయనగురువగు యాజ్ఞవల్క్యుడును జ్ఞానులయ్యు, మహాకర్మయోగులుగూడ యుండిరి బ్రాహ్మణముల తరువాత వచ్చిన సూత్రవాఙ్మయకాలమునను, శిక్షా వ్యాకరణ జ్యోతిశ్శాస్త్రాది వేదాంతగ్రంథములేకాక, షడ్దర్శనముల మూలగ్రంథములుగూడ రచింపబడి, తత్వశాస్త్ర మున్నతదశకువచ్చెను అందుచే, విద్వాంసులలో ఆయాపక్షముల వారి మధ్యనభిప్రాయభేదములు కలిగెను.

వేదాంత(ఉత్తరమీమాంస) శాస్త్రజ్ఞులు వేదసంహితలందలి మిత్రవరుణాగ్నివాయ్వాగులచేత నుద్బోధింపబడిన యీశ్వరుఁ డొకఁడే యందురు, అందుకొందరు ప్రకృతిసత్పదార్థము కాదనియు, ఎవనిమట్టుకు వాఁడు ప్రతినరుఁడు జ్ఞానియై కర్మలత్యజించి, ఈశ్వరుని సాక్షాత్కరించి, వీలైనంత వెంటనే ఐహికసంబంధము లేకుండ జేసికొనవలెననిరి, (ఇదియే అద్వైతసిద్ధాంతము) వేదాంతులలోనే ప్రకృతిసత్పదార్థమే యనియు, ఈశ్వరుఁడు చిదచిత్తులన్నిటికంతర్యామియై యుండుననియు, కేవల జ్ఞానార్జనమే గాక, ప్రసన్నులై నరులు ఈశ్వరప్రీత్యర్థమై లోకహితకరమగు కర్మలను జేయుచునే యుండవలెననియు, బోధాయనాది ఋషులు కొందరు భావించిరి, (ఇది విశిష్టాద్వైతము) వీరిలో తరువాత కొందరు వేదాంతులు, జీవుఁడు ఈశ్వరునికి సేవకతుల్యుఁడని, భక్తియే ముఖ్య నిశ్రేయస సాధనమని భావించిరి (ఇది ద్వైతము) ఈసిద్ధాంతములనే తరువాత వేయేండ్లు పైగా దాటినతరువాత, వేర్వేరుగా దక్షిణభారతదేశపు శంకర రామానుజ మధ్వాచార్యులు మరల ప్రత్యేకమతసిద్ధాంతములుగ ప్రతిపాదించిరి ఈ ఆధ్యాత్మికభావము లతిగూఢముగా నుండుటచే, సామాన్యజనులకు, అందుగ్రొత్తగా ఆర్యసంపర్కము కలిగిన ద్రవిడజాతులవారికి, అవి వెంటనే బోధపడకపోవుట, ఆచరణకు వీలుగాకుండుట, సహజమే ఇక పూర్వమీమాంసవారు యజుర్వేదమందలి యజ్ఞములందు వర్ణించిన ప్రకారము చేయుటవలననే అపూర్వమనబడు నొకవిశేషము (అందుచే మోక్షమును) కలుగునని, ఈశ్వరప్రశంసగాని జ్ఞానముగాని అవసరము లేదని వాదించి, కేవల [illegible]లైరి ఈమతమును జైమిని యుపపాదించెను వేదకాలపుపరిస్థితుల [illegible]మారి, ఇప్పుడార్యులకు మాంసాశన మద్యపానాదులు నిషేధిం[illegible]క్షపరిస్థితులు దేశసంస్థితులు మారినను ఆశబ్దములవే కాని ఆం[illegible] ఉద్దేశము వీరు గ్రహింపరైరి కణాదస్థాపితమగు వై

వైశేషికమతమున ప్రకృతివస్తువులతత్త్వనిరూపణము, అందుముఖ్యముగా 'అణు' సిద్ధాంతము చర్చింపబడెను కాని దాని యథార్థరహస్యమును గ్రహించుట కష్టసాధ్యమయ్యెను (పరమాణువును భేదించి దాని యథార్థమును పూర్తిగాగ్రహించి దానిని వశమొనర్చుకొని అందలి అమితశక్తిని వినియోగించుట కిప్పటి ప్రకృతిశాస్త్రజ్ఞులు విశేషముగ పరిశోధనలజేసి శ్రమపడుచున్నారు. ఐతే, అదియింకను సాధ్యముకాలేదు) గౌతమప్రతిపాదితమగు న్యాయదర్శనమున తర్కవాదమే ప్రధానము కేవలతర్కవాదముచే ఈశ్వర నిరూపణము మోక్షము సాధించుట దుస్సాధ్యమని సామాన్యులకందరికిని తోచును పాతంజలమగు యోగశాస్త్రమున శరీరమును ఇంద్రియములను నరుడువశమొనర్చుకొని, ఆరోగ్యవంతుడై, నిగ్రహియై, అందుచే నైతికకర్మను ఆత్మసాక్షాత్కారమును సులభసాధ్యమగునటుల చేయుట కర్తవ్యము, కాని యోగాభ్యాసమున శరీరబలమును సంపాదించుటయో లేక శరీరశోషణమో ముఖ్యాదర్శమనియు, అందుచేతనే గొప్ప ప్రయోజనము కలుగుననియు, దరిమిలాను కొందరుజను లపోహపడజొచ్చిరి ప్రకృతి ప్రత్యేక స్థిరపదార్థమేయనియు, పృథివ్యప్తేజో వాయ్వాకాశాదులు అందలి యంతర్భేదములనియు, లోకమునకనబడు అనేకవిధములగు భౌతిక మానసిక పరిణామములన్నియు ప్రకృతివే గాని పురుషునికి వాటిస్పర్శయుండదనియు, పురుషుడు వాటినిగమనించు సాక్షిమాత్రమేయనియు, కర్మఫలములను మనోదేహములు పొందుచుండుననియు, యథార్థజ్ఞానమును పురుషుడు పొందుట నిశ్శ్రేయసమున కావశ్యకమనియు, సాంఖ్యదర్శన సిద్ధాంతము, ఇది కపిలమహర్షి ప్రతిపాదితము ఇందు ఈశ్వరుడున్నాడని గాని, లేదనికాని, నిరూపణయుండదు ఆనిరూపణకవసరములేదని, నైతిక వర్తనమే ప్రధానమని, కపిలునిభావమైయుండును తక్కిన వేదాంతయోగవైశేషికదర్శనముల కీశ్వరప్రతిపాదనసిద్ధాంతము ముఖ్యము (ప్రాచీనభారతదేశమునజాబాలిచార్వాకాదులు కేవలనాస్తికవాదులుగూడనుండిరి.

క్రీ పూ 6వ శతాబ్దమునాటికున్న యీభిన్నసిద్ధాంతముల సామాన్యజనులు సరిగా గ్రహింపలేరైరి దేశకాలములను ప్రస్తుతస్థితికి వీలుగ ఆచరణలో మార్పు కావలసివచ్చెను అప్పటికి వేయేండ్లకిందటి వేద భాషలోనే మతబోధజరుగుచుండెను, అది జనులను, అందుముఖ్యముగా ప్రాకృతభాషయే తెలిసిన అప్పటిజన సామాన్యమును, ఆర్యేతరభాషికులగు ద్రావిడాదిమజాతులకును, సుబోధము కాకపోయెను వారిసంప్రదాయములు భిన్నములు, దేశమున యుద్ధములు కలహములు అధికమై, ఏకీభావము లేక, జనులు యెవరియిష్టముచొప్పున వారు వర్తించుచుండిరి, నైతికాదర్శము పోయెను ఇట్లు సంఘము చెడిపోవనారంభించెను ముఖ్యముగా జనులలో విభేదములు తొలగించి, తత్వశాస్త్రక్లిష్టత లేకుండ, నైతికమగు ఆదర్శజీవితమును దేశభాషలో బోధించు మార్గదర్శకు డవసరమయ్యెను

అట్టి పరిస్థితిలో క్రీ. పూ 6 వ శతాబ్దమున ఆదర్శజీవనమునకు వినుతికెక్కిన శ్రీరామవంశీయులగు కోసలరాజులకు సామంతులై ప్రజాప్రతినిధులుగ ఎన్నుకొనబడి పాలించు శాక్యుల వంశమున (ఇప్పటి నేపాళరాజ్యసమీపమున) బుట్టి, కార్యతత్పరతకు స్వార్థరాహిత్యమునకు పేరొంది మొదట విదేహానామమున జనకునిచేతను, తరువాత ఆర్యేతరులగు జరాసంధాదులచేతను, పాలితమై ఆర్యానార్యజాతుల సమ్మేళనముకల మగధరాజ్యమున పెరిగిన బుద్ధుడే ఈకార్యమునునిర్వహించుట తగియున్నది

అప్పటికి శిశునాగవంశీయుడగు బింబిసారుడును, అతని అనంతర మాతనికుమారుడగు అజాతశత్రువును, మగధరాజ్యమునకు రాజులై రాజగృహా నగరమునుండి పాలించుచుండిరి మహాభారతకాలమున మగధరాజధానియగు గిరివ్రజపురము దానియాభేద్యమగుకోటయు బుద్ధుని కాలమునకే ప్రాశస్త్యముగోల్పోయి శిథిలమైనటుల తోచును

అప్పటిభారతదేశపు ఆర్యనాగరికతకు ముందే, ఈదేశమున వేరే యితరజాతులు, వారినాగరికతగూడ, ఉండెను వారిస్థితి నిక్రింద కొంత గమనింతము మనదేశమున పూర్వము నీలవర్ణులగు కొలేరియనులు లేక కోలులనబడు ఆదిమజనులు గోధుమవర్ణులగు ద్రావిడజాతి, ఈరెండు జాతులు కొంతవరకు మిశ్రితులైరి (ఆర్యులు వ్యాపించినకొలది) వీరిలో కొందరు వింధ్యగిరివంటి కొండలలోనికి అప్పటిదండకాటవి మొదలగు భయానకారణ్యములలోనికి మన్యప్రదేశములలోనికిని పోయి, స్వతంత్రులుగానే యుండిరి కొందరార్యపాలన మంగీకరించిరి ఆదిజనులలో కొందరార్యాధికారమంగీకరింపక, ప్రత్యేకగ్రామముల నేర్పరచుకొని అందునివసించుచుండిరనియు, వారికి ఆర్యస్పర్శ తక్కువగానుండెననియు, వారిసంతతివారే యిప్పుడు అస్పృశ్యులనబడు మాల, మాదిగ, పరయ, హొలియ, మహార్, మెహాతర్, ఇత్యాదినామముల హరిజనులనియు, కొందరి యభిప్రాయము వారు బ్రాహ్మణశూద్రసంకరజాతి పతితజాతి యనుటకన్న నిదియే ఎక్కువతృప్తికరముగ కన్పడును చరిత్రకాలమునకు పూర్వమే గాంధారము (అఫ్గనిస్థానము) మొదలు కామరూపము (అస్సాము) వరకు ఉత్తరహిందూస్థానమంతటను ఆర్యరాజ్యములు స్థాపింపబడి, అచ్చటి సంస్కృత ప్రాకృతముల శాఖలగు శౌరసేని, మాగధి, అర్ధమాగధి, సౌరాష్ట్రి, ఇత్యాదులును, అందుండి చివరకు ఇప్పటిహిందీ, బెంగాలీ, అస్సామీసు, ఓఢ్రము మహారాష్ట్రము, గుజరాతీ సింధీలును, కలిగినవి, అట్లే దక్షిణదేశపు ఆంధ్రద్రావిడుల ఆంధ్రపాండ్య చోళ కేరళరాజ్యములందలి ద్రావిడభాషకు ఆర్యసంపర్కము క్రమముగాగలిగి, అందును ప్రాంతీయభేదము లేర్పడి, చివరకు ప్రస్తుతపు ఆంధ్రము, అరవము, మళయాళము, కన్నడము, ఇత్యాదు లేర్పడినవి ఆంధ్రభాషకు మూలము సంస్కృతప్రాకృతములే యని సాంప్రదాయికు లందురు.

కాని ఆంధ్రము అసలు ద్రావిడ కుటుంబములోనిది అని భాషా శాస్త్రజ్ఞుల అభిప్రాయము అయితే చరిత్రకాలమునకు చాల పూర్వమే ఆంధ్రము ద్రావిడమునుండి విడిపోయి, ఆంధ్ర చాళుక్యరాజుల పాలనమున ఆర్యభాషలతో అధికసంబంధము కలదై, సంస్కృత ప్రాకృతముల దత్తపుత్రికగా పెరిగినట్లు తోచును ఇప్పటి ఆంధ్రమందు చాలవరకు సర్వనామములు అంకెలపేర్లు నిత్యావసరములపేర్లగు పాలు ఉప్పు తల కాలు అన్న పిల్ల ఇత్యాదులు ద్రావిడపదములే అయినను, మొత్తము మీద ప్రస్తుతాంధ్రములో నూటికి 70 పైగా సంస్కృత ప్రాకృత సంబంధమైనవే ఆంధ్రమునకు తక్కిన ద్రావిడ శాఖలకును కొన్ని ప్రాకృతశాఖలతోను కొంత సంబంధమున్నట్లును సూచనలు కల్గినవి ఆంధ్ర జాతి ఆర్యులే అనికాని, ఆర్యేతరులనికాని, నిర్ణయించుట కష్టము భాషను బట్టియే అనార్యద్రావిడులనుటకు వీలులేదు ఆర్యభాషికులైనను బెంగాలీవారు శరీరనిర్మాణమునుబట్టి ద్రవిడ మంగోలుజాతి మిశ్రితులని నిర్ణయింపబడినది మొత్తముమీద ఆంధ్రులు (చాలవరకితరులును) ఆర్య ద్రావిడాది మిశ్రితులని చెప్పవచ్చును ఆంధ్రదేశపు వేంగికళింగ చాళుక్య రాజ్యములు ఆర్య ద్రావిడ రాజ్యముల మధ్యనుండి ఉభయ సంపర్కము కలిగియుండెను ప్రాచీనకాలమున హిందూస్థానమందు హిమాలయప్రాంతమందు గూడ చాల తెగల జనులుండినట్లు, 6 వ శతాబ్ది అమరసింహుని నిఘంటువులోని "విద్యాధరోప్సరోయక్షరక్షోగంధర్వకిన్నరాః । పిశాచో గుహ్యకస్సిద్ధో భూతోమీ దేవయోనయః" అను శ్లోకము వగైరాలు సూచించును వీరందరు ఆర్యులో కారో తెలియదు. చారిత్రకకాలమున అంతర్జాతి వివాహముల నిషేధ మధికమయినను అంతకుముందే అనులోమ, వివాహములవలనను, కొన్ని తెగలు యితర ప్రాంతములకు పోవుటవలనను, ఇతర కారణములవల్లను, వసిష్ఠవ్యాసాది [illegible]ర్షుల కాలమందే జాతిమిశ్రణము కలిగినట్లు, భారతాదులవల్లనే కను[illegible] ఇట్లు బుద్ధుడు జనించు కాలమునకు ఆర్యద్రావిడాదుల సం[illegible]గరికత మిశ్రితమైనవి, మరియు, కొంతవర కాజాతులుగూడ [illegible]

గౌతమబుద్ధుడు జనించునప్పటికి భారతదేశపు స్థితి యిట్లుం[illegible]

లకును స్పర్ధ కలిగెను క్రీస్తుకు ముఖ్యదూత యగు "సెంటుపీటరు"కు తాను స్థానీయుడనని పోపు ప్రకటించెను గ్రీకుచక్రవర్తి గ్రీకుపీఠాధ్యక్షుడు అందు కంగీకరింపరైరి ఈవిభేదములకుతోడు, క్రైస్తవత్రిమూర్తి సిద్ధాంతవిషయమై తగవులు బయలుదేరెను, తుదకు 1054 లో పూర్తిగా విచ్ఛేదము కలిగెను లాటినుగ్రీకుపీఠములమధ్య విభేదము ఆ మధ్యయుగజనులకు మరింత నష్టముకల్గించెను ఈవిభిన్న క్రైస్తవరాజ్యముపై మూడు ప్రత్యర్థివర్గముల దెబ్బలు తగిలెను బాల్టికు ఉత్తరసముద్రప్రాంతముల ఆర్యుల తెగవారు కొందరు మిక్కిలి ఆలస్యముగా క్రైస్తవమత మవలంబించిరి, ఈయుత్తరదేశీయులు సముద్రముపై దోపిడివృత్తి నారంభించి, స్పెయినువరకుగల క్రైస్తవప్రాంతతీరమంతయు దాడిసల్పిరి, నదులగుండ మధ్యదేశముకు, అచ్చటనుండి దక్షిణముకును, వారు నదులలోనికి తమనౌకల జేర్చి, కాస్పియను నల్లసముద్రములమీదగూడ దోపిడిచేసిరి రష్యాలో చిన్నరాజ్యముల నెలకొల్పిరి, వీరే మొదటిరష్యనులు ఈరష్యనులు కాన్‌స్టాంటినోపిలు నాక్రమింపబోయిరి 9వ శతాబ్దిలో చార్లమను శిష్యుడు అతని పోష్యుడునగు ఎగ్బర్టుపాలనమున ఇంగ్లండు జర్మను భాషికమై, క్రైస్తవదేశమయ్యెను అతని అనంతరుడగు "ఆల్ఫ్రెడ్" (886) వద్దనుండి ఈఉత్తరజనులు సగము

రాజ్యము లాగుకొని, 1016 లో కన్యూ్యట్ ఆధిపత్యమున ఇంగ్లండునంతను జయించిరి "రోల్ఫు దిగాంగర్" క్రింద 912 లో, ఉత్తరజనుల దండింకొకటి ఉత్తరఫ్రెంచిదేశము జయించెను అదియే నార్మండీ అనబడెను

కన్యూ్యటు ఇంగ్లండునేగాక నార్వే డెన్మార్కులగూడ పాలించెను. కాని అతని తరువాత కుమాళ్ళ తగవుచే ఆ రాజ్య మనేకభాగము లాయెను, అనాగరికులలో నీలోపము మామూలే ఈయుత్తరదేశీయుల తాత్కాలికైక్యము స్థిరమైనచో, లోక మెట్లుండెడిదో? వారద్భుతశక్తి సాహసవంతులు, తమ చిన్ననౌకలలో ఐసులండు గ్రీనులండు వరకు ప్రయాణముచేసిరి, అమెరికా నేలపైన మొదట వారే దిగిరి తరువాత నినార్మనులు సారసినులయొద్దనుండి సిసిలీ నాక్రమించి, రోమును దోపిడిచేసిరి వారియైక్యము స్థిరమైనచో, కన్యూ్యటురాజ్యము అమెరికామొదలు రష్యావరకు గొప్పనౌకాబలము గల్గియుండెడిది

జర్మనులకు లాటిను యూరపియనులకు తూర్పువైపున స్లావులు తురుష్కులు మిశ్రితులై యుండిరి వారిలో 8, 9 వ శతాబ్దములలో పశ్చిమమునకు వచ్చుచున్న 'మాగ్యరు'లును హంగేరియనులును ముఖ్యులు, చార్లమను వారిని కొంతకా

లము నిరోధించెను కాని అతని యనంతరము వారు ప్రస్తుతపు హంగరీలో స్థిరవాసులైరి *

వారు, తమ సజాతీయులగు హూణులవలె, యూరపులోని స్థిరరాజ్యములపై ప్రతి వేసవిని దండెత్తుచుండిరి 938 లో జర్మనీగుండ ఫ్రాంసు ప్రవేశించి, ఉత్తర ఆల్ఫ్సు కొండలుదాటి యిటలీ వెళ్లి, అంతయు దగ్ధపటలము జేసి, గృహము చేరిరి

దక్షిణమున సారసీనులు రోమక సామ్రాజ్య శేషమును చూర్ణముచేసి, సముద్రాధికారమును వహించిరి నల్లసముద్రమందలి రష్యను జౌత్తరాహులు, పశ్చిమపు ఉత్తర దేశ్యులు, సముద్రముపైన వారికి తగు ప్రత్యర్థులై యుండిరి

ఈ ప్రబలవీరుల వ్యాప్తిచే తమ కగ్రాహ్య మగు శక్తులు అపాయము చుట్టుముట్టుచుండెను, కాని వాటిని గ్రహింపక చార్లమను అతని తరువాత ఆశాయుతులగు రాజులు "పవిత్రరోమక సామ్రాజ్య" మను పేర పశ్చిమ సామ్రాజ్యమును పునర్నిర్మాణము చేయ యత్నించిరి తూర్పున కాన్‌స్టాంటినోపిలు పరిసరములు మాత్రము మిగిలి,

* హంగరీ దక్షిణభాగము జర్మనుమహా యుద్ధానంతర (1919) వర్సెల్సు సంధితరవాత 'జూగోస్లావియా' అనుపేర రిపబ్లికుగ నేర్పడినది

తక్కినదంతయు క్షీణించెను. చార్లమను కాలమునుండి వేయేం డ్లుగా నిట్లు యూరపుఖండ మీ సంప్రదాయమున లగ్నమై యుండెను

యూరపు చరిత్రయందు చార్లమను పేరు చాల గొప్పగా తోచినను, అతనివ్యక్తి స్పష్టముగ లేదు అతడు నిరక్షరుడు, కాని విద్యయెడ గౌరవముకలవాడు, భోజనసమ యమం దెవరైన చదువగా వినుట, మతచర్చలును, అతని కిష్టములు తన శీతకాల నివాసమైన 'ఐలాషపెలు'లోను 'మేయెన్సు'లోను అనేక విద్వాంసుల జేరదీసి, వారి సంభా షణలనుండి చాల గ్రహించెను, వేసవిలో స్పెయినులోని పార సీకులపైనను, స్లావు మాగ్యరు సాగ్జనులపైనను, క్రైస్తవే తరులగు యితర జర్మను తెగలపైనను, యుద్ధము చేసెడివాడు ఉత్తర యిటలీని జయింపకముందే రోమ్యులను అగస్టసు తరు వాత తాను 'సీజరు' కావలెనని అతనికేతోచెనో, లేక, లాటినపీఠమును కాన్‌స్టాంటినోపిలునుండి స్వతంత్రముచేయ గోరిన 'మూడవ లియో' పోపు ఉపదేశించెనో తెలియదు

చక్రవర్తిపట్టాభిషేకమున కిరీటము నతనితలపైన పోపేడుంచెనని, అట్లు లేదని, చూపుటకు, రోములో అతి విచిత్ర యుక్తుల బన్నుచుండిరి క్రీ త 800 వ ఏట క్రిస్ట మసు దినమున విజయుడై వచ్చిన చార్లమనును హఠాత్తుగా

పోపు అభిషిక్తునిజేసెను. పోపు ఒకకిరీటము దెచ్చి చార్లమను శిరముపై నుంచి, 'సీజరు' 'అగస్టసు అను బిరుదములతో గౌరవించెను, ప్రజలుమిక్కిలిహర్షించిరి, చార్లమనుకు మాత్రమందుచే విచారమయ్యెను, అది పరాభమనియే అతడు భావించెను కిరీటమును పోపు పెట్టకుండ తానేలాగుకొని, స్వయముగ తలపై నుంచుకొనవలెనని, తనకుమారునికతడు బోధించెను ఈసామ్రాజ్యోద్ధరణపు ఆరంభమందే, ప్రాధాన్యముకై పోపుకు చక్రవర్తికిమధ్యతగవు మొదలిడెను కాని చార్లమను కుమారుడగు 'లూయీ ది పయస్', తండ్రిబోధల నిర్లక్ష్యముచేసి, పోపుకు పూర్తిగాలొంగియుండెను

చార్లమను సామ్రాజ్యము 'లూయీ' అనంతరము విచ్ఛిన్నమైనది ఫ్రెంచిమాటాడు ఫ్రాంకులకు, జర్మనుమాటాడు ఫ్రాంకులకు, విభేదముకల్గెను 919 లో జర్మను సామంతులు మతాధిపులు హెన్రిపౌలరును చక్రవర్తిగా నెన్నుకొనిరి ఈసాగ్జనుజాతీయుని తరువాత, ఇతని కుమారుడు 'ఒట్టో'చక్రవర్తియయ్యెను 962 లో 'ఒట్టో'రోముపై దాడివెడలి, అక్కడ పట్టాభిషేకమొందెను 11 వ శతాబ్దారంభమందీసాగ్జను వంశముపోయి, ఇతరజర్మను రాజులు వచ్చిరి పశ్చిమమందు ఫ్రెంచిభాషీయులకు సంస్థానాధి

పతులు, చార్లమనునుండి బయలుదేరిన 'కార్లొవి' వంశము తరువాత, జర్మనురాజులకు లోబడలేదు, నార్మండీ ప్రభువు, ఫ్రెంచిరాజు, మరి యితరులును, ఇందుచేరలేదు

987 లో ఫ్రెంచిదేశము కార్లొవీవంశమునుండివీడి, 'హ్యూకాపె' హస్తగతమై, 18 వ శతాబ్దమువర కావంశీయులక్రింద నుండెను హ్యూకాపేకాలమున ఫ్రాంసురాజు పారిసుపరిసరముమాత్రమే పాలించెను

1066 లో, ఇంగ్లండుపై నొకేమారు 'హెరల్డుహర్డ్రాడా' నేతృత్వమున 'నార్వే' వారగు ఉత్తరదేశీయులును నార్మండీప్రభువుక్రింద లాటిను ఉత్తరదేశీయులును దాడివెడలిరి ఇంగ్లండురాజగు 'హారల్డు' వీరిలో మొదటి వారిని 'స్టాంఫర్డు బ్రిడ్జి' యుద్ధమున నోడించెను కాని రెండవవారిచే 'హేస్టింగ్సు' యొద్ద నోడిపోయెను ంగ్లండు నార్మనుల పాలబడి, స్కాండినేవియను ట్యూటను రష్యనుల సంపర్కము వీడెను, అంతట ఫ్రెంచివారితో విశేషసంబంధము సంఘర్షము కలిగెను తరువాత నాలుగుశతాబ్దములు, ఇంగ్లీషువారు ఫ్రెంచి భూస్వాముల తగవులలో చిక్కుకొని, ఫ్రెంచిసీమలో తమశక్తిని వ్యర్థముచేసిరి

---

'చార్లమను' అరేబియనునైట్సు కథలందు ప్రసిద్ధిచెందిన 'హారౌను-ఆల్-రషీద్' అను ఖలీఫాయు, సమకాలికులు డమస్కసు స్థానే తరువాత 'బగ్దాదు మహమ్మదీయ రాజధాని అయ్యెను, అందుండి హారౌను-ఆల్-రషీమ అద్భుతమగు గుడారము, నీటిగడియారము, గజము, క్రీస్తు గోరీ తాళముచెవులు, వీటిబహుమతితో రాయబారుల బంపెనట ఈతుదిబహుమతివలన బైజంటైన రాజ్యము పవిత్రరోమక సామ్రాజ్యముల చక్రవర్తులు (జెరూసలెంలోని క్రైస్తవుల రక్షణహక్కులు విషయమై) తమలో తాము కలహించిరి

9 వ శతాబ్దమున యూరపు అంతయు యుద్ధములందు దోపిడులందు బడియుండ, ఈజప్టు మెసపొటేమియాల ఆరబుసామ్రాజ్యము మహానాగరికతతో నొప్పియుండెనని, ఈ ఒహుమతులు సూచించును అందు వాఙ్మయవిజ్ఞానములు కళలు వృద్ధిజెందుచు, నరులు స్వతంత్రులు ఉదారులునై నిర్భయులై యుండిరి సారసెన్ రాజ్యము క్షీణించుచున్న స్పెయినులో ఉత్తరఆఫ్రికాలో గూడ మంచివిజ్ఞాన జీవనముండెను యూరపు అంధకారమయమైయుండిన యాశతాబ్దము

లలో, యూదులు, అరబ్బులు అరిస్టాటిలు గ్రంథముల జదివి, చర్చించుచుండిరి, వారు మూలబడియున్న తత్త్వవిజ్ఞానశాస్త్ర బీజముల భద్రపరచిరి

ఆ ఖలీఫారాజ్యమునకు ఈశాన్యమున ననేకతురుష్క జాతులుండెను వారు ఇస్లాములోచేరి, దక్షిణమందలి పర్షియను అరబ్బులకంటె హెచ్చు వీరావేశముతో, ముస్లిం మతాభిమానులైరి పదవశతాబ్దమున నరబ్బులబలము క్షీణించినను, ఈధీరులగు తురుష్కులు బలియులైరి ఖలీఫా కీతురుష్కులతో సంబంధము 14 శతాబ్దులకుపూర్వము తుది బాబిలోనియను సామ్రాజ్యమువట్ల మీాదులసంబంధమువలె నుండెను 11 వ శతాబ్దములో సెల్జూక్ తురుష్కులనబడు కొన్ని తురుష్కజాతులు మెసపొటేమియా ప్రవేశించి, ఖలీఫాను వశపరచుకొని, పేరుకుమాత్రము తమ పాలకునిగ జేసుకొనిరి, అంతట వారు ఆర్మీనియాజయించి, ఆసియామైనరులో శేషించిన బైజంటైను రాజ్యముపై బడిరి, 1071 లో 'మెలాన్‌గర్డు' యుద్ధములో బైజంటైను సైన్యము నోడించి ఆసియాలో బైజంటైనురాజ్యము నిశ్శేషముచేసిరి, మరియు నిసియాదుర్గము పట్టుకొని, కాంస్టాంటినోపిలును కూడ పట్టుకొనయత్నించుచుండిరి

అప్పుడు బైజంటైను రాజగు 7వ మైకేలు భయభ్రాంతు డాయెను అప్పటికే ఒకమూల నార్మనులు "మరాజో"నొక ప్రక్కను "పెశ్చనెగు"లను తుర్కిజాతీయులు డాన్యూబుప్రాంతము నొకప్రక్కను ఆక్రమించిరి, అత డప్పటికే వారితో యుద్ధముల జిక్కుకొనెను, తుద కతడు సహాయమునకై పశ్చిమచక్రవర్తి నాశ్రయింపక, లాటినుక్రైస్తవప్రాంతాధిపుడగు రోములోని పోపు నాశ్రయించెను ఇది చిత్రము, అతడు పోపగు 7 వ గ్రిగరీకి ఉత్తరములు వ్రాసెను, ఆతని అనంతరపు "అలెగ్జియసు కామ్నెనసు" రాజు "2వ అర్బను" (పోపు) కు మరింత ఆతురతతో వ్రాసెను

లాటినుగ్రీకుపీఠముల విభేదము కలిగి 25 ఏండ్లైనగాలేదు, ఆవివాదమింకను ప్రజలహృదయములతో లగ్నమైయుండెను బిజాంటియం వారోడిపోగా, విడిపోయిన గ్రీకులపై మరల సర్వాధికారము చలాయింప పోపుకు సందుదొరకెను మరియు, పాశ్చాత్యక్రైస్తవులను కలవర పఱచుచున్న మరిరెండు సమస్యలగూడ పరిష్కరించుట కిందుచే పోపు కదను కలిగెను ఇందొకటి, జనులు కలహప్రియులై తమలో తాము పోరుటచేసాంఘికజీవనము కలుషితమగుట, రెండవది, పల్లపుప్రాంతముల జర్మనులు, ఔత్తరాహులు, ఫ్రాంకులు, నార్మనులు, వీరియద్భుతశౌర్యసాహసముల వినియోగించుట

క్రైస్తవులందరు తమలో యుద్ధములు మాని పుణ్యక్షేత్ర మగు 'జెరూసలెం' పురిని పట్టుకొనుటకై తురుష్కులపై మత యుద్ధమొనర్పవలెనని పోపు బోధించెను (1095) మ్లేచ్ఛుల నుండి పవిత్రమగు క్రీస్తుగోరీని వశముచేసికొనుట దీనియుద్దే శము 'పీటర్ ది హెర్మిట్' అనునత డిందుకై ఫ్రాంసు జర్మనీల జనులలో చాలప్రబోధము గావించెను అతడు ముదుకబట్టలను ధరించి, పాదచారిగనో గార్ధభముపైనో తిరిగి, పెద్దశిలువధరించి, వీధులలోను గుడులలోను జనుల కుపన్యసించెనట, క్రైస్తవయాత్రికులు తురుష్కులచే బహు బాధల వర్ణించి, క్రీస్తుపవిత్రసమాధి అన్యమతస్థుల వశమం దుండుట క్రైస్తవుల కవమానకరమని బోధించెను శతా బ్దములకొలది క్రైస్తవమతబోధ వినియున్న జనుల కందుచే చాలయుత్సాహము కలిగెను అందుచే పాశ్చాత్య ప్రపం చముపై నొకమహాతరంగము వ్యాపించి, క్రైస్తవజనసంఘ ము తనశక్తి దెలుసుకొనెను

అప్పుడు సంఘలాభముకై సామాన్యజనులేకమై సిద్ధ మైరి, ఇట్లగుట నరజాతికి క్రొత్తవిషయము అట్టిది వెనుకటి రోమక హిందూదేశ చీనాచరిత్రలలో నేదియులేదు అట్టి యుద్యమము బాబిలను ఖైదునుండి వచ్చినతరువాత యూ దులలో మాత్రము కొద్దిగా నుండెను తరువాత కొంత

కాలముకు ముస్లిములును తత్తుల్యమగు ఐక్యమొందిరి అట్టి ఉద్యమములన్నియు ప్రచారమతముల నూతన భావములతో సంబంధించినవి హీబ్రూప్రవక్తలు, యేసు, అతని శిష్యులు, మణి, మహమ్మదు, వీరందరును మానవుల వ్యక్తిఆత్మలకు ప్రబోధమొనరించిరి, వారు జనుల ఆత్మలకు దేవసాన్నిధ్యము కలుగజేసిరి అంతకు పూర్వము, మతములు, వ్యక్తిసంబంధమగు ఆత్మజ్ఞానము గాక, సంఘము మొత్తముకు సంబంధించి, మూఢవిశ్వాసములపై నాధారపడి యుండినవి

ప్రాచీనమతము దేవాలయములపైనను అర్చకులపైనను యజ్ఞయాగములపైనను ఆధారపడి, సామాన్యజనుల భయపెట్టి దాసులుగ జేసికొనెను కాని ఈక్రొత్తమతములానరుని మానవత్వము నిలిపెను

ఈమొదటి యుద్ధప్రబోధముచే, యూరపులో సామాన్యజనులు మొదటిసారి మేల్కాంచిరి అందుతోనే ఆధునిక ప్రజాయత్తత ఆరంభించెనన వీలులేదు, కాని అప్పుడు కొంత కదలికగల్గెను, అనతికాలముననే అది మరల చలించి, సాంఘికమతవిషయములందు కల్లోలము గల్గించెను.

ఈమొదటి ప్రజోద్యమము శోకాంతమయ్యెను సామాన్యజనబృందము లనేకములు ఫ్రాంసు రైనులందు మధ్య యూర

పులనుండి, (నాయకులు సాధనసామగ్రియులేకయే) పవిత్ర మగు క్రీస్తుగోరీని రక్షింపబయలుదేరిరి ఇది ప్రజల క్రైస్తవ మతయుద్ధయాత్ర రెండు పెద్దగుంపులు పొరబాటున హంగరీ ప్రవేశించి, ఈవెనుకనే మతమంగీకరించిన 'మాగ్యరుల'ను అన్యమతస్థులుగా దలచి, వారిపై అనేకఘోరములాచరించి, వారిచే చిత్రవధ గావింపబడిరి, మూడవదండును వ్యవస్థలేని మనస్సుతోనే ప్రాగ్దిశకునడచి, హంగెరీలో నిర్మూలితులైరి. "పీటర్ ది హెర్మిటు" ఆధిపత్యమున మరిరెండు పెద్దగుంపులు కాంస్టాంటినోపిలు చేరి, బోస్ఫరసు జలసంధి దాటి, సెల్జూకు తురుష్కులచే హతులైరి యూరపియనుల ప్రథమయత్నపు ఆద్యంతము లిట్లయ్యెను

మరుసటియేట 1097 లో జరుగు యుద్ధముకై మంచి సైనికులగు నార్మనుతత్వపువారు బోస్ఫరసుదాటి నిసియాను గొల్లకొట్టి, 14 శతాబ్దములకు పూర్వము అలెగ్జాండరు వెళ్ళిన మార్గముననే ఆంటియోకును ముట్టడించిరి. ఆముట్టడి యొకసంవత్సరము పట్టెను 1099 జూనలో ఆవీరులు జెరూసలెం ప్రవేశించి, ఒకనెల ముట్టడి తరువాత, దానిని పట్టుకొనిరి ఘోరరక్తపాతమై, వీధులలో సవారిచేయువారిపై కూడ చిందునట్లు రక్తము ప్రవహించెను, 15వ తేదీ సాయం

కాలముకు పవిత్రమగు క్రీస్తుసమాధిస్థలమున్న దేవాలయము లోనికి చొచ్చి, అక్కడి అడ్డంకుల జయించి, రక్తసిక్తులై, వారలసటజెంది ఆనందబాష్పయుతులై ప్రార్థనసలిపిరి

వెంటనే లాటినులకు గ్రీకులకు మరల కలహములు వచ్చెను ఆ క్రైస్తవయుద్ధసైనికు లందరు లాటినువారు జెరూసలెంలోని గ్రీకుమతాధిపుడు గ్రీకు, తురుష్కుల క్రింద కంటెను, ఈ నూతనవిజేతలగు లాటినులక్రింద అతనిస్థితి మరింత హీనమయ్యెను ఈక్రైస్తవమతసైనికులు బైజంటై నులకు తురుష్కులకు మధ్యచేరి, ఇరువురితోను పోరుచుం డిరి ఆసియామైనరులో విశేషభాగమును బైజంటైను చక్ర వర్తి తిరుగ ఆక్రమించెను, గ్రీకులకు తురుష్కులకు మధ్య లాటినుల జెరూసలెం దానిచుట్టుపట్ల కొన్ని చిన్నసంస్థానము లతో సరిహద్దుదేశముగా నేర్పడెను ఈసంస్థానములలో సిరి యాలోని "ఎడిస్సా" ముఖ్యము ఈసంస్థానములపై గూడ వారియధికారము నామమాత్రమే 1144 లో "ఎడిస్సా" ముస్లిముల వశమైనది దీనికై మరియొక క్రైస్తవమత యుద్ధము బయలుదేరి, ఎడిస్సాను సంపాదింపలేక నిష్ఫలమై నను, ఆంటియక్ మాత్రమట్టిగతి పాలుగాకుండ రక్షించెను

ఈజిప్టు నాక్రమించిన కుర్దిషు తురుష్కవీరుడగు 'సలాడీను' 1169 లో ఇస్లాంసైన్యము గూడదీసి క్రైస్తవు

లపై మతయుద్ధము చేయ ప్రబోధించి, 1187 లో జెరూస లెమును మరల పట్టుకొనెను అందుచే మూడవ క్రైస్తవ మత యుద్ధము కలిగెను, కాని క్రైస్తవులు జెరూసలెము నాక్రమింపలేకపోయిరి నాల్గవ మతయుద్ధములో (1202-4) లాటినులు బహిరంగముగ గ్రీకు సామ్రాజ్యముపైనే బడిరి, తురుష్కులతో బోరాడు నటన నైన జేయరైరి, ఆ యాత్రి కులు 'వెనిసు'లో బయలుదేరి, 1204 లో కాంస్టాంటినోపి లును కొల్లగొట్టిరి ఈ దండయాత్రకు వర్ధమానమగు వెనిసు అను మహావర్తక నగరపు పౌరులు నాయకులై, బైజంటైను సామ్రాజ్యపు తీరములను ద్వీపములను ఆక్రమించిరి ఫ్లాండర్సు దేశపు బాల్డ్విననబడు లాటినురాజు కాంస్టాంటి నోపిలులో ప్రతిష్ఠితుడయ్యెను, అందుచే గ్రీకు లాటిను శాఖలు రెండును మరల మిళితమయ్యెను 1261 లో గ్రీకులు మరల రోమనులనుండి స్వతంత్రులైరి అంతవర కారాజులు కాం స్టాంటినోపిలు పాలించిరి

పదవశతాబ్దమందు ఔత్తరాహులును, 11 వ శతా బ్దమందు సెల్జూకు తురుష్కులును, ప్రాబల్యము వహించిరి, అట్లే 12 వ శతాబ్దమును 13 వ శతాబ్దారంభమును పోపుల ఆధిక్యకాలము అంతకు ముందువెనుకలకంటె అప్పుడు పోపు ప్రాబల్య మధికమైనది.

ఆ శతాబ్దములో సులభము యథార్థము నగు క్రైస్తవమత భావము యూరపునందు విశేష భాగము వ్యాపించెను రోము కూడ కొంతనైచ్యదుర్దశల పాలైనది. 10 వ శతాబ్దపు పోపులను 11, 12 వ వారు జీవితచర్యల నే గ్రంథకర్తయు క్షమింపజాలడు, వారి ప్రవర్తన అసహ్యము కాని లాటిను ప్రపంచపు జనులు వారి హృదయములు విశ్వాసయుతమై, నిరాడంబరములుగ నుండెను మామూలుగు నవులు, సన్యాసులు, సన్యాసినులు సామాన్యముగ విశ్వాసము గలిగి, యోగ్యులైయుండిరి అట్టి ఉత్కృష్టజీవులు కల్గించిన నమ్మకముపైననే, మతాధిపతుల అధికారము నిల్చియుండెను ప్రాచీనపోపులలో గ్రెగరీనిగ్రేటు (మొదటి గ్రెగరీ 590-604) చార్లమను నాహ్వానించి సార్వభౌమునిగ బలవంతముగ పట్టముగట్టిన 3 వ లియో యు (795—816) ప్రసిద్ధులు 11 వ శతాబ్దాంతమున హిల్డిబ్రాండను ఒక గొప్ప రాజ్యాంగవేత్త బయలుదేరి పోపు (7 వ గ్రెగరీ) అయ్యెను (1073-1085) ఆతనితరువాత రెండవవాడు మొదటిక్రైస్తవమత యుద్ధము జరిపి, రెండవ అర్బను (1037—1099) సార్వభౌములపై పోపు అధికారియగు నంతస్థితిని కల్గించిరి బల్గేరియా మొదలు ఐర్లండువరకును, నార్వేనుండి సిసిలీవరకును, పోపులు సర్వాధికారులైరి 4 వ హెన్రీ చక్రవర్తి పశ్చా

త్తప్పుడై హీనవస్త్రుడై మంచులో చెప్పులేక కనోసాలో తనవద్దకు వచ్చి మూడహోరాత్రములు తన కోటముంగిట క్షమార్పణకై పడియుండునట్లు, 7 వ గ్రిగరీ చేయగల్గెను 1176 లో ఫ్రెడరికుచక్రవర్తి (ఫ్రెడరిక్ బార్బరోసా) 3 వ అలెగ్జాండరు (పోపు) కు నమస్కరించి, అతని అధికార మొప్పుకొనెను

11 వ శతాబ్దపు మొదట, మతపీఠపు అధికారము జనుల యిష్టముపైనను ఇంగితజ్ఞానముపైనను ఏర్పడియుండెను, అట్టి ముఖ్యమగు ప్రతిష్ఠను తరువాత పోపులు నిలుపుకొనలేక పోయిరి 14వ శతాబ్దపు ప్రథమదశకములో పోపుఅధికారము హరించిపోయెను ఇట్లు ప్రపంచమందు మతపీఠముపట్ల జనులు నమ్మకలేక దానియాజ్ఞ నుల్లంఘించుటకు కారణమేమి?

పీఠాధిపులు ద్రవ్యసంపాదనజేయుట మొదటి కారణము మతపీఠ మెన్నటికిని నష్టముకాదని, నిస్సంతతిగ పోవువారు తమఆస్తుల మతపీఠమున కిచ్చివేయుచుండిరి పశ్చాత్తప్తులగు పాపు లట్లొనర్ప ప్రోత్సహింపబడిరి ఆస్తిఅధికమయినకొలదిని, ఆస్తిసంపాదనయందాశ అధికమగును 13 వ శతాబ్దమునాటికే మతాధిపతులు మంచివారుగాక, ఎల్లప్పుడు ధనము ఆస్తికొరకు వెదకువారను అపవాద మొదలిడెను

ఆస్తి యిట్లు పరాధీనమగుటకు రాజు లిష్టపడరైరి. సైనికసహాయముచేయగల భూస్వాములు సామంతులు తమ ప్రభువులకుబదులు తమమఠాధిపులను సన్యాసిపీఠములను పోషించుచుండిరి ఈఆస్తులన్నియు నిజముగా పరాయిఅధికారముక్రిందజేరెను 7 వ గ్రిగరీకిపూర్వమునుండియే, బిషప్పుల నియమించు అధికారముకై పోపునకు రాజుకు తగవు జరుగుచుండెను ఆహక్కు పోపుదై రాజుకు లేకున్నచో, ప్రజలయంతరంగమును రాజ్యములో కొంతయాస్తియు రాజవశమునుండి తప్పును, మతపీఠమువారు రాజుకు పన్నులు చెల్లించుటలేదు, తమపన్నులన్నియు రోముకే చెల్లించుచుండిరి ఇంతేకాక సామాన్యప్రజల ఆస్తిపై గూడ రాజులు విధించుపన్నుల కదనముగా 10వ వంతు పన్ను విధించుహక్కు తమకు గలదనిగూడ పీఠాధిపతు లనుచుండిరి

11 వ శతాబ్దమున లాటినుప్రాంతపు ప్రతిదేశచరిత్రలోను మతోద్యోగుల నేర్పరుచుహక్కుకై పోపుకు రాజుకు తగవులుకలిగి, అందు సాధారణముగ పోపు జయమొందుచుండెను రాజును వెలివేయుటకు, అతనిప్రజల నతని యధికారమునుండి తప్పించుటకును, అతనివారసును నియమించుటకును, తనకు హక్కుగలదని పోపు అనుచుండెను, జాతియంతటిపై ఆంక్ష విధించియు, జాతకర్మ తపస్సుతప్ప మిగి

లిన విధులన్నియు జనులకు నిరాకరించియు, తన యధికారము చలాయించెను. మతగురువులు వివాహములు జరిపించుటకును, నిత్యకృత్యములను అంత్యకర్మల జరిగించుటకును, వీలులేకుండెను. ఈ రెండు అస్త్రములతో, తమకు మిక్కిలి వ్యతిరేకులగు రాజులను అతివిముఖులగు ప్రజలను 12 వ శతాబ్దపు పోపులు లొంగదీయగల్గిరి. కాని ఈమహాధికారము కొన్ని అత్యవసరములకే ఉపయోగింపదగియుండెను. తరువాతవచ్చిన పోపులు వానిని సర్వసాధారణముగ నుపయోగించిరి. 12 వ శతాబ్దాంతమున 30 ఏండ్లలో ఇంగ్లండు స్కాట్లండు ఫ్రాంసులపై వరుసగా ఆంక్ష వేయబడినది. పోపులు తమ కెదురుతిరిగిన క్రైస్తవరాజులపై గూడ మతయుద్ధముల లేపుటకు వెనుదీయరైరి, జనులలో యుద్ధోత్సాహము నశించెను. పోపు ఆయనఅనుచరులు రాజులతో మాత్రము కలహించి, సామాన్యజనుల రంజనజేసినచో, క్రైస్తవప్రపంచముపై నాయధికారము నిల్చియుండెడిది. కాని యీ విశేషాధికారమున మతాధిపతుల గర్వముహెచ్చినది. 11 వ శతాబ్దికి పూర్వపు రోమనుమతగురువులు వివాహితులై, తమ తోడిప్రజలకు సన్నిహితులై, ప్రజలలో గలసియుండిరి. ఏడవగ్రిగరీ వారల శాశ్వతబ్రహ్మచారులుగ జేసెను. మతగురువులకు సామాన్యులతో బాంధవ్యము

లేకుండ త్రెంపివేసి, రోముతో ఎక్కువసంబంధము కలుప దలచెను కాని అందుచే మతపీఠముకు సామాన్యజనులకు మధ్య నొకమహావిభేద మేర్పడెను మతపీఠమునకు స్వంత న్యాయస్థానములుండెను మతగురువుల వ్యాజ్యములే కాక, సన్యాసులు, విద్యార్థులు, మతయుద్ధసైనికులు, విధవలు, అనాథులు, మరణశాసనములు, వివాహములు, మతద్రోహము మున్నగు విషయములన్నిటిని పరిష్కరించుటకు మతాధిపుల న్యాయసానముకే హక్కుండెను మతగురువుకు సామాన్యనకు తగువువచ్చిన, దానికి మతన్యాయస్థానములందే తీర్పు కావలె కాని యుద్ధము శాంతి నిలుపుట మొదలగు భారమంతయు రాజుదే అందుచే క్రైస్తవులందరిలోను మతగురువులపై ఈర్ష్య అసహ్యబుద్ధి వ్యాపించెను

తన శక్తి సామాన్యుల సద్భావముపై నిల్చియున్న దని పోపు గ్రహించక, ప్రజల మతోత్సాహముకు వ్యతిరేకుడై, స్వతంత్రభావము గలవారిపై బలవంతముగ పూర్వాచార సిద్ధాంతముల నతడు జొప్పించెను నీతి రక్షణకై పీఠాధిపతులు కల్పించుకొన్నపుడు జనులు సహాయపడిరి, కాని భావముల జొప్పించుచో మాత్రము లేదు దక్షిణ ఫ్రాంసులో 'వాల్డో' మత జీవనములందు క్రీస్తుకాలపు శుద్ధ నిరాడంబరత్వముకు మరలవలెనని బోధింపగా, వాల్డోపైన

అతని అనుచరులపైనను, పోపు 'ఆ వ ఇన్నోసెంటు' మత యుద్ధము ప్రకటించి, వారిని అగ్నిఖడ్గమానభంగములచే దుర్భర దురంతముల పాలుగావించి అణగద్రొక్కెను, అయి లనే అస్సిసీలోని 'సెంటు ప్రాన్సిసు (1181-1226) క్రస్తు జీవితమును బీదరికమును సేవను అనుకరింపవలెనని బోధింప, అతని అనుచరులగు ప్రాన్సిస్కనుల హింసించి అనేక బాధల బెట్టి ఖైదుచేసి, చెదరగొట్టెను, మార్సీల్సులో 1318 లో వారిలో నల్గురు జీవములతో తగులపెట్టబడిరి తీవ్ర పూర్వా చార పరాయణులగు సెంటుడామినికనులచే స్థాపింపబడిన సంస్థకు మాత్రము 3 వ ఇన్నోసెంటు అత్యధిక సహాయము చేసి, వారి సహాయముతో స్వమతద్రోహులను స్వతంత్ర భావులను శిక్షించుటకు, 'ఇంక్విజిషన్' అను నొక క్రూర న్యాయస్థానము స్థాపించెను

ఇట్లు అధికారదురాశ, అన్యాయాధికారము, అన ర్థకాసహనము, వీటిచే మతాధికారులు సామాన్య ప్రజల విశాలవిశ్వాసము గోల్పోయిరి దాని క్షీణతకు తమ అంత రంగలోపమే కారణము, కాని బాహ్యవిరోధులు కారు

---

## 47 వ్యతిరేకప్రభువులు, మతవిభేదము

క్రైస్తవలోకాధిపత్యముకై రోమను మతసంస్థవా రనేకప్రయత్నముల జేసిరి అందు పోపు ఎన్నికవిధానము లోపభూయిష్ఠమై యుండెను

పోపు సంస్థ క్రైస్తవప్రపంచమంతట శాంతిని ఒకే పాలనను నెలకొల్పి తన యాశనీడేర్పదలచుచో, దృఢమగు నిరంతర నాయకత్వమవసరము పోపులు పడుచువారై, సమర్థులై, తమస్థానీయుల నేర్పరచ్చుచు, వారితో మతవిషయముల జర్చింపవలెను ఎన్నికపద్ధతులు స్పష్టమై, స్థిరమై, నిరాక్షేపణలై, యుండవలెను, కాని, అట్లేమియుజరుగలేదు, పోపును ఎవరెన్నుకొనవచ్చునను విషయము, "బైజంటైన్" పవిత్ర రోమకచక్రవర్తులకు ప్రమేయము కలదో లేదో కూడ, నిర్ధారణకాలేదు పోపులలో సమర్థుడగు హిల్డిబ్రాండు (ఏడవ గ్రిగరీ 1073-1085) ఎన్నికలకు క్రమపద్ధతి నేర్పరచుటకు చాలయత్నించెను, ఆయెన్నికహక్కును ఉన్నతరోమను గురువులగు కార్డినలులకు మాత్రమే యేర్పరచి, కేవలమంగీకారమును చక్రవర్తి (మతపీఠపు సమ్మతిపైన, ఇచ్చునట్లే ర్పఱ్చెను కాని పోపు తనస్థానీయుని ముందుగా నియమించుటలేదు, ఆపద్ధతి లేకుండెను, అందుకై, (పోపుపోగనే) గురు

వులు కల్పించుచుండిరి, ఈలోగా ఆ స్థానము ఖాళీగా నుండెను ఒకప్పుడు ఒకటి రెండేండ్లవరకు నది ఖాళీగా నుండెను ఇట్లు పోపులస్థితిలో స్థిరనిర్ణయము లేకుండుటవలని ఫలితము 16 వ శతాబ్దమువరకు చూడనగును మొదటి నుండియు, ఎన్నికలవిషయమై తగాయిదాలు కలిగి, ఎవరికి వారిద్దరుముగ్గురు తామే పోపులమని ప్రకటించుకొనుచుండిరి అట్టి తగాయిదా పరిష్కరించుటకై, మత సంస్థలు రాజు నొద్దకో మరియొకరివద్దకో పోవలసివచ్చెను గొప్ప పోపుల జీవితమును సంశయాస్పదముగనే అంతమందెను వారి తరు వాత మతసంస్థకు తగు నాయకుడు లేక శక్తిహీనము కావ చ్చును, లేక ఆ ప్రత్యర్థి తన్ను త్రోసివేసి, ఆ చర్యలన్నిటిని తారుమారొనర్పవచ్చును, లేక చావుకు సిద్ధమైన ముదుసలి పోపై, తన్ననుసరింపవచ్చును వెంటనే ఖాళీవచ్చుచుండును

పోపుసంస్థలో నిట్టి లోపముండుటచే, జర్మనీరాజులు ఫ్రాంసురాజు, ఇంగ్లండులో పాలించిన నార్మను, ఫ్రెంచి రాజులు, తమకిష్టుడే రోములో పోపు అగుటకు తమ తమ పలుకుబడి నుపయోగించుచుండిరి యూరపియను విష యములలో పోపు హోదా ముఖ్యమైనదగుటవలనను, ఇట్లు కల్పించుకొనుట సహజమే అందుచే పోపులలో చాల మంది అశక్తదుర్జనులైరి, కాని, కొందరు కడుసమర్థులు ధైర్య

శీలురు నుండిరి 38 ఏండ్లవయస్సుకు పూర్వమే పోపుఅయిన 3 వ ఇన్నొసెంటు (1198—1216) చాలసమర్థుడు ఆయ నయు అనంతరపుపోపును అంతకన్న గొప్పవ్యక్తి అద్భుత స్వభావుడు నగు 2 వ ఫ్రెడరికు చక్రవర్తితో తగవులందు చిక్కుకొనిరి, ఈ తగవుచే, చరిత్రలో నూతనయుగము కల్గె న. తుదకు పోపు రాజునోడించి, అతనివంశము కూడ నిర్మూ లించెను, కాని ఆసంఘర్షపు దెబ్బచే పోపు సంస్థగౌరవము నిర్మూలమయ్యెను

ఫ్రెడరికు 6 వ హెన్రీరాజుకొడుకు, అతనితల్లి సిసిలీ యందలి నార్మనురాజగు మొదటిరోజరుకుమార్తె నాలు గేండ్ల వయస్సున 1198 లో నతడు రాజయ్యెను, 3వ ఇన్నొ సెంటు అతనికి సంరక్షకుడయ్యెను అప్పటికి సిసిలీ నార్మ నులపాలబడి చాలకాలముకాలేదు రాజాస్థాన మింకను ప్రాచ్యపద్ధతులపైనుండి, విశేషవిద్వాంసులగు అరబ్బులతో నిండియుండెను వీరిలో కొంద రీచిన్నరాజుకు బోధకులై, శ్రమపడి తమభావము లాతనికి నేర్పిరి ఆ రాజాద్వంద్వ బోధచే క్రైస్తవమతముగురించి ముస్లిము అభిప్రాయము, ఇస్లామునుగూర్చి క్రైస్తవాభిప్రాయమునొంది, అన్నిమత ములు ద్రోహాకరములే యని విచిత్రాభిప్రాయుడై, అట్లు స్పష్టముగ తెలుపుచుండెను, అతని మతనింద గ్రంథస్థమైనది.

పోపు తనశిష్యుడగు ఫ్రెడరికు పెరిగి రాజైనప్పుడు అతనిని కొన్నిషరతుల గోరెను, జర్మనీలోని మతద్రోహ మణచివేయ వాగ్దానముజేయవలె, సిసిలీ దక్షిణ ఇటలీలలో తన రాజ్యాధికారము వదలుకొనవలె, (లేకున్న పోపుకన్న నతడు ప్రబలుడగును) జర్మనుమతాచార్యులకు పన్నులుండ రాదు. ఫ్రెడరి కందుకంగీకరించెను. కాని అట్లు అమలు జరుపు నుద్దేశములేదు అతడు తనసంరక్షకునికి వ్యతిరేకు డయ్యెను ఇంతకముందే పోపు ఫ్రెంచిరాజును అతని ప్రజ లగు వాల్డెన్సులపై ఘోరమతయుద్ధముకు పురికొల్పెను, జర్మనీలో ఫ్రెడరికుకూడ అట్లే చేయవలెనని పోపు కోరెను. పోపు ఆగ్రహముకు పాత్రులైన భక్తులకన్న, పోపే యెక్కు వ ధర్మద్వేషియని ఫ్రెడరికు భావము, అతడు మతయుద్ధ ముల దలపెట్టలేదు ముసల్మానులపై దాడివెడలి, జెరూ సలెము రక్షింపుమని పోపు కోరగా, ఫ్రెడరికు అట్లేయనెను, కాని దానిని నెరవేర్పలేదు

చక్రవర్తియైన తరువాత, 2 వ ఫ్రెడరికు జర్మనీలో నుండక సిసిలీలోనే ఉండిపోయెను, పోపుకు తానుచేసిన వాగ్దానముల చెల్లింపడాయెను 3 వ ఇనొసెంటు విభ్రాం తుడై, 1216 లో మరణించెను

ఇన్నోసెంటు తరువాత పోపైన 3 వ హానోరియసు ఫ్రెడరికు నేమియు జేయులేకపోయెను 1227 లో పోపు అయిన 9వ గ్రిగరీ, ఈయువకు నెట్లైన సాధింప నిశ్చయించి, అతనిపై నాంక్షవిధించెను 2 వ ఫ్రెడరికుకు మతసముపాయ ములు లేకుండజేసెను కాని ఆరబుమిశ్రితమగు సిసిలీఆస్థా నములో, ఇదియేమియు పనిచేయలేదు చక్రవర్తి కున్న నిస్సం దేహాలోపములను మతద్రోహాచర్యలను చెప్పనడతను పేర్కొ నుచు, పోపాక బహిరంగలేఖనంపెను దీనికి ఫ్రెడరికు తీవ్ర ప్రత్యుత్తర మిచ్చెను, దానిని యూరపురాజులందరకు పంపి, అందు పోపుకు రాజుకు గల సమస్యను స్పష్టముగ ఆమూ లము వివరించెను, యూరపు కంతకు నిరంకుశ ప్రభువగుటకు పోపు యత్నించెనని చూపి, రాజులందరేకమై తమహక్కుల రక్షించుకొనవలెనని సూచించెను, మతపీఠపు ఆస్తిసంపత్తుల వంక రాజుల ప్రత్యేకదృష్టి నాకర్షించెను

ఈయాగ్నేయాస్త్రము ప్రయోగించి, ఫ్రెడరికు పం ద్రెండేండ్లనాటి తనవాగ్దానము చెల్లించుట కనుమిషతో ఒక 'మతయుద్ధ' మారంభించెను. ఇది 6వ క్రైస్తవమతయుద్ధము (1228) మతయుద్ధదృష్టిలో నిదియొక ప్రహసనము, 2 వ ఫ్రెడరికు ఈజప్టులో సుల్తానును గలుసుకొని సామరస్యముతో సంగతుల జర్చించెను, ఇరువురును స్వమతాభిమానము లేః

వారే, ఆలోచించి వ్యాపారదృష్టితో ఉభయులకు లాభకర మగు సంధి జేసికొనిరి, ఆప్రకారము జెరూసలెము ఫ్రెడరికు వశమయ్యెను ఇది సంధిరూపమగు విచిత్రమతయుద్ధము ఇందు రక్తము చిందుటగాని, ఆనందబాష్పములుగాని, లేవు ఈయద్భుత మతవీరుడు భ్రష్టుడని మతాధికారులు వెలివేసిరి కనుక ఆక్షేత్రమున కిరీటము నతడుస్వహస్తముతోనే గ్రహించి, జెరూసలెంరాజై, సామాన్యపట్టాభిషేకమే చేసుకొనెను. అటనుండి యతడటలీ చేరి, ఈలోగా తనరాజ్యము నాక్రమించిన పోపుసైన్యమును మర్దించి తరిమి, పోపువిధించిన ఆంక్షను అతనిచే నిర్బంధముగ రద్దుచేయించెను 13 వ శతాబ్దమున చక్రవర్తి పోపుయెడ నిట్లువర్తించినను, ఆరాజుపై ప్రజల కాగ్రహము కలుగలేదు, ఆదినములు గతించెను

1239 లో, 9 వ గ్రిగరీ మరల చక్రవర్తితో తగవును మొదలిడి, రెండవమారతనిని బహిష్కరించి, ఇదివరలో పోపుకు కళంకమిచ్చిన దూషణయుద్ధమును పెంచెను 9 వ గ్రిగరీ అనంతరము, 4 వ ఇన్నొసెంటు పోపైనపుడు తగవు మరల వచ్చెను ఫ్రెడరికు మతసంస్థల నిరసించుచు జనులందరకు జ్ఞప్తిలోనుండునట్లింకొక లేఖనువ్రాసెను, మతాధిపులగర్వమును దుష్ప్రవర్తనను పేర్కొని, అప్పటి అవినీతి కంతకును వారి ధనగర్వములే కారణములని వ్రాసెను:

మతసంస్థ బాగుపడుటకే, మతాధిపుల ఆస్తిసంతను లాగుకొ నవలెనని తోడిరాజులకు సూచించెను. ఈవిషయము యూరపురాజుల హృదయముల నాటుకొనెను

ఆతని తుదివత్సరముల గురించి చెప్పబోము ఆతని వ్యక్తివిషయములకన్న, ఆజీవితముచే గలిగిన వాతావరణమే ముఖ్యము సిసిలీలో అతని ఆస్థానకథ కొంతవరకు తెలియును అతడు సౌందర్యోపాసి, భోగి, జారుడనిగూడ వర్ణింపబడెను అతడన్ని విషయములు స్వయముగా చర్చించి తెలుసుకొన యత్నించెను, తన ఆస్థానముకు ముస్లిము క్రైస్తవతత్వజ్ఞుల రప్పించి, ఇటాలియనులకు తురుష్కుల సిద్ధాంతవిజ్ఞానముల బోధింపజేసెను అరబికు అంకెలు బీజగణితము క్రైస్తవవిద్యార్థుల కతనిమూలముననే బోధింపబడెను. అతనిఆస్థాన విద్వాంసులలో నొకడగు 'మైకేలుస్కాటు' అరిస్టాటిలు గ్రంథపుకొన్ని భాగములను, గొప్ప అరబ్బుపండితుడగు 'ఎవరోసు' వ్రాసిన టీకసహితముగ, తర్జుమాచేసెను. ఫ్రెడరికు 1224 లో నేపిల్సు విశ్వవిద్యాలయమును స్థాపించి, సెలరినో విశ్వవిద్యాలయమందలి గొప్ప వైద్యకళాశాలనభివృద్ధిపరచెను, జంతుప్రదర్శన శాలనుగూడ స్థాపించెను డేగలవేటనుగూర్చి యాతడువ్రాసిన గ్రంథమునుబట్టి అతడు పక్షిహృదయజుడని కన్పడును అతడిటాలియనులో పద్యము

ల్ప్రాసెను ఇటాలియను పద్యరచన అతని యాస్థానమందే ఆరంభించెను ఒకసుప్రసిద్ధగ్రంథకారుడాతని "మొదటిఆధునికుడు" అనెను ఇందాతని నిష్పక్షపాత విద్యాభిమానము సూచితము

అంతట పోపులు బలీయులగు ఫ్రెంచి రాజులతో కలహించిరి అందుతో పోపుల అధికారశేషముగూడ నశింపజొచ్చెను 2 వ ఫ్రెడరిక పోగానే, జర్మనీ చీలికలైవిడిపోయెను ఇంతకు పూర్వము హోహెన్ స్టాఫెను చక్రవర్తులకుండినస్థానమును ఫ్రెంచిరాజాక్రమించి, పోపులకు రక్షకుడు సహాయకుడు ప్రత్యర్థి అయ్యెను పోపులనేకులు వరుసగ ఫ్రెంచిరాజులకు సహాయులైరి రోమసహాయమున ఫ్రెంచి రాజులు నేపిల్సు సిసిలీ రాజ్యముల పాలించిరి, తిరుగ చార్లమను నాటిసామ్రాజ్యము నుద్ధరించి పాలించుట కవకాశములుగలిగెను ఫ్రెడరిక తరువాత హోహెన్ స్టాఫెను వంశ మంత మొందెను 1273 లో హాబ్సుబర్గులోని రొడాల్ఫును ప్రథమ హాబ్సుబర్గు చక్రవర్తిగ నెన్నుకొనిరి అప్పటినుండియు పోపులు తమ స్వప్రత్యేకాభిరుచులబట్టి ఒకరు ప్రాంసుకును, మరొకరు జర్మనీకిని, సహాయమొనర్చుచుండిరి ప్రాచ్యదిశను 1261 లో గ్రీకులు మరల కాన్స్టాంటినోపిలును లాటినులనుండి జయించిరి ఈనూతన

గ్రీకు రాజవంశపు మూలపురుషుడగు 'మైకేలు పేలియో లోగస్' అను 8 వ మైకేలు పోపుతో సంధియొనర్చునట్లు కొంతనటించి, తుదకు రోమనుమతపీఠమునుండి విడిపోయెను. ఇందువలనను, ఆసియాలోలాటినురాజ్యముల అంతముతోను, ప్రాగ్దిశను పోపుల ఆధిక్య మంతరించెను

1294 లో, 8 వ 'బోనిఫేసు' పోపు పదవికి వచ్చెను అతడు ఇటలీవాసి, ఫ్రెంచివారి విరోధి, రోమక సంప్రదాయాదర్శములం దభిమానియై, తీవ్రముగ వర్తింపమొదలిడెను. 1300 లో అతడొకవర్ధంతి జరుపగా, రోములో చాలమంది యాత్రికుల బృందములుచేరెను "సెంటుపీటరు" సమాధియొద్దకు తేబడు బహూకృతిద్రవ్యములు గ్రహించుట కిరువురకును తీరికలేకుండెను. (జి హెచ్ రాబిన్సను) కాని యీయుత్సవము ఆభాసమాయెను 1302 లో నితడు ఫ్రెంచిరాజుతో కలహించి, 1303 లో ఆరాజుపై ఆంక్షవిధింప నుండగా, "అనగ్ని"లో తనపూర్వికుల మందిరములోనే గిల్లామ్‌డీ నోగరెట్ అనువాడతని హఠాత్తుగా బంధించెను, ఫ్రెంచిరాజు పంపిన ఆ చారుడు మందిరములోనికి జొరబడి వచ్చి, భయభ్రాంతుడై చేత శిలువబూని శయ్యాగతుడైన పోపును బెదరించి, అవమానపరచెను, ఒకటిరెండు దినములలో నా నగరవాసులచే విడిపింపబడి పోపు రోముకు వెడలి

పోయెను, కాని అక్కడ తిరుగ ఓర్సినీకుటుంబికులచే బంధితుడై, కొన్నిదినములలో నిర్వీణ్ణుడై, ఆవృద్ధుడు మరణించెను

"అనగ్ని" ప్రజలు మొదటిదౌర్జన్యము గర్హించి, బోనిఫేసును విడిపించుటకు నోగరెట్టుపై కత్తిగట్టిరి అప్పటికి "అనగ్ని" పోపు స్వగ్రామము ఈసందర్భమున క్రైస్తవ జగద్గురునెడ నీదౌర్జన్యము జరుపుచు, ఫ్రెంచిరాజు ఫ్రాన్సులోని ప్రభువులు మతసంస్థలు సామాన్యజనులు ఈ మూడు సంస్థల సమావేశముచేసి, వారి యంగీకారము బడసెను ఫ్రాంసులోను ఇటలీలోను పోపుపై జరిపిన యీయత్యాచారమునెడ యిసుమంతేనియు క్రోధసూచనలు కలుగలేదు. క్రైస్తవపీఠాధికారము దుర్బలమయ్యెను, ప్రజాహృదయములపై దానిప్రభావము నశించెను

14 వ శతాబ్దమందంతటను పోపులు తమ గౌరవమును తిరుగ సంపాదింపలేదు తరువాత ఎన్నుకొనబడిన పోపు 5 వ క్లెమెంటు ఫ్రెంచిరాజగు ఫిలిప్‌చే కోరుకొనబడెను, ఆత డెన్నడును రోముకురాలేదు, తనఆస్థానమును ఫ్రాంసుదేశమున పోపుస్వామ్యములోని 'అవిగ్నను'పురిలో నేర్పరచెను, 1377 వరకు అతనితరువాతవా రందరక్కడనే వసించిరి అసాలున పోపు (11 వ గ్రిగరీ) రోములోని 'వాటి

కను' మహాలుగోనికి వెడలెను కాని 11 వ గ్రిగరీ మతసంస్థ లన్నిటి యంగీకారము బొందలేదు ఉన్నతమతగురువు లనేకులు ఫ్రెంచివారగుటచే, వారియభ్యాసనహవాసము 'అవిగ్నను'లో లగ్నమై యుండెను 1378లో గ్రిగరీ మరణించినపుడు, ఇటలీవాడగు 6వ అర్బను పోపుగా నెన్నుకొనబడెను, ఈవ్యతిరేకగురువులు ఆయెన్నిక చెల్లదనిచాటి, 7 వ క్లిమెంటును పోటీపోపుగా నెన్నుకొనిరి ఈచీలికయే 'మహావిభేద' మయ్యెను పోపులు రోములో నుండిరి ఫ్రెంచి ద్వేషులగు చక్రవర్తి ఇంగ్లండురాజు హంగరీపోలండు ఉత్తరయూరపు రాజులు నాతని భక్తులైరి ప్రత్యర్థిపోపులు 'అవిగ్నను'లో వసించుచు, ఫ్రెంచిరాజు అతనిమిత్రులగు స్కాట్లండు స్పెయిను పోర్చుగలు రాజులు, అనేకజర్మను రాజన్యులు, వీరి సహాయమును బొందుచుండిరి ప్రతిపోపును తన ప్రత్యర్థినను సరించెడివారిని బహిష్కరించుచుండెను (1378-1417) ఈ కల్లోలముచే యూరపు అంతటను మతవిషయములగురించి ప్రజలు స్వతంత్రాలోచన పరులయిరి

వెనుకటి అధ్యాయమున మనముచూచిన ఫ్రాన్సిస్కను డామినికనులేగాక, మతసంస్థను వీలువెంబడిని సంస్కరించుటకో, లేక ధ్వంసమొనర్చుటకో, క్రైస్తవలోకమున అనేక నూతనోద్యమములు బయలుదేరెను మొదటి వానిపై గొంతదాక్షిణ్య ముపయోగించినను, ఆరెంటిని మతవీరము

వారు తమలోనికి స్వీకరించి యుపయోగించుకొనిరి కాని ఈక్రొత్తఉద్యమములు ప్రత్యక్షముగ వ్యతిరేకించి ఖండించు చుండెను 14వ శతాబ్దము తరువాత 'విక్లిఫ్' (1320-1384) బయలుదేరెను అతడొక గొప్ప ఆక్స్ఫర్డు విద్వాంసుడు, పెద్దవాడైన తరువాత, అతడు మతగురువుల అవినీతివర్తన మును పీఠాధిపుల యజ్ఞానమును చాలసార్లు బహిరంగముగ ఖండించెను తనఅభిప్రాయముల వెల్లడించుటకు 'విక్లిఫైట్ల'ను బీదమతప్రచారకుల సంఘము నేర్పరిచెను తనకును మతపీఠ ముకునుగల సమస్యల ప్రజలెరుంగుటకై బైబిలునాంగ్లములోని కనువదించెను ఈతడు సెంటుఫ్రాన్సిసు సెంటుడామినుకుల కంటె విశేషవిద్యావంతుడు అధికసమర్థుడు, పెద్దలనేకులాత నికిసాయము జేసిరి చాలమంది జనులాతని కనుచరులైరి పోపు అతనిపై కినుకవహించి, ఖైదుచేయ నాజ్ఞాపించెను కాని, అతడు జీవితాంతమువరకు పూర్ణస్వేచ్ఛతో నేయుండెను కాతలికుమతపీఠమువారు మూర్ఖులై, తరువాత నతని శల్య ముల నాసమాధిలో నుండనీయలేదు 1415 లో కాన్స్టె న్సుసభవారి తీర్పుప్రకారము, 1428 లో 5 వ మార్టిను (పోపు) 'ఫ్లెమింగ్' అను బిషపుద్వారా సమాధినుండి విక్లిఫు అస్థుల త్రవ్వి యెత్తించి, తగులబెట్టించెను ఈ దుశ్చ ర్యను తుంటరివ్యక్తులు కాక, మతపీఠమువారే అధికార రీత్యా జరిగించిరి

---

13 వ శతాబ్దమున యూరపులో పోపు తన ఆధిపత్యమున క్రైస్తవలోకము నేకముచేయ యత్నించి, విఫలుడయ్యెను ఈలోగా నంతకన్న విశాల రంగమగు ఆసియాలో చాల ముఖ్యవిషయములు జరుగుచుండెను చీనాకుత్తరదేశమందలి మంగోలులను తార్తారు జాతీయులు హఠాత్తున జగత్కథలో ప్రముఖులై, వరుసగా నిరుపమాన జయముల బొందుచుండిరి తమ పూర్వులగు హూణుల వలె అశ్వికులై, వీరు 13 వ శతాబ్దపు మొదట సంచారశీలురై మాంసము గుఱ్ఱపుపాలు భుజించుచు, కంబళ్ల గుడారములలో నివసించుచుండిరి చీనా రాజుల అధికారము నుండి స్వతంత్రులై, వారు ఇతరతురుష్కుల నొక యోధసంస్థగా కూడదీసిరి వీరి కేంద్రము సైబీరియాలోని ఓనాన్ నదీతీరము.

ఈ సమయమున చీనా విభిన్నమై యుండెను 'టాంగు' వారి వంశము 10 వ శతాబ్దమునాటికి క్షీణించెను, దేశము చిన్నరాజ్యములై, అంత కలహము లేర్పడ, అంకు మూడు ముఖ్య సామ్రాజ్యములు నిలిచెను ఉత్తరమున పెకిన్ రాజధానిగాగల 'కిన్'ల సామ్రాజ్యము, దక్షిణా



1227 లో చెంగిజ్‌ఖాను సామ్రాజ్యము

మున నాన్కిన్ముఖ్యపట్టణముగాగల సంగ్సామ్రాజ్యము, మధ్యభాగమున హిసియాసామ్రాజ్యము నుండెను 1214 లో మంగోలు నాయకుడగు చెంగిజ్ఖాను 'కిన్' సామ్రాజ్యముపై యుద్ధముచేసి, పెకినును పట్టుకొనెను, అటనుండి పశ్చిమమున కరిగి, పశ్చిమతుర్కిస్థానము పర్షియా ఆర్మేనియాలకు ఇండియాలో లాహోరువరకు, హంగరీ సైలీషియాలవరకును, దక్షిణ రష్యాను, జయించెను పసిఫిక్ మహాసముద్రమునుండి 'నీపరు' నదివరకు వ్యాపించిన ఈ విశాల సామ్రాజ్యపు ప్రభువై, అతడు మరణించెను

అతని తరువాతవాడగు 'ఒగ్దైఖాను' మంగోలియాలోని 'కారకోరము'లో స్థిరరాజధానిని నిర్మించి, అద్భుత జైత్రయాత్ర సాగించెను ఆతని సైన్యములును చాల నిపుణముగ తయారైనవి చీనావారు కనిపెట్టిన తుపాకిమందును సంపాదించి, వారు చిన్న తుపాకుల నుపయోగించిరి 'కిన్' సామ్రాజ్యమును పూర్తిగా జయించి 1235 లో ఆసియా నుండి రష్యావరకు అడ్డముగా అద్భుతముగ వ్యాపించిరి, 1240 లో కీఫ్ నిర్మూలింపబడెను, రమారమి రష్యాఅంతయు మంగోలుల అధీనమయ్యెను పోలండు ధ్వంసము గావింపబడి, పోలులు జర్మనులు గలిసిన ఒక సైన్యము దక్షిణ సైలీషి

యాలో లీగ్నిజ్' వద్ద 1241 లో సర్వనాశ మొనర్పబడెను అంతకంతకు వెల్లివిరియు సీవాహిని నరికట్టుటకు ఫ్రెడరికు విశేషయత్నము లొనరించినట్లు కన్పింపదు

గిబ్బను రచించిన "రోమక సామ్రాజ్యపు క్షీణత, పతనము" అను గ్రంధపుటీకలో బ్యూరిగారిట్లు వ్రాసిరి. 1241 లో, మంగోలులు పోలండును జయించి, హంగరీ నాక్రమించుటకు కేవల సంఖ్యాబలమేగాక, అత్యద్భుతమగు యుద్ధచాతుర్యమే కారణమని, ఇటీవలనే యూరపియను చారిత్రకులు గ్రహించిరి, కాని యీ విషయమింకను అందరికిని తెలియదు తార్తారులు విజ్ఞానము వ్యూహనైపుణ్యము లేని మోటు గుంపులవారనియు, సంఖ్యాబలముననే తూర్పు యూరపునంతను జయించి అడ్డువచ్చినవానినెల్ల ధ్వంసమొనర్చుచు తిరిగిరనియు పామరులింకను పొరబడుచున్నారు.

(మధ్యయూరపులోని) దక్షిణ విశ్చులానది మొదలు ట్రాన్సిల్వేనియావరకు విజయకార్యక్రమ మంతయు అంత కట్టుదిట్టముగను జయప్రదముగను జేయుట అద్భుతము ఆ జైత్రయాత్ర అప్పటి యూరపుసేనలకు అసాధ్యము, యూరపుసేనానుల కగ్రాహ్యము, 'సుబూటై'ను బోలు సేనాని 2 వ ఫ్రెడరికు మొదలు ఒక్కడైన యూరపులో లేడు;

మంగోలులు హంగరీ పోలండుల రాజకీయ పరిస్థితుల పూర్తిగ గ్రహించి, ఆయూత్రకు గడంగిరి ఆ దేశస్థితిగతుల గూఢచారులద్వారా సరిగా దెలుసుకొనుచుండిరి హంగరీ వారు మున్నగు క్రైస్తవసేనలు మోటుజాతి బాలిశులతో సములైరి, తమవిరోధులగు మంగోలుల ప్రజాశక్తుల గురించి యేమియు గ్రహింపరైరి గ్నిజ్‌వద్ద మంగోలులు విజయ మందినను, ఇంకను పశ్చిమమునకు పోరలేదు అచ్చటి కొండలు అడవులు తమ వ్యూహపద్ధతులకు సరిపడవు, కనుక వారటనుండి దక్షిణాభిముఖులై, 'సిథియను' 'అవారు' హూణాది మిశ్రితజాతుల నంతకుపూర్వము మాగ్యార్లు నాశమొనర్చినట్లే, సజాతీయులగు ఆమాగ్యరుల చంపియో, లేక తమలో కలుపుకొనియో, హంగరీలో స్థిరవాసముజేయ యత్నించిరి, అంతకుముందు హంగేరియనులవలెనే, వీరును అటనుండి దక్షిణపశ్చిమముగ దాడి వెడలియుందురు, ఈ లోగా ఒగ్డయిఖాను హఠాత్తుగ మరణించెను 1242 లో సింహాసనముకై కొంతతగవురాగా, హంగరీ రుమేనియాల గుండ అపరాజితులగు మంగోలు లటనుండి తూర్పుకు తిరిగి పోయిరి

తరువాత మంగోలులు తమదృష్టిని ఆసియాకు మరల్చిరి. 13 వ శతాబ్దపుమధ్యకు వారు 'సంగ్' సామ్రాజ్య

ము జయించిరి 1251 లో ఒగ్డైఖాను తరువాత మంగూ ఖాను నాయకుడై, తనసోదరుడగు 'కుబ్లైఖాను'ను చీనా గవర్నరుగ నియమించెను, 1280 లో కుబ్లైఖాను చీనాచక్రవర్తియై, 'యువాను' వంశము స్థాపించెను, అది 1368 వరకు పాలించెను ఇట్లు చీనాలో సంగ్రప్రభుత్వ్యపు భిన్నదేశములు సంతరించెను, మంగుకు మరియొకసోదరుడగు 'హులాగు' పర్షియాసిరియాల జయించెను మంగోలులప్పుడు ఇస్లాముకు విరోధులైరి, బగ్దాదునగరము పట్టుకొనినపుడా పౌరులవధించి, ప్రాచీనసుమేరియా కాలమునుండి మెసపొటేమియా సుర్వరగ సమృద్ధజనముగ నుంచిన అతిప్రాచీనమగు జలాశయములను ధ్వంసమొనర్చిరి ఆనాటినుండి మెసపొటేమియా శిథిలముల యెడారియై, ఏదోకొలదిమందికే జీవనాధారమైనది మంగోలు లీజిప్టులో గొరలేదు 1260 లో హులాగుసైన్యము నొకదానిని పాలస్టైనులో ఈజిప్టుసుల్తాను పూర్తిగ నోడించెను

అంతట మంగోలువాహిని వెనుకబడెను ఆ ఖాను సామ్రాజ్యము చిన్నచిన్న సంస్థానములుగా విడెను చీనావారివలెనే, తూర్పుమంగోలులు బౌద్ధులైరి పశ్చిమశాఖవారు ఇస్లామును స్వీకరించిరి 1368 లో చీనులు యువానువంశమును తొలగించి, స్వదేశీయమగు మింగవంశము

స్థాపించిరి ఆ రాజవంశము 1368 నుండి 1644 వరకు నిల చెను 1480 వరకు రష్యనులు తార్తారు దండులకు లోబడియే యుండిరి, కాని, ఆసాలున రష్యా రాజధానియగు మాస్కోలో గ్రాండుడ్యూక్ అను ప్రభువు తన సామంతతను ద్రోసిపైచి, స్వతంత్రుడై, ఇప్పటి రష్యారాజ్యముస్థాపించెను

14 వ శతాబ్దమున చెంగిజ్‌ఖాను వంశీయుడగు తైమూర్లేను మరల మంగోలు ప్రతిభ వ్యాపింపజేసి, పశ్చిమ తుర్కిస్థానములో రాజ్యముస్థాపించి, 1369 లో 'మహాఖాను' పదవి నధిష్ఠించి, సిరియామొదలు ఢిల్లీవరకు జయించెను ఆ సామ్రాజ్య మాతనియనంతరమే నశించెను, ఆతని వంశీయుడగు బాబరు అను సాహసికుడగు వీరుడొకడు తుపాకుల సహాయముతో సేనను తెచ్చి, ఉత్తరభారత దేశములో ప్రవేశించెను. అతని మనుమడగు అక్బరు (1556-1605) ఆతని విజయము సంపూర్తిచేసెను ఈమంగోలు వంశము హిందూదేశమున విశేషభాగముపై 18 వ శతాబ్దమువరకు ఢిల్లీలో పాలించెను (వీరినే ఆరబులు మొగలులనిరి, అదే వీరి ప్రతినామమైనది)

13 వ శతాబ్దమున ఈమంగోలు దండయాత్ర ఫలితముగ, ఒట్టమను తురుష్కులనబడిన యొక తురుష్కజాతి తుర్కిస్థానమునుండి ఆసియామైనరునకుపోయిరి, అచట వారు

రాజ్యమును వ్యాపింపజేసి, డార్డైనల్సు జలసంధిదాటి, మ్మాసి డోనియా సెర్వియా బల్గేరియాలపై దండెత్తిరి తుదకు ఒట్టమను రాజ్యము-మధ్య కాన్స్టాంటినోపి లొక చిన్నద్వీపము వలె నుండెను. 1453 లో ఒట్టమను సుల్తానగు 2 వ మహమ్మదు చాల తుపాకులసహాయముతో యూరపువంకనుండి ముట్టడించి, కాన్స్టాంటినోపిలును పట్టుకొనెను ఈసంగతి యూరపులో కల్లోలము గల్గింప, మరల మతయుద్ధప్రశంస కలిగెను, కాని మతయుద్ధదినము లంతరించెను

16 వ శతాబ్దమున ఒట్టమను సుల్తానులు బగ్దాదు హంగరీ ఈజిప్టులను, రమారమి ఉత్తర ఆఫ్రికానంతను, జయించిరి, వారి నౌకాదళముచే, మధ్యధరాసముద్రాధికారమువచ్చెను వారు ఆస్ట్రియారాజధానియగు వియన్నానుగూడ బట్టుకొనబోయి, ఆచక్రవర్తి వద్దనుండి కప్పము గ్రహించిరి 15 వ శతాబ్దపు క్రైస్తవరాజ్యముల హీనస్థితికి రెండేమినహాయింపులు, మొదటిది 1480 లో మాస్కో స్వాతంత్ర్యపునస్థాపనము రెండవది క్రైస్తవులు క్రమముగ స్పెయినును తిరుగ జయించుట, 1492 లో ఆద్వీపకల్పము లోని 'గ్రనడా' అను తుది మహమ్మదీయ సంస్థానముగూడ 'అరగను' రాజగు ఫెర్డినండుకును అతనిభార్య కాస్టైలురాణి అగు 'ఇజబెల్లా' కును లొంగిపోయెను

చివరకు 1571 లో లెపాన్టో వద్ద నౌకాయుద్ధముజరిగి, అందు ఒట్టమనుల గర్వమడగెను, అంతవరకు, మధ్యధరా సముద్రప్రాంతము క్రైస్తవాధికారములోనికి రాలేదు *

---

* 11 వ శతాబ్దమునుండి మన భారతదేశమున వివిధ ముసల్మను రాజులు కొంతకొంత వ్యాపించిరి 8 వ శతాబ్దమున అరబ్బులు సముద్రముపైనవచ్చి దాడిసల్పి కొందరి నిస్లాముకు మార్చిరి కాని వారియధికారము నిలువలేదు అందుచే ఆప్రాంతపు విజ్ఞానముమాత్రము 8 వ శతాబ్దమందే అరబ్బులకు వ్యాపించెను వాయవ్యప్రాంతపు ఆఫ్ఘనిస్థానము నుండి 11 వ శతాబ్దమున మహమ్మదు ఘజిని అనేకదండయాత్రలుసలిపి దేవాలయాదులనుండి చాలద్రవ్యము గ్రహించెను కాని మనదేశమున రాజ్యస్థాపన చేయలేదు 12 వ శతాబ్దపు 'మహమ్మదుగోరి ఆర్యావర్తమున పరరాజ్యస్థాపన నారంభించెను భారతీయయోధులు శూరులైనను, అప్పు డార్యావర్తము చిన్నచిన్నరాజ్యములుగ విభక్తమయి, ఆ రాజులు నిరంతరము కలహించుచుండిరి విదేశీయులగు ప్రబలశత్రువులు వచ్చినప్పు డైన, స్వదేశరక్షణకై అందరు నేకీభవింపరైరి హిందువులలో బౌద్ధులలోగూడ, అప్పుడు విగ్రహారాధన కులాచారాది బాహ్యచిహ్నములకే ప్రాబల్యముకలిగి, నిజమగు మతధర్మముల జనులు మరచిరి అప్పటికి పరస్పరము భాషాభేదము నేర్పడెను ఇస్లాము మతావేశమున ముసల్మను లైక్యముతో పోరుచుండ, భారతీయయోధులు కులవిభేదములతోను పరస్పరాసూయలతోను సహకారహీనులై యుండిరి అఫ్ఘనులు శీతలదేశపు కొండలలో అశ్వములపై చురుకుగ చరించుచు నవీనపద్ధతుల యుద్ధముల కలవాటుపడిరి భారతీయులట్లుగాక, పూర్వపు రీతినే ఏనుగులతోను సంఘటనలేని అశ్వికపదాతులతోను, ఆడంబరయుతులగు అనుచరులతోను,

ప్రాచీనపద్ధతులతో యుద్ధమొనర్చిరి అంతుచే గోరి కుతుబుద్దీన, అల్లాఉద్దీను ఖిల్జీ మహమ్మదు తుగ్లకు మొదలగు తురుష్కరాజులు ఆర్యావర్తమును (కొంతవరకుదక్కను ప్రాంతముకూడ) జయించిపాలించిరి బెంగాలు గుజరాతు దక్కను మొదలగు ఆయాప్రాంతములందు తురుష్కరాజులేర్పడి, క్రమముగ స్వతంత్రులు కాజొచ్చిరి అప్పుడుపెద్ద హిందూదేవాలయములందును బౌద్ధవిహారములందును అమూల్యమైన చాల బంగారు ఆభరణ వాహనములు రత్నములు వజ్రములు నుండెను వాటిని హరించుటకును, విగ్రహముల నిర్మూలించుటకును, తురుష్కులు నిశ్చయించుకొనిరి అతురుష్కరాజులలో కొందరాయాలయముల బడగొట్టి, అందలి విశేషధనరత్నాదుల దీసికొనిరి 14 వ శతాబ్దపు చివర, తైమూరు అను మంగోలునాయకుడు మనదేశపు వాయవ్యప్రాంతమున దాడిసలిపి, అచటి రాజధానియగు ఢిల్లీని కొల్లగొనినను త్వరలో తగువుపడుచు, భారతీయరాజులతని నాపలేకపోయిరి 13,14, వ శతాబ్దులందు త్రిలింగదేశరాజు కాకతీయుడు అగు ప్రతాపరుద్రదేవునికి ముసల్మానురాజులతో పోరుసాగుచు, కాకతీయ రాజ్యము క్షీణించెను, అందధికారులుగనుండిన హరిహరబుక్కరాయలు 14 వ శతాబ్దిమధ్యమున తుంగభద్రాతీరమున విద్యానగరరాజ్యమును స్థాపించి ప్రబలులై, మహమ్మదీయులదాడులణచిరి కొంతమతద్వేషాదులచే హిందూముసల్మాను రాజులమధ్య సహకారములేకుండినను, జనపదములందు చిరకాలాగతమగు గ్రామపంచాయతీపద్ధతి నిల్చియుండెను, గ్రామములందు శిల్పములు పరిశ్రమలు వృద్ధిలోనేయుండె, మనదేశము అప్పుడు ప్రశస్తమగు నౌకలపైని ఇతరదేశములతో కోస్తావర్తక వ్యాపారములు సల్పుచుండినట్లు 'మార్కోపోలో' మొదలగు యాత్రికులు వ్రాసిరి ఇందు తయారైన సన్నని నేతబట్టలు ఇతరవస్తువులు ఇతరదేశముల కెగుమతియగుచుండెను, ఫిరోజిసుల్తాను మొదలగు రాజులచ్చటి శిల్పకళాపోషి

త్రుల నాఘనుదేశాదులను దీసికొనిపోవుచుండిరి కుతుబుద్దీను (క్రీ శ సుమారు 1200) హయామున కట్టిన ఉక్కుధ్వజస్తంభ మీనాటికిని చెడిపోక, ఆధునిక వైజ్ఞానికలోహ శిల్పులకు నాశ్చర్యకరముగనుండుట అప్పటి శిల్పకళాభివృద్ధిని తెల్పును

16వ శతాబ్దమున మొగలుసామ్రాజ్య మారంభించెను దానిస్థాపకుడగు బాబరు తల్లి మంగోలు, తండ్రిది తుర్కిజాతి బాబరుకు తుపాకులు మందుసామానులుండెను అతనిసైనికులు కొండదేశములందశ్వములపై స్వారిచేయుచు యుక్తితోయుద్ధ మొనర్చుటలో నారితేరినవారు అప్పుడు ఢిల్లీపాలకుడగు 'ఇబ్రహింలోడి' గర్వి క్రూరుడు అయినందున అతనిచే బాధితులైన ఆస్థానరాజన్యులే భారతదేశసంపత్తిచే నాకృష్టుడైన బాబరును ఢిల్లీరాజుతో యుద్ధముచేయ నాహ్వానించిరి అంతట 1526 లో పానిపట్టుయుద్ధమున విభేదయుతమగు లోడీసేనలను, 1527 లో 'ఖాండ్వ యుద్ధమున 'మేవారు రాణాయగు సంగ్రామసింహుని సేనలను సాహసి ధీమంతుడు నగు బాబరు తుపాకుల సహాయముతో నోడించి, 'మొగలు' రాజ్యము స్థాపించెను అతడు క్రమముగా తన రాజ్యమును విస్తరింపజేయుచు, 1530 లో చనిపోయెను అతని కుమారుడగు హుమయూను యోగ్యుడైనను అసమర్థుడు, 1540 లో కనోజ వద్ద బీహారుపాలకుడగు అఫ్ఘను షేరునిచే నోడి, రాజ్యభ్రష్టుడయ్యెను అంతట విజయియైన 'షర్షా' ఢిల్లీరాజై, ఆర్యావర్తమంతను జయించి, రాజ్యపాలనలోను, ఆర్థికసంస్కరణముచేతను సేనలోను న్యాయశాఖలోను కట్టుదిట్టముల నేర్పరచి, గొప్ప రాస్తాల నిర్మించి సౌకర్యముల గల్పించియు, సౌఖ్యకరముగ సమర్థతతో రాజ్యము నిర్వహించెను షర్షా అనంతరమతని వంశీయు లశక్తులైరి ఈలోగా పర్షియారాజు సహాయమున హుమయూను మరల సేనలసంపాదించిగాంధారమును పంజాబును

జయించెను. అతడు ఢిల్లీ ఆఫ్ఘనసుల్తానును 'సర్హింద్' యుద్ధమందోడించి, మొగలు రాజ్యమును మరల స్థాపించి, 1556 లో చనిపోయెను. అతని కుమారుడగు అక్బరు వీరుడు ధీరోదాత్తుడు. అతడు యుక్తవయస్కుడై 1560 నుండి స్వతంత్రపాలన నారంభించెను. క్రమముగా అక్బరు విజయుడై ప్రస్తుతపు మద్రాసు రాష్ట్రము నిజాం రాజ్యప్రాంతము తప్ప మిగిలిన భారతమంతను తన సామ్రాజ్యమునజేర్చి, 1605 వరకు సమర్థతతో పాలించెను. 16 వ శతాబ్దమున మధ్యయూరపు చక్రవర్తియగు 5 వ చార్లెసు, ఫ్రెంచిరాజగు ఫ్రాంసిసు, ఇంగ్లండు పాలకులగు 8 వ హెన్రీ ఎలిజబెతులు, స్పెయినుచక్రవర్తియగు 2వ ఫిలిప్పు మొదలగు అప్పటి రాజులందరికన్న అక్బరే ఎక్కువమహనీయుడు, దూరదర్శి ప్రాజ్ఞుడు జనక్షేమపరుడు, అనిచెప్పవచ్చును. అశోకునివలెగాక అక్బరు చాల యుద్ధదండయాత్రలజేసి, విశేషరక్తపాతము గావించెను. కాని తాను స్థాపించిన సామ్రాజ్యము స్థిరము బలీయము శాంతముగ జేయుటకు శ్రమపడెను. వెనుకటి తురుష్కరాజులవలెగాక, అతడు హిందూమహమ్మదీయులమధ్య అనుకూలత ఏకీభావము అవసరమని గ్రహించి, అందుకై పాటుపడెను; అంతర్వివాహములగూడ ప్రోత్సహించెను. మతమూర్ఖత తగ్గింపజేసెను. విద్వాంసులచే సర్వమతముల సిద్ధాంతములను చర్చింపజేసి భావసామ్యము తొలగించి, సర్వమతసముడై నిష్పక్షపాతియై, జనులలో పరస్పరస్నేహము వృద్ధిజేసెను. ఆయామతస్థులు బాహ్యచిహ్నములకును శుష్కాచారములకొరకును కలహించుట ఆయనకిష్టముకాకుండెను. అన్నిమతముల మూలసూత్రములొకటేయని గ్రహించెను. ముసల్మాను మతశాఖలలో 'సూఫీ' మతము తనకు నచ్చెను. జీవాత్మలన్నియు పరమాత్మనుండివచ్చె దానితో అవినాభావసంబంధముగలవను మనవేదాంతతత్త్వమే దీని సిద్ధాంతము. 18 వ శతాబ్దముమధ్య యూరపుచక్రవర్తియగు 2 వ ఫ్రెడరికువలె అక్బరుకు

సర్వమత బాహ్యచిహ్నములను ఆచారవాదములను నిరసించినను, అతని వలె నాస్తికుడుగాక, తత్వజ్ఞుడై, యథార్థ వేదాంతియయ్యెను, షర్షా ఆరంభించిన నాణెముల పద్ధతిని, రాజ్యాంగ సంస్కరణములను, అక్బరు ఉద్ధరించి వృద్ధిజేసెను, భూమిపన్ను వసూలు పద్ధతి ఆయా తాలూకాల పాలనము న్యాయనిర్వహణము పూర్తిగా సంస్కరించి, చక్కని స్థితికి దెచ్చెను, రాష్ట్రాల బాగుచేసి సత్రములు నిర్మించి ప్రయాణ వ్యాపారములకు సౌకర్యము కల్గించెను పరాజితుల బానిసలుగ చేయు పద్ధతిని నిర్మూలించెను; యాత్రికుల పన్ను, 'జిజియా' (తురకలు కానివారిపై పన్ను), మొదలగు చెడుపన్నుల దొలగించి, ఉద్యోగులక్రమముగా ప్రజల బీడింపకుండ తగు నిబంధనల జేసెను 'సతీ పద్ధతి (వితంతువుల నిర్బంధ మరణము) అతిబాల్యవివాహములు భిన్నవయస్క వివాహములు సమీప బంధు వివాహములు మొదలగు సాంఘిక దురాచారముల నిరుత్సాహపరచెను హిందూమతాదుల మన్నించెను, జాతి మతభేదములు లేకుండ తోడర్మల్ మానసింహాది సమర్థులగు హిందువుల గూడ ఉన్నతోద్యోగుల జేసెను అప్పుడు సంస్కృతమును హిందీ మొదలగు దేశభాషలకు ప్రోత్సాహము కలిగెను భట్టోజిదీక్షిత సూరదాసు తులసీదాసు మొదలగు విద్వాంసులు సుమారాకాలమువారే అక్బరు విజ్ఞానాభివృద్ధిగూడ గల్గించెను 15 వ శతాబ్దిని రామానందకబీరులు, 16వ శతాబ్దమున చైతన్య నామదేవ నానకులు, పరిశుద్ధదైవభక్తిని బోధించిరి హిందూమహమ్మదీయ సిద్ధాంతముల మధ్య సమీకరణయత్నములు జరిగెను, అక్బరు అనంతర మొక శతాబ్దమువరకతని పుత్రపౌత్రపాలనమునగూడ (వారికట్టి ప్రజ్ఞ ఔదార్యము లేకున్నను) భారతదేశస్థితి బాగుగనుండెను దేశమందు రాజాదరణమున అనేక పరిశ్రమలు కళలు అభివృద్ధిజెందెను, అనేక సుందర రాజమందిరములు నిర్మింపబడెను అక్బరు మనుమడగు షాజహాను కట్టించిన ఆగ్రాలోని

'తాజ్ మహాల్' ఢిల్లీలోని 'జూమామసీద్' మొదలగునవి నేటికిని జగత్ప్రసిద్ధములు, చిత్రకళలు కూడ చాలావృద్ధినొందెను ఈ మొగలు రాజులందరు పరధ్యానములేక భారతదేశమునే స్వదేశముగా నెంచుకొని, దాని క్షేమమునే గోరుచుండిరి 16 వ శతాబ్దమున ఆంధ్రదేశపు విద్యానగర సామ్రాజ్యము వృద్ధినొందెను, అందుకృష్ణదేవరాయలు ఆంధ్రవాఙ్మయమునుగూడ చాల ప్రోత్సహించెను కాని 17 వ శతాబ్ది చివర భారతదేశపుస్థితి క్రమముగా మారెను ఆశతాబ్దిమధ్య మొగలు చక్రవర్తియైన ఔరంగజేబు (షాజహాను కుమారుడు) విచిత్రపురుషుడు, అతడు శౌర్యపరుడై సమర్థుడై రాజ్యమును విస్తరింపజేసినను, ఇస్లాముమతావేశమున హిందూద్వేషియై, తన సైనికులపైనను మంత్రులపైనను నమ్మికలేక ఆంతరంగికులగూడ అనుమానించి, క్రూరుడై అక్బరు పాలనపద్ధతిని తలక్రిందుజేసెను

పూర్వపు సామంతరాజ్యపద్ధతి యూరపులోని ఫ్యూడల్ పాలనలోవలె ఉద్యోగులు 'సుబా'లను జాగీరులను వంశపారంపర్యముగ ననుభవించు పద్ధతి నక్బరు త్రిసివేసి వారికి జీతముల నేర్పరచియుండెను దానిని ఔరంగజేబు మార్చి పూర్వపు జాగీర్లపద్ధతిని తెచ్చుటచే, మరల సామంతులేర్పడి ప్రజల బాధింపజొచ్చిరి, అతను మతవిభేదముల రేపెను ద్వేషము వృద్ధియై, మహారాష్ట్రమున శివాజి నాయకత్వమున జనులు స్వతంత్రులైరి రాజపుత్రరాజులు తిరుగబడి, ఔరంగజేబును పగశత్రువులైరి పంజాబులో గురుగోవిందసింహుని నాయకత్వమున సిక్కులు (హిందువులకు మహమ్మదీయులకు మధ్య మతమువారు) వీరులై స్వాతంత్ర్యయుద్ధము సలిపిరి, ఔరంగజేబు నిరాదరణచేతను, అశాంతిచేతను, దేశమందు పరిశ్రమలు శిల్పకళలు మున్నగునవి క్షీణింపజొచ్చెను 1707 లో ఔరంగజేబు చనిపోగా, మొగలు రాజవంశము

అంతఃకలహము పాలయ్యెన, ఆవంశపురాజులు బలహీనులైరి, దేశమున ఆయాప్రాంతములందు స్వతంత్రరాజ్యములేర్పడి వారిలోవారికి యుద్ధములు జరుగుచుండెను దక్కనులో మొగలు ప్రతినిధి 'నిజాం' అను పేరుతో తనరాజ్యమును స్వతంత్రముచేసెను శివాజి హిందూమహారాష్ట్రరాజ్యము వ్యాపింపజేసి, 1680 లో చనిపోయెను అతని యనంతరము ఆరాష్ట్రపుమంత్రులగు పీష్వాలు పూనానుండి యారాజ్యమును నిర్వహించుచుండిరి కొంతకాలమునకు పేష్వాలు బలహీనులుకాగా వారి సేనానులగు గయికవారు బరోడాలోను, హోల్కారు ఇండోరులోను, సింధియా గ్వాలియరులోను, ఇట్లు స్వతంత్రరాజ్యముల నేర్పరుచుకొనిరి, (ఆరాజవంశములు ప్రస్తుతపు ప్రభుత్వమునకిప్పుడు సామంతులై, నేటికిని రక్షితరాజ్యములుగ పాలనము చేయుచున్నవి) ఉత్తరహిందూదేశమున ఔద్ (అయోధ్య) నవాబు వంగదేశపు నవాబు మొదలగువారును స్వతంత్రులైరి ఈరాజ్యములన్నిటిమధ్యను నిరంతరకలహములు గలుగుటచే, అప్పటినుండి భారతదేశమున క్రమముగా అశాంతి హెచ్చి, ప్రజలు సౌఖ్యము గోల్పోయిరి 15, 16 వ శతాబ్దములందు కలిగిన ఆధ్యాత్మిక బోధముకూడ క్రమముగ క్షీణించెను ఆంగ్లేయులు ఫ్రెంచివారు మొదలగు పాశ్చాత్యులు విరివిగా వచ్చునప్పటికి, భారతీయులిట్టి దుస్థితికి వచ్చుచుండిరి

---

## 49 యూరపియనుల విజ్ఞానవికాసము

12 వ శతాబ్దమున యూరపియను విజ్ఞానమిక బాగు పడి వృద్ధికాబోవుసూచన లగుపించెను గ్రీకు పరిశోధకుల మొదటివిజ్ఞాన వికాసమును, ఇటలీవాసి 'ల్యుక్రెషియసు' జేసిన యూహాలను, వీరు మరల నుద్ధరించుచున్నుండెను ఈపునరుజ్జీవనము కనేక క్లిష్టకారణములు కలవు. వ్యక్తి యుద్ధము లంతమై, మతయుద్ధానంతర మేర్పడిన యోగ్య జీవనపద్ధతి, ఈయుద్ధఫలితమగు ఉత్తేజనము, ప్రథమ కారణ ములు, వర్తకమితిరుగ వృద్ధియయ్యెను. పట్టణములకు సుఖ రక్షణకలిగెను, మతగురువులలో విద్య పెంపొందెను. సామాన్యజనులు చదువుకొనజొచ్చిరి 13, 14, వ శతాబ్దు లలో నగరముల స్వతంత్రత వృద్ధిగాజొచ్చెను వెనీసు, ఫ్లారెన్సు, జినోవా, లిస్బను, పారిసు, బ్రూజెను, లండను, ఆంట్వర్పు, హాంబర్గు, న్యూరెంబర్గు, నొవ్గరాడ్, విస్బీ, బెర్గెన్ పురములట్టివే ఈవర్తకపురములందనేక యాత్రికులుం డిరి వర్తకయాత్రికులకు సంప్రదింపు ఆలోచన ఉండును మతవిషయములందు పోపులకు రాజులకు జరుగు కలహము లను వ్యతిరేకుల శిక్షించుటలో వారి దారుణచర్యలనుజూచి, జనులాయా మతసంస్థల ప్రామాణ్యము శంకించి, వాని

నిరోధించుచు, మూలసిద్ధాంతములనుగూర్చి స్వతంత్రముగ జర్చింపదొడగిరి

అరబ్బులు యూరపున అరిస్టాటిలు విజ్ఞానము మరల వ్యాపింపజేసిరి 2 వ ఫ్రెడరికువంటి రాజులు అరబుల తత్వశాస్త్రమును, విజ్ఞానమును, యూరపుగో వ్యాపింపజేసిరి భావవికాసము గల్గించుటకు యూదులు చాల తోడ్పడిరి, వీరు క్రైస్తవపీఠాధికార మంగీకరింపరు ఇంతే గాక, అప్పటి రసవాదజ్ఞుల విచిత్రవిమర్శనలు వ్యాపించి, ఆధునిక వైజ్ఞానిక పరిశోధనలకు కారకమయ్యెను ఇట్లు స్వతంత్ర విద్వాంసులలోనేగాక, సామాన్య జనులలోను జ్ఞానము పూర్వముకన్న వృద్ధిజెందెను అంతేలున్నను, క్రైస్తవబోధ, అందుచే వ్యక్తికిని ధర్మదేవతతో ప్రత్యక్షసంబంధము, కలిగెను అందుచే మతరాజాదులగూర్చి ప్రజలు స్వతంత్ర నిర్ణయములకు రాగలుగుచుండిరి

11 వ శతాబ్దముకే, యూరపులో తాత్వికచర్చ తిరుగ నారంభించెను, పారిసు ఆక్సుఫర్డు బలోనా మొదలగు కేంద్రములందు విశ్వవిద్యాలయము లేర్పడి, వృద్ధిజెందెను. అచ్చట మధ్యకాలపు విద్వాంసులు పూర్వికుల శబ్దార్థచర్చ నందుకొనిరి. ఆతత్వచర్చ భావివైజ్ఞానికకాలపుచర్చకు పూర్వరంగమయ్యెను వీరిలో ప్రముఖుడగు "రోజరు బేకన్" అను

(1210-1293) ఆక్సుఫర్డులోని ఫ్రాన్సిస్కను శాఖీయుడగు మేధావి, ఆధునిక వైజ్ఞానికపద్ధతికి మూలపురుషుడు, ఇతడు అరిస్టాటిలు తరువాత ముఖ్యమహనీయుడు

ఇతడు తన గ్రంథములందా కాలపు జనుల అజ్ఞానమును ధైర్యముతో ఖండించెను లోకులు మూఢులని జనుల చర్యలు బాల్యచేష్టలని వారిసిద్ధాంతములు బాలిశభావములని ఈకాలమున ఎవరైన వెల్లడించినను, అందుచే ప్రమాదముండదు కాని మధ్యకాలపుజనులు, హత్యలు క్షామము అంటువ్యాధులులేని సమయములందు, తమ సిద్ధాంతములే ప్రమాణము లని నమ్ముచు, వానిని శంకించువారిపై తీవ్రముగ నాగ్రహించుచుండిరి అంధకారమున కాంతికిరణముల వలె రోజరు బేకను ఆకాలపు అజ్ఞానమును నిరసించి, జ్ఞానవ్యాప్తికై చాల సూచనలజేసెను అరిస్టాటిలువలెనే, ఇతడును పరిశోధనకు జ్ఞానసంపాదనకు ప్రాముఖ్యమిచ్చెను

అయినను జనులు అరిస్టాటిలు గ్రంథముల లాటిను తర్జుమాల దిరుగవేయుటతో తృప్తి జెందుటజూచి, బేకను అరిస్టాటిలునే దూషించి, "నాకధికారముండినచో అరిస్టాటిలు గ్రంథము లన్నిటిని తగులబెట్టెదను, ఈ పుస్తకములచే కాలహరణము అజ్ఞానము మాత్రమధికమగును" అనెను అపార్థకములగు ఈలాటిన తప్పుతర్జుమాల పూజమాత్రము

చేయుట జూచినచో, అరిస్టాటిలును బేకనువలె చెప్పియుం డును పూర్వాచారులవలన కారాగృహాదిబాధలు కలుగ కుండుటకై, సూచనారూపముగనే, బేకను తన గ్రంథమందు "మూఢవిశ్వాసము అధికార ప్రాబల్యము పూర్వాచారము మూఢత్వము విజ్ఞానప్రాతికూల్యము మాని లోకజ్ఞానము కల్గినచో, జనులకు సర్వశక్తులు గలుగును" అనెను

"తెడ్లక్కరలేకనే, యంత్రసహాయమున నదీసము ద్రాదులందు మహానౌకల నొక్కడే నడువవచ్చును, లాగు టకు జంతువులులేకనే, యంత్రశక్తిచే నడుపు శకటములను పురాణరధములవలె, నిర్మింపవచ్చును విమానయంత్రముల నిర్మించి, వాటిమధ్య వాయుమండలమున కృతకపక్షులతో నెగురవచ్చును," అని బేకనువ్రాసెను కాని యీప్రకృతిశక్తి రహస్యములను గనిపెట్టి, ఉపయోగించుట కప్పటికింకను మూడుశతాబ్దములు గావలసివచ్చెను అరబ్బులు క్రైస్తవ లోకులకు తత్వశాస్త్ర రసవాదముల జ్ఞానమేగాక, జ్ఞాన వ్యాప్తికవసరమగు కాగితములుగూడ లభింపజేసిరి కాగి తముచేయుట చీనాలో బహుశ క్రీ పూ రెండవశతాబ్ద మందే, కనిపెట్టిరి క్రీ త 751 లో చీనులు సమరఖండమం దలి అరబ్బులపై దాడిసలిపి, అందోడిరి అందుఖైదీలైన కొందరు చీనులనుండి అరబ్బులు కాగితముచేయుట నేర్చుకొ

నిరి 9 వ శతాబ్దమున వ్రాసిన కాగితము లిప్పటికినిగలవు గ్రీసుద్వారానో, లేక స్పెయిను పునర్జితమై అందలి కాగితపు యంత్రముల క్రైస్తవులువశపరచుకొనినప్పుడో, వారు కాగిత ముల జేయనేర్చిరి, కాని అచట 13వ శతాబ్దముపోవువరకు మంచికాగితముల జేయలేరైరి మంచి కాగితము లిటలీలో తయారు కానారంభించి, 14 వ శతాబ్దమున జర్మనీలో వ్యాపించి, ఆశతాబ్దము చివర చౌక గ్రంథముల నచ్చువేయ వీలాయెను అంతట సహజముగ అచ్చువిధానము కనిపెట్ట బడెను అందుచే విజ్ఞానజీవిత ముత్తేజితమయ్యెను ఇదివర లోవలె వ్యక్తుల మనసులలోనికి సొద్దిగా దిగజారుటకుబదులు, అప్పటినుండి జ్ఞానము మహావాహినివలె వేగముతో వేలకొ లది లక్షలకొలది జనులలో వ్యాపింపదొడగెను

ముద్రణ ఫలితముగ బైబిలు గ్రంథము సమృద్ధమై జగమంతట వ్యాపించెను పారపుస్తకములు చౌక ఆయెను, గ్రంథాకారము బాగుపడి, సులభముగా గ్రహింపవీలయ్యెను, చదువుసులభమైనందున, చదువరుల సంఖ్యయు వృద్ధిఅయ్యెను జనులందరి కుపయుక్తములగు గ్రంథముల (లాటినులోగాక) వాడుక భాషలో వ్రాయమొద లిడిరి ఇట్లు 14 వ శతాబ్దిలో యూరపియనుల యథార్థ వాఙ్మయ మారంభించెను

పారసీకులవల్లనేగాక, మంగోలు విజయముచే గూడ, యూరపియనుల కుత్తేజనగలిగెను. ఖానుమహాశయుకాలమున ఆసియా పశ్చిమయూరపులమధ్య పరస్పర సమావేశమధికమై, తత్కాలపు మహాపథము లేర్పడెను. కారకోరమువద్ద రాజస్థానమున అన్నిదేశముల ప్రతినిధులుండిరి. క్రైస్తవ ఇస్లాముమతముల సంఘర్షముచే నేర్పడిన ఆటంకములు కొంతతగ్గి, మంగోలియనులను క్రైస్తవులుగా జేయ యత్నించిరి. మంగోలుల దసలు 'షమేనిజమ'నునొక ఆదిమమతము, మంగోలు రాజస్థానమున పోపు ప్రతినిధులు భారతదేశపు బౌద్ధబోధకులు పారిసి ఇటలీ చీనాల కార్మికులు బిజంటియం ఆర్మీనియాల వర్తకులు గూడిరి, అరబు ఉద్యోగులు భారతీయజ్యోతిశ్శాస్త్రజ్ఞులు పారసీక వైజ్ఞానికులు కలసి సంప్రదించిరి. చరిత్రకారులు మంగోలుల యుద్ధహత్యలకే ప్రాముఖ్యమిచ్చిరి, కాని వారి జ్ఞానాపేక్షకు దగుస్థానమీయరైరి, మంగోలులు (స్వతంత్రజ్ఞానములేకున్నను) కళాశిల్పవిజ్ఞానములను ప్రపంచమున వ్యాపింపజేసి, లోకోపకారులైరి. చెంగిజ్ కోబ్లైల విచిత్రవ్యక్తులగూర్చి తెలిపిన సంగతులు వారు అహంకారియగు అలెగ్జాండరుకును, రాజ్యతంత్రజ్ఞుడయ్యు మూఢవిశ్వాసముగల చార్లమనుకును, బుద్ధివైశద్యమున దీసిపోరని సూచించును. మంగోలు రాజా

కూడ మనదేశమందు వసించుటకు స్వేచ్ఛావ్యాపారము ఉద్యోగము చేయుటకు హక్కున్నను, మనకా దేశములందు మాత్రము స్వేచ్ఛతో వసించుటకుగూడ హక్కులు చాలవరకు నిరోధింపబడినవి తూర్పు దక్షిణాఫ్రికాలలో ఆంగ్లేయులకు పూర్వమునుండి వలసబోయి స్థిరవాసులైయున్న భారతీయుల హక్కులుకూడ ఇటీవల తగ్గించివేయబడి, చాల నిర్బంధము లేర్పరుపబడుచున్నవి ఈ అధినివేశములలో ఆదిమ ప్రజలు చాలవరకు క్షీణించిరి తెల్లవారే ఇప్పుడచ్చటి ముఖ్యపౌరులు, వారిది బ్రిటిషువారిది ఒకేజాతి, ఒకేమతము ఒకేనాగరికత, వారికి పరస్పర సహాయ మవసరము ఈ అధినివేశములు విశాలప్రదేశములు, అందు జనసంఖ్య చాలతక్కువ అందు శ్వేతజాతీయులే వసింపవలెనని భారతీయులు జపానీయులు మొదలగు వారచ్చటి పౌరులు కాగూడదని, వారిపట్టుదల పరస్పరసహృదయత ఉండుటచే అధినివేశపు శ్వేతజనుల కింగ్లీషుప్రభుత్వమువారు విశేషాధికారము బుద్ధిపూర్వకముగ నిచ్చుట సహజము, మనదేశపు స్థితివేరు

యూరపుమహాయుద్ధము కాగానే ఇంగ్లీషువా రీజిప్టుపై తుర్కీవారి నామమాత్రాధికారమునుగూడ తీసివేసి, తమ 'ప్రొటెక్టరేట్' అనగా రక్షకాధికారము ప్రకటించిరి ఈజిప్టుజనులు మనయంత పరాధీనులు కాకపోయినను, కొంతవరకు వారిస్థితి మనస్థితినే బోలినది, ఇటాలియను అబిసీనియా నాక్రమించిన తరువాత ఈజిప్టులో జాతీయవాదులకు ఇటలీపాలకుడగు ముసోలినీ ప్రోత్సాహమిచ్చుచుండెను ఈజిప్టుతో దాప్టు తమకవసరముకలిగి, బ్రిటిషుప్రభుత్వమువారు (కొన్ని షరతులకు లోబడి) ఈజిప్టుస్వాతంత్ర్య మంగీకరించినారు మనదేశపు దక్షిణమందున్న సింహళమును మనస్థితిలోనే ఉన్నది ఇంతవరకు మనదేశపాలనలో చేరియున్న బర్మాను మనదేశమునుండి విడదీసి సింహళమువలె వేరు

పాలన మేర్పడుట కాంగ్ల ప్రభుత్వమువారు చట్టమేర్పర్చినారు అప్రకారము బర్మా, వేరురాజ్యమైనది కాని రత్నణవగైరా కొన్ని మన దేశమునుండియే జరుగుచున్నవి తక్కిన మాల్టా, జిబ్రాల్టరు అడులకు యుద్ధాములందే ప్రాముఖ్యము

---

# 65 యూరపులో ఆయుధ యుగము

## 1914-18, మహాసంగ్రామము

అతివిశాలమగు అమెరికను రిపబ్లికుకు స్టీమరు రైలు మార్గములు ప్రపంచమంతట వ్యాపించిన బ్రిటిషుసామ్రాజ్యముకు, స్టీమర్లు తోడయ్యెను, కాని యీభౌతికవిజ్ఞానాభివృద్ధిచే, యూరపులో క్రిక్కిరిసియున్న యితరజాతులలో వేరుఫలితములు గల్గెను, గుఱ్ఱపు రహదారులనాటి కాలమున ఏర్పడిన సరిహద్దులలోనే వారు ఇరుకుకొనియుండిరి బ్రిటిషువారు సముద్రవ్యాప్తియం దితరులకంటె ముందంజవేసిరి ఒక్క రష్యామాత్రము తూర్పుదిశ వ్యాపింప వీలుండెను, రష్యావారు సైబీరియాగుండ ఒక పెద్ద రైలు మార్గమును నిర్మించి, జపానుతో తగవులో జిక్కుకొనిరి అక్కడనుండి ఆగ్నేయదిశను పర్షియా హిందూదేశముల సరిహద్దులవరకు త్రోసుకొనివచ్చిరి, అంతట బ్రిటిషువారికి కొంతఆగ్రహము కలిగినది మిగిలిన యూరపియను రాజ్యములన్నియు జనాభివృద్ధిచే నానాటికి మిక్కిలి క్రిక్కిరిసిపోవుచున్నవి మానవజీవితపు నూతనపద్ధతులచే క్రొత్తసదుపాయములేర్పడినవి వాటిలాభము బొందుటకు, ఒకవిధమగు స్వచ్ఛందసంఘీభావమేర్పర్చుకొనియో, లేక సర్వాధికారియగు రాజ్యముచే ఐక్యమొనర్పబడియో, వారందరు తమపరిస్థితులు విశాల

మొనర్చు కొనవలసియుండెను ఆధునికాభిప్రాయము మొదటి పద్ధతివంకకే మొగ్గియున్నను, రాజ్యాంగపుపూర్వసంప్రదాయము యూరపును రెండవపద్ధతివంకకే మరల్చినది

3 వ నెపోలియనుయొక్క ఫ్రెంచిసామ్రాజ్యము భగ్నమైనమీదట నవీనజర్మను సామ్రాజ్యమేర్పడెను, అందుచే జర్మనుఆధిపత్యమున యూరపు అంతయు కూడదీయబడునని తోచెను అస్థిరశాంతిలోనున్న ఆ 44 ఏండ్ల (1870—1914) లోను యూరపురాజకీయస్థితియట్లుండెను చార్లమను సామ్రాజ్యము విచ్ఛిన్నమైనప్పటినుండియు, యూరపుఆధిపత్యముకై జర్మనీతో తీవ్రముగ పోటీపడుచున్న ఫ్రాంసు రష్యాతో సఖ్యము జేసి, తననీరసత్వమును బోగొట్టుకొన యత్నించెను నెపోలియనుకాలమునుండి ఆస్ట్రియా 'పవిత్ర రోమకసామ్రాజ్య' పదవిని త్యజించెను. ఆస్ట్రియాతోను కొంతవరకు నూతనయిటలీరాజ్యముతోను, జర్మనీమైత్రి నేర్పరచుకొనెను బ్రిటిషురాజ్యము, తన మామూలుపద్ధతినే, యూరపియను రాజ్యాంగములలో జోక్యము కల్పించుకొని కల్పించుకొననట్లుండెను కాని క్రమముగా జర్మనుల నౌకాదళము తీవ్రముగవృద్ధినొందుట జూచి, విధిలేక ఇంగ్లీషువారు ఫ్రెంచిరష్యనువర్గమువారితో జేరిరి కైజరు రెండవవిలియం యొక్క (1888—1918) అద్భుతభావముల వలన, జర్మనులు

రాజ్యపరిపాక మొందక పూర్వమే సముద్రముపై సాహస కృత్యము లొనర్చిరి, అందుచే తుదకు ఇంగ్లీషువారేగాక, జపాను, సంయుక్తరాష్ట్రముగూడ, దానిశత్రువర్గమునందు జేరిరి

ఈజాతులన్నియు ఆయుధముల సమకూర్చెను ప్రతియేడును ఫిరంగులు, పరికరములు, యుద్ధనౌకలు, మొదలగు వానిని తయారుచేయుచు, అందుకు ఆయాప్రభుత్వములు జాతీయద్రవ్యమును విశేషముగ ఖర్చుపర్చిరి ఏయేటి కా యేడే యుద్ధము కలుగబోయి, ఆగుచుండెను. తుదకు యుద్ధ మారంభించెను జర్మనీ ఆస్ట్రియాలు ఫ్రాంసు రష్యా సర్వియాలపై బడెను, జర్మనుసైన్యములు బెల్జియముగుండనడువ, జపానుతోసహా బ్రిటనువారు బెల్జియముకు సహాయులైరి. వెంటనే టర్కీ జర్మనీతో కలిసెను 1915 లో ఇటలీ ఆస్ట్రియాపై యుద్ధమారంభించెను ఆయేడే అక్టోబరులో బల్గేరియా మధ్యరాజ్యముల గూడెను 1916 లో రుమేనియాయు, 1917 లో సంయుక్తరాష్ట్రములు, చీనాయును, జర్మనీపై యుద్ధమారంభించెను ఈమహాప్రళయమం దెవరిబాధ్యత యెంతయో వివరించుట కిందు వీలులేదు మహాసంగ్రామము నేల మొదలిడిరనుటకన్న, ఈమహాసంగ్రామము రాకుండ (జనులు) ముందుగనే కనిపెట్టి యేల నివారింపరైరను ప్రశ్న

ముఖ్యము పోలదిమంది తమచర్యలచే యుద్ధముకు కారకు లైరి, ఉదారనిష్కల్మష భావముతో యూరపియనుల కేకీభావముకల్గించుటకు బదులుగా, కోట్లకొల జనులు ఉదాసీనులో బుద్ధిహీనులో దేశభక్తి పేరట ఆవేశయుతులో అయిరి, యుద్ధమువారింపలేరిరి ఇది యెక్కువ శోచనీయము

ఆయుద్ధపుక్లిష్ట వివరముల నిందిచ్చుట యసంభవము ఆధునిక విజ్ఞానాభివృద్ధిచే యుద్ధపద్ధతులు విశేషముగమారి పోయెనని ఆయుద్ధారంభపు కొద్దినెలలకే స్పష్టమాయెను. ఉక్కు, ప్రయాణము, రోగములు, మొదలగువానిపై భౌతికశాస్త్రముచే మానవున కపారశక్తి కల్గెను ఈశక్తిని లోకులు తమ రాజకీయ నైతికజ్ఞానములబట్టి మంచికి చెరుపుకుకూడ వినియోగింపవచ్చును యూరపు ప్రభుత్వము లన్నియు పూర్వపు ద్వేషాసూయలకులోనై, నిరోధ వినాశముల కమితశక్తుల సంపాదించిరి ఈయుద్ధము ప్రపంచమంతటను దావానలమురీతి వ్యాపించి, విజేతలకు ఓడిపోయినవారికి గూడ అతిగాఢాకు తగని అపారనష్టము గలుగజేసెను ఈ యుద్ధపు ఆరంభదశలో, జర్మనులు పారిసుపైకి అద్భుతముగ విజృంభించిరి రష్యనులు తూర్పు జర్మనీపై దాడివెడలిరి ఈరెంటిను అరికట్టి నెట్టివేయబడెను అప్పుడు ఆత్మరక్షణపద్ధతి ప్రధానమయ్యెను కందక

ములలోనుండి యుద్ధముచేయుపద్ధతి విస్తారముగ వ్యాపించెను, అందుచే నయాసైన్యములు అపారనష్టముతోగాని ముందునకు నడువవీలులేక పోయెను సేనలు యూరపున కడ్డముగ దీర్ఘమగు బారులుతీర్చి, అగడ్తలవెనుక నిల్చియుండిరి లక్షలకొలది యోధులిట్లు రణరంగమందుండ, వీరివెనుక దేశజనులందరు వీరికాహారపదార్థములు మందుగుండు సామగ్రి అందజేయ పనిచేయుచుండిరి యుద్ధకార్యముల కవసరమగు పరిశ్రమలుతప్ప, మిగిలిన ఉత్పత్తిపరిశ్రమలన్నియు నిల్చిపోయెను, యూరపులోదృఢశరీరులగు పురుషులందరు సేనలలోనికో, నౌకాదళములోనికో, లేక వానినిమిత్తమేర్పడిన పరిశ్రమాలయములలోనికో, చేర్చుకొనబడిరి కర్మాగారములలో పురుషులకుబదులు స్త్రీలువిస్తారముగ జేరిరి ఈ మహాసంగ్రామకాలమున, యుద్ధముచేయు దేశముల ప్రజలలో సగముకుపైగా, తమపూర్వవృత్తుల మార్చుకొనియుండురు. సాంఘికముగా వారు స్వస్థితిదప్పి, పరస్థితినొందిరి, విద్యావిజ్ఞాన పరిశ్రమలు కొంతవరకు నిల్చిపోయెను, యుద్ధావసరములకే సర్వశక్తుల వినియోగించిరి యుద్ధాధికారులు ప్రభుత్వపు ప్రచారకులు పత్రికావార్తలగూడ నిరోధించి, వృత్తాంతములను తారుమారుచేసిరి

ఇట్లు సందిగ్ధసమరము జరిగెను, అంతట తీవ్రత యధికమై, కందకముల వెనుకనున్న ఆయా వైరిసేనలకంపబడు ఆహారపదార్ధముల ధ్వంసమొనర్చుటయు, వాయువిమానములనుండి దాడియు, మొదలిడెను ఫిరంగులపరిమాణము వినాశకశక్తి క్రమముగా నధికమయ్యెను, కందకములలో దాగి ప్రతిఘటించుసేనల నాశమొనర్చుటకై విషవాయువులు, బాంబులు, 'టాంకు' అను కదలు చిన్నకోటలు, మొదలగు అద్భుతపరికరములు కల్పింపబడెను ఈయన్నిటిలో అంతరిక్షయుద్ధమే అత్యద్భుతము ఇదివరలో స్థలజలముల రెంటినుండియే యుద్ధము జరుగుచుండెను, ఇపుడు యుద్ధము మూడవదగు వాయువుకును వ్యాపించెను ఇంతకుపూర్వము లోకమందు సేనలొండొంటి నెదుర్కొని తాకినపుడే, యుద్ధముజరిగెను ఇపుడో ప్రతిచోటను యుద్ధమే ప్రథమమున 'జెప్పెలిన్' (= జర్మనువిమానము), అటుతరువాత బాంబుల ప్రయోగించు విమానములు, కేవల రణరంగముననేగాక, దానిదాటి సకలపరిశ్రమలజేయు మామూలుప్రదేశములంతటను యుద్ధము జరుగసాగెను నాగరికయుద్ధములలో, సైనికివర్గము ఇతరప్రజలు అనుభేదమిపుడంతరించెను ఆహారపదార్థముల బండించెడివాడు, దుస్తులకుటువాడు, కత్తులగొటువాడు, ఇండ్ల బాగుచేయువాడు, ప్రతి

రైలుస్టేషను, గిడ్డంగిబూడ, రణోపయోగులు కనుక, ధ్వంస
ముచేయదగినవిగనే యెంచబడెను ఒక్కొకనెల గడచినకొల
దియు, విమానయుద్ధము అతిభీభత్సమై విపరీతనష్టము కలి
గింపజొచ్చెను తుదకు యూరపులో విశేషభాగము ముట్ట
డులకు, రాత్రులందు దాడికి, లోనయ్యెను లండను పారిసు
వంటి బహిరంగనగరములపౌరులు ప్రతిరాత్రియు నిద్దురలేక,
ఒకవంక బాంబులు ప్రేలుచుండ, విమానములపై ప్రేల్చు
ఫిరంగులు దారుణధ్వనుల జేయుచుండ, అగ్నినార్పు యంత్ర
ములు బాధితులకు సాయమొనర్చు శకటములు నిర్జనమగు
చీకటివీధులందు నిరంతరము ధ్వనించుచు దిరుగజొచ్చెను
ఈదారుణరంగముచే, వృద్ధులు చిన్నపిల్లలు మొదలగువారి
మనశ్శరీరములకు మరియు నష్టముగల్గెను

యుద్ధము వెన్నంటు అంటుజాడ్యములు 1918 లో
యుద్ధాంతమువరకు ప్రవేశించలేదు నాగ్లేండ్లవరకు వైద్య
విజ్ఞానమూలమున మామూలు అంటురోగములు రాకుండ
నిల్చెను కాని, తుదకు ప్రపంచమంతటను ఇంప్లుయంజా
మహావ్యాధిబయలుదేరెను,* అందుచే అనేకలక్షుల ప్రజలు

* ఈ ఇంప్లుయంజావ్యాధి అప్పుడు మన భారతదేశముకు కూడ
వ్యాపించగా, అందుచే కొన్ని నెలలలో సుమారు 70 లక్షలమంది మన
దేశీయులు చనిపోయిరి

నశించిరి కొంతకాలము క్షామము రాకుండ నిలుపుచేయబ డెను. కాని, 1918 ఆరంభమున, యూరపులో చాలభాగము తీవ్రదుర్భిక్షము పాలయ్యెను. వ్యవసాయదారులు రణరంగ మునకు యోధులుగ పోయిరి, ప్రపంచమందాహారపదార్థ ముల యుత్పత్తి చాల తగ్గిపోయెను మరియు, జలాంతర్గాము లోడల ముంచి యపారనష్టము గలిగించెను, సరిహద్దులరికట్ట బడి మామూలు మార్గముల రహదారీ పోయెను ప్రపంచ మందలి ప్రయాణ సౌకర్యములు తారుమారైపోయెను, కనుక ఆ పండిన కొలది పంటలనైనను సరిగా అందరకు అం దింప వీలులేకుండెను వివిధప్రభుత్వములు ఆహారపదార్థ ముల సరఫరానుగూడ తమ వశమందే యుంచుకొని, తమ ప్రజలందరకు కొద్దికొద్దిగా పంచి యిచ్చుచుండిరి, (ఇదే కం ట్రోలు అనబడెను.) నాల్గవయేడు వచ్చునప్పటికి లోకమం తకు కట్టుగుడ్డలు తగ్గిపోయెను, గృహావసతిలేదు, ఆహారము జీవితావసరములగు ఇతరపరికరములును క్షీణించెను, ఆర్థికజీవ నము వర్తకవ్యాపారములు అగమ్యగోచరమయ్యెను ప్రతి వాని కేదోబాధ, చాలమంది జను లిదివర కెఱుగని కష్ట ముల బడిరి

1918 నవంబరులో మహాయుద్ధ మాగిపోయెను ఆ సాలు వసంతఋతువున విశ్వప్రయత్నమొనర్చి, జర్మనులు

పారిసు సమీపించిరి, ఆస్థితిలో మధ్యయూరపు రాజ్యములు నిర్విణ్ణములయ్యెను ఆ జనులు నిరుత్సాహులైరి వారి సాధన శక్తులు నిశ్శేషమాయెను *

---

* యుద్ధఫలితముగ జయమొందిన ఇంగ్లండు, అమెరికా, ఫ్రాంసులకు విశేష నష్టములతోబాటు, వారికి కొన్ని లాభములు కూడ కలిగెను వాటి వ్యాపారములు పునరుజ్జీవితములయ్యెను జర్మనీ ఆస్ట్రియాల పోటీ (తాత్కాలికముగనైన) తొలగెను, జర్మనీ వలస రాజ్యములు ఇంగ్లండు వగైరా అధికారములోనికి వచ్చెను, నష్టపరిహారముగ చాల ద్రవ్యము జర్మనుల నుండి రాబట్టుకొనిరి బ్రిటిషు సామ్రాజ్యమందంతర్భాగమగు భారత దేశము కూడ ఈ మహాయుద్ధములో మిత్రమండలికి విశేష ద్రవ్యరూపమునను యోధుల మూలమునను చాల సహాయముచేసి అనేక నష్టముల ననుభవించెను అందుచే బ్రిటిషు వారికి యుద్ధములో ఎంతో లాభించెను, ఆ కారణమున హిందూదేశీయులకు స్వపరిపాలనాధికారము యుద్ధానంతరము తప్పక నిత్తుమని (యుద్ధము జరుగుచున్నప్పుడు) 1917 లో బ్రిటిషు ప్రభుత్వమువారు వాగ్దానము చేసిరి కాని తుదకు 1919 లో స్వల్ప సంస్కరణములుమాత్రమే యీయబడెను మరియు, మన జాతీయ భావము నణచు క్రొత్త చట్టము లమలునకు వచ్చెను ఇంతేగాక, ఆ సమయమున టర్కీ అవమానింపబడి, తురుష్కులు తమ రాజ్యము నాసియాలోనే ఉంచుకొని, అందు అంగోరాను రాజధానిగా జేసికొనిరి ఈ కారణములచే 1919 21 లో భారత దేశమున విశేషాందోళనము కలిగెను

---

## 66 రష్యాలో నవయుగము

మధ్యయూరపు ప్రభుత్వములిట్లు క్రుంగెను, అందు కొకయేడుపూర్వమే, రష్యాలో రాజత్వ మంతరించెను అర్ధ ప్రాచ్యుడగు ఆ'జారు' తాను పూర్వరోమక సామ్రాజ్యపు వారసుననుకొనెను ఆమహాయుద్ధమునకు కొన్ని యేండ్లముందే, 'జారు రీవిపూర్తిగా జెడినట్లు సూచన లగుపించెను. రాజసభ యంతయు 'రాస్‌పుటీన్' అను ఒక వంచకసన్యాసి యధీనమ య్యెను, సైనిక రాజకీయపాలన పద్ధతియంతయు శిథిలమై, దుర్నీతిమయమై యుండెను యుద్ధారంభమున రష్యాలో నొక్కసారి జాతీయోత్సాహము వెలిగి, నిర్బంధమహాసేన పోగుచేయబడెను, కాని తగుయుద్ధసామగ్రి సమర్థులగు ఉద్యో గులు లేకయే, ఆనిరాధారవాహినులు జర్మను ఆస్ట్రియను సరిహద్దుల యుద్ధరంగమునకు గొనిపోబడెను

యుద్ధారంభమున (1914 సెప్టెంబరుకే) జర్మనీ తూ ర్పుభాగమున రష్యనుసేనలు జర్మనులతో యుద్ధముచేసెను. అందువలన అప్పటికి జర్మనులు పశ్చిమరంగమున ఫ్రాంసుపై జరిపిన ప్రథమజైత్రయాత్ర నిలిచిపోయి జర్మనులదృష్టి తూర్పు వైపు తిరిగెను వేలకొలది రష్యనుభటులాయుద్ధమున చావు ణామరణబాధల నొందిరి, కాని ఆరంభమున ఆతూర్పుయు

ద్ధము లేచినచో, పడమట ఫ్రెంచివారు జర్మనులచే పూర్తిగా నోడియుందురు, అందుచే పశ్చిమయూరపువారందరు ఆరష్యనులకు ఋణవశులైయున్నారు. కాని ఆయసంగతసామ్రాజ్యపు దీనజనులకీయుద్ధభారము దుర్భరమయ్యెను. తగు మందుగుండుఫిరంగులు లేకయే రష్యనుభటులు యుద్ధరంగమున కంపబడి, సమరోన్మత్తులగు సేనానులచే రణాగ్నియందు నోరులేని మృగములవలె ఆహుతిచేయబడిరి. కాని యెట్టివీరులకైనను సహనమునకు మితియుండునుగదా! ఆయనాథసైనికులలో 'జారు' పాలనపద్ధతియందసహ్యాభావము వ్యాపించెను. 1915 అంతమునుండి రష్యానుగూర్చి పశ్చిమపు మిత్రమండలివారాతురులై యుండిరి. 1916 అంతము, రష్యావారాత్మరక్షణలో నుండిరి. జర్మనీతో వారికి ప్రత్యేకసంధి యగునని వదంతికలిగెను.

1916 డిశంబరు 29 తేదీని, రాస్పుటిన్ సన్యాసి రష్యా రాజధానియగు పెట్రోగ్రాడులో నొకవిందులో జంపఁబడెను. 1917 లో మార్చికి పరిస్థితులుమారి, పెట్రోగ్రాడులో ఆహారముకై బీదలు దొమ్మిచేసిరి, అది మహావిప్లవముగ పరిణమించెను. ప్రజాప్రతినిధి సభయగు 'డ్యూమా' ను అణచివేసి, విప్లవపక్షనాయకుల బట్టుకొనుటకు యత్నముజరిగెను. 'జారు' మార్చి 15 కు రాజ్యము

వదలెను, 'ల్వాఫ్' యువరాజుక్రింద నూతనరాజ్య మేర్ప డెను, మొదట మితము నియమబద్ధము అగు క్రాంతితో స్థిమితమగు రాజ్యము సాధ్యమగునట్లుండెను కాని రష్యా లో ప్రజలకు ఆరాజత్వమందును విశ్వాసము పూర్తిగా నశిం చుటచే, అట్టిసరుదుబాట్లు వీలుకాలేదు యూరపులోని ప్రాచీన సంప్రదాయపు 'జారు' లు, యుద్ధములు, రష్యనుల కసహ్యముగ తోచెను అందలి దుస్సహాబాధలనుండి రష్యనులు శీఘ్రవిముక్తిగోరిరి రష్యాలో నిజమైన పరిస్థితుల మిత్రమండలివారు గ్రహింపలేరైరి అచ్చటిమిత్రమండలి ప్రతినిధులు రష్యాలో రాజాస్థానమునకే అలవాటుపడిరి, వారికి రష్యను భాషాజ్ఞానము లేదు, వారు ప్రజాభిప్రాయ ము గ్రహింపలేకపోయిరి, వారికి ప్రజాతంత్ర రాజ్యమన్న అయిష్టము, వారునూతన ప్రభుత్వముకు చిక్కులు గల్గింప జొచ్చిరి ఆ రిపబ్లికు అధ్యక్షుడగు 'కెరన్స్కీ' వక్త, సుము ఖుడు, ఐనను స్వదేశమున సాంఘిక విప్లవమును, బయట మిత్రరాజ్యముల వైముఖ్యముగల్గి అతనిస్థితి క్లిష్టమై పోయెను అతడు తనప్రజలకు సాగుకు వలయు భూమినిచ్చి, రష్యాకు శాంతిగల్గింప యత్నించెను, కాని యందులకు ఈమిత్రమండలి వారంగీకరింపలేదు ఫ్రెంచి బ్రిటిషుపత్రి కలు, ఆయాసపడియున్న రష్యావారు తిరుగ దాడివెడలవలె

వని, వేపుకతినిరి కాని యింతలో జర్మనులు భూమిపైనను సముద్రముపైనను రష్యనుల రేవుపట్టణమగు రైగాను తీవ్రముగ ముట్టడింపగా, రష్యాకు సాయముగ బ్రిటిషు నౌకాదళమువారు బాల్టికు సముద్రములోనికి దాడిసైన జరుపరైరి ఆ క్రొత్తరష్యా రిపబ్లికువారొంటిగ పోరవలసివచ్చెను బ్రిటిషు నౌకాదళనాయకుడగు ఫిషరుప్రభువు (1841-1920) తీవ్రముగ వాదించుచున్నను, సముద్రముపై సర్వాధికారము గల్గియుండియు, బ్రిటిషువారును వారిమిత్రులును (జలాంతర్గాములతో నీటిలోకొంత ముట్టడించుటతప్ప) ఆయుద్ధమంతటను జర్మనులను బాల్టికుసముద్రమున సర్వాధికారులుగా నుండనిచ్చిరి

రష్యనుప్రజలు మాత్రమా యుద్ధము నెట్లైన నంతమొందింప నిశ్చయించిరి పెట్రోగ్రాడులో 'సోవియట్' అను కార్మికయోధుల ప్రతినిధిసభ యొకటి యేర్పడెను, వారు స్వీడనుముఖ్యపట్టణమగు 'స్టాక్హోం' లో సోషలిస్టుల అంతర్జాతీయమహాసభ నొకదానిని సమకూర్పయత్నించిరి అప్పుడు బెర్లినులో ఆహారమునకై దొమ్మి జరుగుచుండెను. ఆస్ట్రియాజర్మనీలలో యుద్ధమన్న చాల విసుగుగా నుండెను 1917 లో, అట్టి సామ్యవాదమహాసభ జరిగియుండినచో, ప్రజానుకూలమగు న్యాయమైన సంధియు జర్మనీలో

రాజ్యపరివర్తనమును కలిగియుండును, ఇది దరిమిలాసంగతు లచే స్పష్టమయ్యెను అట్టిసభ జరుగనిండని తన పశ్చిమ మిత్రులను కెరెన్‌స్కీ ప్రార్థించెను, బ్రిటిషులేబరుపక్షము లో ఎక్కువమంది అందు కామోదించిరి, కాని అట్లగుచో ప్రపంచమంతటను సాంఘికవిప్లవము కలుగునని భీతులై, మిత్రమండలివారు దానిని నిషేధించిరి ఇట్లు వారివల్ల ప్రత్యక్షముగాను నైతికముగాను సహాయములేకయే అనిర్భా గ్యపు మితవాది రష్యను రిపబ్లికువారు అట్లే పోరుచు 1917 జూలై నెలలో, మొండిధైర్యముతో జర్మను ఆస్ట్రియాలపై తమ తుదిదండయాత్ర నారంభించిరి మొదట కొంచెము జయించినను, తరువాత ఆ రష్యనుసైనికులోడి సర్వనాశ మొందిరి.

అంతటితో రష్యనలు నిరాశులైరి, రష్యనుసైనికులు, ముఖ్యముగా ఉత్తరప్రాంతమున, తిరుగబడిరి 1917 నవంబరు 7 వ తేదీని, కెరెన్‌స్కీప్రభుత్వ మంతమొందెను అధికారము సోవియటుల హస్తగతమాయెను వీరి నాయకుడు 'లెనిను' కిఅంతట పశ్చిమప్రభుత్వములతో నిమిత్తములేకుండ, రష్యా జర్మనీలు రాజీపడి, 'బ్రెస్టలిటో విస్క్' యొద్ద 1918 మార్చి 2 వ తేదీని సంధి జేసికొనిరి

వెనుకటి వాచాలరాజ్యాంగపువారితోను, 'కరెన్‌స్కీ' బోలు మితవాదివిప్లవకారులతోను, లెనినుగారి ఈ 'బాల్షివికు' పక్షముకు సంబంధములేదు వీరు 'మార్క్సు' సిద్ధాంత మనుసరించు కమ్యూనిస్టులు, అనగా వీరు సంపూర్ణప్రజా స్వామ్యవాదులు, తాము రష్యాలో అధికారము వహించిన వెంటనే, ప్రపంచమంతటను సాంఘికపరివర్తనము కలుగునని నమ్మి, వారు పూర్ణవిశ్వాసముతో, ఎట్టిఅనుభవములేకయే, ఆర్థికసాంఘిక పరిస్థితులన్నిటిని తలకిందు చేయదొడగిరి ఈ యద్భుతనూతనపద్ధతికి సహాయముజేయదగునను జ్ఞాన ము, సానుభూతి, సామర్థ్యము కూడ, పశ్చిమయూరపు ప్రభు త్వములకును అమెరికనుప్రభుత్వమునకును లేకపోయెను అచ్చటి పత్రికలు అధికారులు ఈ బాల్షివిక్కులను దూషిం చి, రూపుమాపనమకట్టిరి, అందుచే తమదేశములకును రష్యాకును ఎంతనష్టము కలిగిననుసరే ! ప్రపంచపత్రిక లన్నియు వట్టిఅబద్ధములగల్పించి, బాల్షివిక్కులపైన లేని పోనియపవాదల వ్యాపింపజేసెను, బాల్షివికునాయకులు నమ్మ రాని రాక్షసులని, దోపిడి రక్తపాతములలో మునిగి తేలు చుందురని, విషయలోలురని, వీరితో బోల్చుచో 'రాస్పు టీను' అధికారపు 'జారు' ఆస్థానమే అతి పరిశుద్ధముగ నెంచ వచ్చునని జెప్పదొడగిరి ఈక్రాంతదేశముపైన దాడు

లారంభించిరి, రష్యాలో తిరుగుబాటుదారులకు వీరు ప్రోత్సాహము సహాయము నిచ్చిరి బాల్షివిక్కులవలని భయముచే, వారి శత్రువు లెట్టి యసహ్యాదూషణకైన వెనుదీయరైరి అయిదేండ్లు తీవ్రయుద్ధముచే నలసి కల్లోలములో నున్న రష్యాదేశము పాలించు ఆ బాల్షివిక్కులతో, 1919 లో ఆదేశపు ఉత్తరప్రాంతపు ఆర్కేంజలుయొద్ద బ్రిటిషుసేన, తూర్పు సైబీరియాలో జపానీయులు, దక్షిణమున ఫ్రెంచి గ్రీకుసేనల సహాయముతో వచ్చిన 'రుమేనియను'లు, 'సైబీరియా'లో 'కాల్చెక్' అను నౌకాధిపతి, క్రిమియాలో ఫ్రెంచినౌకాదళపు మద్దతుతో వచ్చిన 'డెన్కిను' సేనాని, యుద్ధము సాగించిరి ఆ సంవత్సరము జూలైలో, 'యూడెనిచ్' సేనాని నాయకత్వమున 'ఎస్తోనియను'ల సేన రష్యా ముఖ్యనగరమగు పీటర్సుబర్గు'ను సమీపించెను 1920 లో, ఫ్రెంచివారి ప్రోద్బలమున, పోలులు రష్యాను క్రొత్తగా ముట్టడించిరి మరియు డెనికిను సేనానికి బదు లోకక్రొత్త దండయాత్రికుడగు (రష్యను) 'రాంగెల్' సేనాని తన స్వదేశముపై తిరుగబడి దాడిసల్పి, నష్టము గల్పించుచుండెను 1921 మార్చిలో, క్రాన్‌స్టాటుయొద్ద నావికులు తిరుగుబాటొనర్చిరి కాని, తమ అధ్యక్షుడగు లెనిను నవ్యనాయకత్వమున రష్యాపాలకు లీముట్టడుల నన్నిటి నెదుర్కొని

యూపగల్గిరి ఎన్నికష్టములు గల్గినను అద్భుత శౌర్యసాహసములతో రష్యనుప్రజ లీతీవ్రబాధల నోర్చి, జంకులేక తమ ప్రజాతంత్రరాజ్యము నిలువబెట్టిరి 1921 అంతమునకు, బ్రిటిషువారును ఇటలీయు రష్యనులకమ్యూనిష్టు రాజ్యము నొక విధముగా నంగీకరించిరి

ఇట్లు ఈక్రొత్త బొల్షివిక ప్రభుత్వమువా రన్యదేశముల దాడిని, స్వదేశములోని తిరుగుబాట్లను, ఎదుర్కొని జయించిరి, కాని వారు రష్యాలో కమ్యూనిష్టుభావములతో నూతనసాంఘికపద్ధతి నేర్పరచుటలో తగు జయ మొందలేదు రష్యనురైతు భూమి హక్కుకై ఆశపడును తిమింగిల మెగురుట యెంతకష్టమో, అతడు కమ్యూనిష్టు భావము లంగీకరించుట అంతకష్టము రష్యను క్రాంతిచే పూర్వపు జమీందారుల భూమి అతనికి లభించెను కాని ఆ విప్లవముచే సొమ్మునకు కిమ్మతు పోయెను, తాము పండించుపంట ధరలేక తమకు నిరుపయోగ మయ్యెను యుద్ధ బాధచే రైలుమార్గములు చెడిపోయె, ఇదివరకే పాడైన వ్యవసాయపు పంటలింకను క్షీణించి, ప్రజలు తమ తిండికిమాత్రమే పండించుకొనిరి, పట్టణముల కాహారము లేకుండెను కమ్యూనిష్టుభావములపద్ధతిని పారిశ్రామికవస్తువుల జేయుటకు తొందరయత్నముల జేసిరి కాని అవి జయప్రదము

కాలేదు 1920 వ సాలుకు రష్యాలో ఆధునికనాగరికత పూ ర్తిగా విచ్ఛిన్నమై, అపూర్వస్థితి యేర్పడెను రైలుమార్గములు చెడిపోయి, నగరములు పాడుపడి, అంతటను మరణము లధికమయ్యెను కాని ఆదేశీయులు తమపైకివచ్చు శత్రువుల దాడినెదుర్కొనగల్గిరి 1921 లో యుదములచే పాడువడిన ఆగ్నేయదిశాప్రాంతమందు అనావృష్టి, కర్షకులలో మహాక్షామమును, కలిగెను, లక్షలకొలది జనులుచచ్చిరి

రష్యాలో ప్రష్టపరిస్థితులు, వానిని బాగుచేయుపద్ధతి, ప్రస్తుతకాలమునకు సంబంధించినవి, కనుక అసమస్యల నిందు చర్చించుట లేదు

ఈ క్లిష్టస్థితివలన, వారుపునర్నిర్మాణపద్ధతిని కొంత తగ్గింప నిశ్చయించిరి 'నవార్థికవిధాన' మవలంబింపబడెను వ్యక్తులకు స్వంతఆస్తి స్వంతవ్యవహారము ఉండుటకు కొంత అవకాశ మీయబడెను మరల వస్తూత్పత్తి కొంతవరకేర్పడెను రష్యాలో సాంఘికవాదపద్ధతితగ్గి నూరేండ్ల క్రిందటి సంయుక్తరాష్ట్రపు పద్ధతి యేర్పడునట్లు తోచెను అమెరికాలో చిన్నవ్యవసాయదార్లబోలు 'కులకు' లనునంపన్నులగు రయితు లేర్పడిరి, చిన్నస్వతంత్రవర్తకులు వృద్ధియైరి కానిసామ్యవాదులు తమయాదర్శముల పీరీతిని వదలుకొని రష్యా నూరేండ్లకిందటి అమెరికాననుసరించుట కొప్పుకొన

లేదు దేశమును సంఘస్వామ్యపద్ధతికి తెచ్చుటకు వారు 1928 లో దృఢప్రయత్నము లారంభించిరి ప్రభుత్వమే పరిశ్రమల, ముఖ్యముగ లోహాదివస్తువుల, వేగముగ వృద్ధి చేయుటకును, వ్యక్తిరయితులకు బదులు సమిష్టిగనే పెద్దపెద్ద కమతములు సాగుచేయించుటకును, అయిదేండ్ల కార్యక్రమ మునేర్పరచిరి ఈపంచాబ్దపద్ధతి కనేకాతంకములుగల్గెను; జనులింకను విద్యలేని మూఢులు, పనితనముగలశిల్పులు, మేస్త్రీలు తక్కువగనుండిరి, మరియుపాశ్చాత్యదేశీయు లందుకు సహాయముచేయక కేవలము వ్యతిరేకులై యుండిరి. ఐనను, పరిశ్రమల అభివృద్ధిలో కొంతజయము కలిగెను. కొంతనష్టము ఔచిత్యహీనత ఉండెను, కాని నిస్సందేహముగ అభివృద్ధికలిగెను వ్యవసాయవస్తూత్పత్తికై సాహసముతో తొందరగ చేసిన యత్నములు అంతగా ఫలప్రదము కాలేదు 1933—34 సాలు శీతకాలమున ఆహారవస్తువులు తక్కువగనుండెను

మిగిలిన దేశములవారు యథాప్రకారముగ స్వలాభమునిమిత్తము పెట్టుబడిదార్లు చేయు వ్యాపారవృద్ధికే లోబడియుండుచు, రష్యాలో జరుగుచున్న యీవరీక్షను చూచుచు, సందేహాదరములతో మిశ్రితులగుచున్నారు. ఆప్రాచీనపద్ధతివారి పనియు సరిగాలేదు అందలి జనులలో

చాలమంది దరిద్రులై వస్తువులకొనుశక్తిని గోల్పోయినారు, సంఘాభివృద్ధి శీఘ్రముగా అడుగంటుచున్నది, వారికాత్మ విశ్వాసమును క్షీణించుచున్నది 'ప్లానింగు' (= కార్యక్రమ నిర్ణయము) అను శబ్దము లోకమంతటను వ్యాపించినది ముందు అధ్యాయమున చెప్పబోవునట్లు ఆర్థికబాధ లధికమైనవి అంతట 'ప్లానులు' ను హెచ్చుకాజొచ్చినవి 1933 నాటికి ఆత్మగౌరవముగల ప్రతిరాజ్యాంగ వేత్తయు ఒక ప్లాను సిద్ధపర్చెను ఈరీతిగనైనను లోకులందరు రష్యాను గౌరవించిరి *

---

* ఈసామ్యసంఘసిద్ధాంతమునకు ప్రారంభకుడగు 'కార్లుమార్క్సు' అను అర్థశాస్త్రజ్ఞుడు 1818 లో జర్మనీలో జనించెను, 1842 నుండి జర్మనీ ఫ్రాంసు ఇంగ్లండులలో వసించి అందుండి తన తీవ్రసామ్యవాద సిద్ధాంతములను బోధించెను, అతడు తనసిద్ధాంతములగూర్చి విపులగ్రంథము రచించి, 1883 లో చనిపోయెను 'లెనిను' బోల్షివికు రష్యాకు మొదటిఅధ్యక్షుడై, రష్యాలో మార్క్సుసిద్ధాంతముల నమలులో బెట్టెను

బోల్షివికుపాలనను చర్చించు సందర్భమున జారుపాలననాటి పరిస్థితికిని ఈనాటిసోవియటు రష్యాపరిస్థితికిని గలభేదమును గమనించవలెను

1918 లో ఈమహాక్రాంతి ఆరంభించునప్పటికి రష్యాలోని సామ్రాజ్యప్రజలు అత్యంతదుర్దశలో నుండిరి నిరంకుశుడగు జారును ప్రభువులును కొందరు శ్రీమంతులును స్వార్థాధికారులై సర్వసుఖము లొంది యుండిరి, సామాన్యజనులు పాలనలో ప్రాబల్యమేమియు లేకుండిరి, వారిలో నూటికి 70 మంది నిరక్షరులై యుండిరి చాలమందికివృత్తి

శేను తినుట కాహారములేను, సామాన్యజనులకు తగు వైద్యవసతులు లేవు మరణములు హెచ్చు, ప్రజ లర్ధనాగరికులు, అంతర్విభేదములు కలహములుహెచ్చు ఆస్థితియున్న దేశమును ఈ 15 ఏండ్లు బొల్షివిక్కులు పాలించిరి, ఇప్పుడు నూటికి 90 మంది రష్యనులు విద్యావంతులైరి, (నూరేండ్లపైనుండి సమర్థమగు ఆంగ్లప్రభుత్వము సర్వాధికారముతో పాలించుచున్న మనదేశమందిప్పుడు నూటికి 8 మాత్రమే చదువగలరు) రమారమి అన్ని పాశ్చాత్య దేశములలోను ఇప్పుడు సుమారు నూటికి పది మంది వృత్తిహీనులున్నారు, వారికి వృత్తులగల్పించుట ఆయాప్రభుత్వములకు మహాసమస్యయైనది రష్యాలో ఇప్పుడందరికి వృత్తులు, ఆహారముల యేర్పాటులును కలవు ప్రతివానికి రష్యాప్రభుత్వము పనికనబరచు బాధ్యతవహించును (భారతదేశమందు చాలమంది నిరుద్యోగులు అట్టివారికి పనిగాని సరిగా పోషణగాని ఆహారముగాని లేదు ప్రస్తుతస్థిలో ఈదేశమందు అందుకుతగినంత అవకాశమును కల్పింపదు ఆంగ్లదేశమున నిరుద్యోగులకు ప్రభుత్వమే వృత్తినో పోషణకు ద్రవ్యమునో ఇత్తురు, ప్రజల బిచ్చమెత్తనీయరు భారతదేశమున అట్టియేర్పాటులు లేవు. భిక్షాటనమునకుమాత్రము సంపూర్ణ స్వాతంత్ర్యముకలదు) రష్యాలో బీదలకుచితముగ సినీమాసంగీతాదుల గూడ ప్రభుత్వమువా రేర్పర్చిరి అచ్చట ధనికులకు బీదలకు విశేషభేదములేదు అందరు పనిచేయుటలో ప్రభుత్వాధికారములో, గౌరవములోను సమానులే, బీదలసౌకర్యమే ముందుగా గమనింపబడును అందుకొన్ని పొరబాట్లు, పైనచెప్పినచిక్కులును కల్గెను కాని, పనికొంతవరకు జయప్రదముగనే ఉన్నది క్రమముగ వస్తువుల ఉత్పత్తి హెచ్చినది, ఇతరదేశములకుగూడ సరుకు లెగుమతియగుటచే, ఆపోటీకి పాశ్చాత్యులుగూడ భయపడుచున్నారు క్రమముగా రష్యనులు పంటలను పరిశ్రమలనుకూడ వేగముగా వృద్ధిచేసికొనుచు, పరా

ధీనత లేకుండ నిత్యావసరవస్తువులను స్వదేశమందే యుక్తితో సంపాదించుచు, పునర్నిర్మాణము చేయుచున్నారు ఈ విద్యావ్యాప్తిలో విజ్ఞానపరిశోధనలలో, విమానాదియుద్ధబలమునగూడ, రష్యనులభివృద్ధిలో నున్నారు, వెనుకటివలె తృణీకరింపక ఇంగ్లండు ఫ్రాంసు మొదలగు ప్రముఖదేశముల పాలకులును రష్యా నిపుడు గౌరవించుచున్నారు జాతిసమితివారిటీవల రష్యానాహ్వానించి తమలో జేర్చుకొనిరి రష్యాతో ఫ్రెంచివారు 1935 లో మిత్రసంధి చేసికొనిరి

సంఘస్వామ్యపద్ధతి రష్యను గ్రామీణులకెంతమాత్రము సరిపడదనుట సరియేనా? తత్వమున రష్యనులు చాలవరకు ప్రాచ్యులు చరిత్రాదినుండి పాశ్చాత్యులలో ఆస్తివ్యక్తిగతమే అని భావించినను, ప్రాచ్యదేశములందును అనాదిగా అట్లే యుండెనా? (59 వ అధ్యాయములో వెల్సుగారి భావముల జూడుడు) మనదేశమందు మొదట భూమ్యాది స్థిరాస్తులు సంఘగతములే గాని వ్యక్తిగతములు కావనుట కాధారములవు వేదకాలమున ఆస్తిసంఘగతమని కనబడును, వ్యక్తుల ఆస్తిహక్కుల సూచనతక్కువ తరువాత స్మృతులలోగూడ స్థిరాస్తిసంఘగతమని, వ్యక్తులకు కుటుంబయజమానియగు తండ్రికిగూడ స్థిరాస్తిని ఇతరులకిచ్చు హక్కు లేదని, సూచించబడినది ఇదియే అసలు సమిష్టికుటుంబపద్ధతి అని చెప్పబడుచున్నది (ఉ॥ 'స్థావరం ద్విపదం చైవ యద్యపి స్వయమార్జితం, అసంభూయ సుతాన్ సర్వాన్ నదానం నచవిక్రయః, )

'యేజాతా యేప్యజాతాశ్చ యే చగర్భేవ్యవస్థితాః ।
వృత్తిం తేప్యభికాంక్షంతి వృత్తిలోపో విగర్హితః,
'అవిభక్తావిభక్తావా సపిండాః స్థావరేసమాః'
(విష్ణుమనువచనములు, మితాక్షరలో నుదహరించబడినవి )

ప్రాచీనకాలమున మనదేశమున కుటుంబము విభక్తమగుట అరుదు అందుచే సమిష్టికుటుంబము చాలపెద్దదై, తరుచు సపిండులందరు ఏకముగ ఒకేగ్రామమున ఉండుచుండిరి (సపిండశబ్దపు అసలు అర్థము సమిష్టి క్షేత్రభూమి (పిండము ఇచ్చునది) కలవారని 'సమానోదక' అనగా ఒకేజలాశయాధారము కలవారని, దరిమిలాను ఆశబ్దములను తర్పణపిండ ములతో సంబంధము కల్గింపబడెనని, కొందరు విజ్ఞుల అభిప్రాయము) చారిత్రిక కాలమున మనదేశమునగూడ పరిస్థితులుమారుచు, క్రమముగా మొదట చరమందు, తరువాత స్వార్జితమందు వ్యక్తులప్రత్యేకపుహక్కు-లేర్పడి, అంతట విభాగమును క్రియాములద్వారాను అస్తిహక్కులు కల్గుటకు సౌకర్యము చేయబడి, ఆప్రకారము దరమిలా ధర్మశాస్త్రములలో నిబంధనలు చేర్చబడినట్లు తోచును చివరకు 12 వ శతాబ్దమున విజ్ఞానేశ్వరుడు 'మితాక్షరి' లో స్వత్వస్వభావమును చర్చించి వ్యక్తుల లౌకిక స్వత్వపద్ధతిని చమత్కారముగ సాధించి, విభాగాదులకు నిబంధనల విశాలముజేసెను 14 వ శతాబ్దపు జీమూతవాహనుని (దాయభాగగ్రంథము) చే వ్యక్తుల ప్రత్యేకపు హక్కులింకను హెచ్చుచేయబడెను ప్రాచీన కాలమున మనదేశమందు ప్రతిగ్రామపు ఆస్తులు మొదలగునవి ఆయా గ్రామపంచాయతీల పాలనమందుండెను అందుచే సమిష్టి హక్కు, సంఘస్వామ్యము, వారికి క్రొత్తకాదనితోచును నేడు అది రష్యాలో జయప్రదమగుటలో ఆశ్చర్యములేదు

కాని రష్యాలో జరుగుచున్న సోవియటుపద్ధతిలో అనేకలోపములును కలవు మహాయంత్రప్రకోపము, ఆయుధబలవృద్ధి, హింసాతత్వము కేంద్రప్రభుత్వపు సర్వాధికారము, ఇట్టి అనర్థకలోపములు ఇతర పాశ్చాత్య రాజ్యములతోబాటు బొల్షివిక రాజ్యమున గూడ కలవు రష్యాలోను యాంత్రికప్రకోపపు అనర్థములు కొంతవరకు కనబడుచున్నవి

ఇతరజాతులతో సంఘర్షము అవిశ్వాసము హెచ్చుచున్నది హింసా బలముతో ప్రజాధికారము సాధించినను ఆ హింసాతత్వము సంఘము లోను పాలకులలోను రూఢమై ఎప్పటికైనను హానిగల్గించునను గాంధి మహాత్మునిసూక్తికి నేడు రష్యాలో నిదర్శనములు కనబడుచున్నవి ప్రజాస్వామ్యవాదులలోనే కక్షలేర్పడినవి ప్రస్తుతాధ్యక్షుడగు స్టాలిను పైన కుట్రలేర్పడి సంగ్రహావిచారణ జరిగి, చాలమంది మరణదండనల పాలగుచున్నారు

---

## 67 ప్రపంచపు సాంఘిక రాజకీయ పునర్నిర్మాణము.

ఈగ్రంథపుమితినిబట్టి, యుద్ధానంతరపు 'వర్సైల్సు' సంధి మొదలగు సంధులతీవ్రచర్చలోనికి దిగుటకువీలులేదు ఆమహాభయంకర సంగ్రామపుఫలితముగ దేనికిని ఆది అంతము సమాఖ్య కలుగలేదని, ఇప్పుడు మనకు బోధపడుచున్నది ఆయుద్ధముచే లక్షలకొలదిప్రజలు హతులైరి, ప్రపంచము బాధలపాలై, దారిద్రస్థితికివచ్చినది, రష్యాకు పెద్దదెబ్బతగిలెను ఈవిశ్వ మపాయకరము నిర్దాక్షిణ్యము అని, ఇందు మన మొకపద్ధతి దూరదృష్టిలేక తెలివితక్కువగా యల్లాడుచు జీవించుచుంటిమని, ఆభయానకయుద్ధముచే మనకు జ్ఞప్తికలిగినది మానవజాతి కనర్థముగల్గించిన జాతీయాహంకారములును సామ్రాజ్యదురాశలును మాత్రము ఈయుద్ధముచే నశింపలేదు, ఈయుద్ధపుశ్రమ అలసట తీరగానే, ప్రపంచమున నిట్టియనర్థము తిరుగ గల్గించుటకవి సిద్ధముగనేయున్నవి. యుద్ధములవల్లను, విప్లవములవల్లను, లాభములేదు, పూర్వకాలపుసంస్థల అడ్డములను మోటుగ తొలగించుటకుమాత్రమే యుద్ధ ముపయోగించును గత మహాయుద్ధముచే యూరపునకు జర్మనుసామ్రాజ్యతత్వపుబాధ పోయెను, రష్యాలో సామ్రాజ్యతత్వము నశించినది, అనేక రాజవంశములు పదభ్రష్టములైనవి కాని యూరపులో నింకను అనేక నిరం

కుశ రాజ్యములపతాకము లెగురుచునే ఉన్నవి, సరిహద్దుల పేచీలు కోపకారణములగుచునే ఉన్నవి, మహాసేనలు నూత్నసామగ్రులబ్రోగుచేసుకొనుచున్నవి వర్సైల్సు సంధిసభలో ఆయుద్ధపుసంఘర్షపరాజయములబట్టి వారివారి స్వభావములకు తగిన పర్యవసానము కల్గెను జర్మను, ఆస్ట్రియను, తురుష్క, బల్గేరియనులను, ఆసభాచర్చకు పాల్గొనుటకు రానీయనేలేదు వారాసభవారి తీర్మానములమాత్రమంగీకరింపవలసివచ్చెను లోకక్షేమకాంక్షుల కాసమావేశపుస్థానమే అసంతృప్తికరము, అక్కడనే 1871 లో విజయగర్వముతో జర్మను సామ్రాజ్యము ప్రకటింపబడెను, పారిసులోని ఆఅద్దాలభవనమందే ఆస్థితిని 1918 లో తలక్రిందుజేయు రంగమేర్పడెను, అట్టిసూచన సమ్మోహాకరము

ఈమహాయుద్ధపు ప్రారంభదశలో కొంచముగ దాక్షిణ్యభావముండినను, అది త్వరలోనే నశించెను విజేతలు తమతమ దేశములకైన కష్టనష్టములనె గమనించిరిగాని, ఓడిపోయినవారిస్థితియు చెడిపోయినదనుసంగతి గమనించలేదు, యూరపులోని జాతీయాహంభావముల పోటీలవల్లను, ఈశక్తులలో సామరస్యము గల్గించునదిలేకయు, మహాయుద్ధము కలిగెను చిన్న చిన్న పరదేశములందు స్వతంత్రాధికారముగల జాతు లతిపరిబలసేనలతో నుండుచో, యుద్ధము

తప్పకకలుగును వెనుకకల్గినరీతినే గాకున్నను, మరియే రీతినైనను, అప్పుడు మహాయుద్ధము కల్గియేయుండును రాజకీయసామరస్యము గల్గించిననే ఆప్రవృత్తుల నరికట్టవచ్చు, లేనిచో, తిరుగ నిరువదిముప్పదేండ్లలో నింతకన్న భీభత్సకరమగు యుద్ధమువచ్చితీరును పెట్టలు గుడ్లుపెట్టునట్లే, యుద్ధసన్నద్ధమగు రాజ్యముల యుద్ధములు జేయుచునే యుండును యుద్ధమునఅలసి బాధితులైన వారాసత్యమును మరచిరి, ఆనష్టమంతటికి ఓడినజాతులవారే ప్రత్యక్షముగాను నైతికముగాను బాధ్యులనియెంచిరి ఆయుద్ధఫలితము వేరైనచో, అప్పుడు వారును తమ విరోధిజాతులనట్లే యెంచి యుందురు, జర్మనులదే తప్పని, ఫ్రెంచి యింగ్లీషువారలు తలంచిరి రష్యనులు ఇంగ్లీషువారు ఫ్రెంచివారు దోషులని, జర్మనులు తలచిరి ఆ చిన్నచిన్నరాజ్యముల నిర్మాణము చేయుటలోనే లోపమున్నది, ఆసంగతిని కొద్దిమందిధీరులే గ్రహించిరి కసిదీరుటకును శిక్షార్థముగను, పరాజితులనుండి విపరీతమగు సొమ్మును నష్టపరిహారముగ రాబట్టుట కాసంధిలో నిర్ణయించిరి విజేతలకు తగు నష్టపరిహారమిప్పించుటకై దివాలాలోనున్న పరాజితజాతులపైన దుర్భరమగు ఋణభారము మోపిరి అంతర్జాతీయపరిస్థితుల జక్కబెట్టి యుద్ధము నివారింపనేర్పరిచిన నానాజాతిసమితికి అందుకు తగు సమర్థతయు సదుద్దేశమునుగూడ లేకుండెను

యూరపువారే యైనచో, శాశ్వతశాంతిస్థాపనకును, అంతర్జాతీయవ్యవహారముల చక్కబెట్టుటకును, ప్రయత్న మేల సల్పకుందురేమో, నానాజాతిసమితిపద్ధతిని అమెరికాలోని సంయుక్తదేశాధ్యక్షుడగు 'డాక్టరు విల్సను' తెచ్చిపెట్టెను కనుక దాని మూలాధారము అమెరికా అధ్యక్షుడే, అమెరికాలో యూరపువారు కలుగజేసికొనకుండ మన్రోసిద్ధాంత మేర్పరుచుటతప్ప, వారికి ఈపూర్వ ప్రపంచవిషయములం దెట్టిభావములును లేవు హఠాత్తుగా ఇప్పటి మహాసమస్యను పరిష్కరించుట కమెరికనులు కోరబడిరి కాని వారట్లు చేయజాలరైరి, వారు ప్రపంచమున శాశ్వతశాంతిగోరిరి, కాని, మన యీపూర్వప్రపంచపు రాజకీయములపైన వారికి నమ్మికలేదు, దీని నుండి తప్పించుకొనుటకే వారు యత్నించుచుండిరి, ప్రపంచక్లేశముల పరిష్కారము నాలోచించుటకు అమెరికా ఆరంభించునప్పటికే, జర్మనుల జలాంతర్గామియుద్ధముచే వీరుగూడ జర్మనులకు శత్రువులై, మిత్రమండలిలో జేరిరి ప్రపంచసమస్యకు విల్సనుగారు పరిష్కారముగ 'నానాజాతిసమితి' నేర్పర్చిరి అమెరికనులు దీనిని నిదానము లేకుండనేచేసిరి, అది అయుక్తము, ప్రమాదకరముగూడఅయ్యెను యూరపువారు అది అమెరికనుల సమాలోచిత నిర్ణయమనితలచిరి 1918-19 లలో,

సామాన్యజనులందరు యుద్ధముతో మిక్కిలివిసుగుజెంది, ఎంతనష్టము గల్గినను, మరల యుద్ధము రాకుండ జేయుట కాతురులై యుండిరి కాని, అందుకై తమ తమ సంపూర్ణ స్వాతంత్ర్యముతో నెంతమాత్రమును వదలు టకు, ఈ ప్రాచీన ప్రపంచరాష్ట్రములలో నొక్కటియైన నిష్టపడలేదు రాజ్యాధికారులతో నిమిత్తములేకుండ ప్రపంచ జాతిసమితి నేర్పరుచుముందు, విల్సను అధ్యక్షుడు ఇచ్చిన బహిరంగోపన్యాసములకు ప్రపంచజనులు సంతుష్టులైరి, అది అమెరికావారి నిశ్చితోద్దేశమని యెంచి, లోకు లంగీ కరించిరి కాని విల్సను ప్రజలనుగాక రాజ్యముల నెదుర్కొన వలసివచ్చెను అతనిదృష్టి ఉదారమే, కాని పరీక్షించినచో, అది మితమై అహంభావయుతమైయుండెను అతడు కల్గించిన అమితోత్సాహము వెంటనే అణగిపోయి నశించెను

డాక్టరు డిల్లను 'పీస్ కాన్ఫరెన్స్' అను తనగ్రంథ మున నిల్లు వ్రాసెను "(అమెరికా) ప్రెసిడెంటు వచ్చునప్ప టికి, యూరపు కుండలుచేయు కులాలునికై సిద్ధముగా నున్న మట్టివలె నుండెను ఇకముందు యుద్ధములు ముట్ట డులు లేకుండ గమ్యస్థానము చేర్పగల మార్గదర్శకునికై ఆజాతులన్నియు ఆతురులై, విల్సనే అట్టివాడని భావించిరి. ప్రేరించివారతనికి భక్తిప్రేమలతో వినమ్రులైరి, అతను

రాగనే ఆనందబాష్పములు రాల్చితి మనియు, ఆతని యుదారాశయముల నీడేర్చుటకు అగ్నిపరీక్షకు గూడ తమ సహచరులు సిద్ధమనియు, పారిసులోని కార్మికనాయకులు నాతో ననిరి. ఇటలీలోని పనివాండ్రు కాతనిపేరు భూమిపై నవజీవ మీయగల దేవవాణిగ దోచెను, జర్మను లాతని సిద్ధాంతములు తమరక్షణ కాధారముగా నెంచుకొనిరి, విల్సను వారికి తీవ్రశిక్ష విధించినను, వారు మారుమాటాడక అంగీకరించి, వెంటనే కార్యపరులగుదురని నిర్భీకుడగు హెర్ మ్యూల్లను చెప్పెను. జర్మను ఆస్ట్రియాలో, అతడు రక్షకుడని కీర్తిగలిగి, అతనిపేరు చెప్పగనే వ్యధ తొలగినట్లుండెను"

విల్సను ఇట్టి అత్యాశల గలిగించెను ఇవియన్నియు వ్యర్థాశలై, అతడు నిర్మించినజాతిసమితి బలహీనమై, నిరుపయోగమైపోయెను, ఆదీర్ఘశోకకధ నిట వివరింప వీలులేదు మనుష్యులలోవ మతనియందు విస్తరించెను ఆ మహాశయముల నెరవేర్పదగు శక్తి అతనికి లేదు ఆతని కార్యముల నమెరికనులే నిరాకరించిరి, అత డేర్పరిచి యూరపు ఒప్పుకొనిన జాతిసమితిలో అమెరికాయే చేరలేదు తాము సిద్ధముగాలేని విషయములోనికి తమ్ము లాగిరని, అమెరికనులు తలచిరి ఇట్లా జాతిసమితి అకాలజననమొందె, అప్పుడే అంగ

హీనమయ్యేను, దాని నిర్మాణపద్ధతిమాత్రము పెద్దది, కాని, దాని అధికారము సంకుచితము, అది అంతర్జాతీయవ్యవహారముల పరిష్కారముల కాటంకమునే కల్గించెను జాతి సమితి లేకుండిననే బాగుండును, కాని ఆపద్ధతివలనై జనల కమితోత్సాహము కల్గుటయు, (ప్రభుత్వములుకాక,) ప్రజాసామాన్య మిక యుద్ధముల నిరోధించుటకు సిద్ధపడుటయు, చరిత్రమున గమనింపదగినవి ప్రభుత్వములు హ్రస్వదృష్టియుతములై మానవకార్యములందు విభేదముల గల్పించి, దుష్టపాలన జేయుచున్నవి, కాని లోకము నైక్యము క్రమపద్ధతి కలుగవలెనని జనులలో తీవ్రాభిలాష కలుగుచున్నది

కాని యీయుద్యమ మాచరణలోనికి రాకుండ ఆటంకము లేర్పడుచున్నవి వర్సెల్సు సంధి కేవలరాజకీయ సంధి, జాతిసమితియు రాజకీయసంఘమే ఇప్పుడున్న ప్రభుత్వములు, ఈరాజ్యాంగభావములు తప్పనివి స్థిరములు అను భావముతోనే లోకవ్యవహారముల సరుదుబాటుచేయుట కాసంధిసమితులద్వారా ప్రయత్నించిరి అందిలోపమున్నట్లు క్రమముగా విస్పష్టమగుచున్నది ప్రభుత్వములు రాజ్యములు స్థిరములుకావు నరుల అవసరములలో కలుగు మార్పులబట్టి ప్రభుత్వరాజ్యములు మార్పవచ్చును, అట్లు మార్చవలెను వీనికన్న ఆర్థికసమస్యలు చాల యెక్కువ

ముఖ్యములు, అవి ఆస్తినిగూర్చి చర్యలగూర్చి మనభావములబట్టి ఏర్పడును, ఈభావములు విద్యచే నేర్పడవలెను అందుచే జనుల మనస్సుల భావములు పద్ధతులు ఏరీతిలో నుండి కార్యరూపమొందునో, అట్లే నరులవ్యవహారపద్ధతియు నేర్పడును కనుక, ఆర్థిక సాంఘికబాధల దొలగించుటకు, జనుల అపోహాలను భావముల గూర్చిన అపార్థములను పోగొట్టుటయే ప్రత్యక్షసాధనము 1918 మొదలు 1933 వరకు ప్రపంచసభలు జరుగుచువచ్చినవి * అందు లోకవ్యవహారముల పరిష్కారముకు మందముగను అవకతవకగను యత్నములుజరిగినవి ఇంతవరకున్న జాతీయ రాజకీయ దృష్టి క్రమముగా మారుచు, ఆర్థిక ద్రవ్యవిషయములందు భూజనులందరిక్షేమము నొక్కుటయును భావమీపమావేశము లందు కొందరు తెలిపినారు కాని రాజకీయకార్యపరులు సంఘకార్యనిరతులు, పత్రికాసంపాదకులుగూడ, నూత్న భావముల నిష్టములేకుండ మందముగనే గ్రహింతురు ఈలోగా, ఆర్థికజీవనమల్లకల్లోలమై, శతాబ్దమునుండి లేచి దరిద్రిత నిరుద్యోగము ప్రపంచము నావహించినవి, నరజాతి

* వెల్సుగారి మూలగ్రంథపుచివర ముద్రణము 1934 లో జరిగినది అందుచె 1933 వరకు అని అందు వ్రాయబడినది, తరువాత 1934 నుండి దరిమిలాను ఇట్టిసభలు జరుగుచు నేవచ్చినవి ఫలితమెప్పటియట్లే

జీవశక్తి చెడుచున్నది సంఘపుభద్రతకు భంగమువాటిల్లు చున్నది నేరములు హెచ్చినవి రాజకీయ జీవితమునకు స్థైర్యముతప్పినది ఈబాధలగూర్చి ఇందువివరముగ జర్చించుటలేదు ఇవినాగరికత భగ్నము కానున్నదనుటకు సూచనలు కావచ్చును, కాకపోవచ్చును ఇప్పుడట్టిభంగ మేమియు లేదు మానవకథలో నంత యుత్సాహకరముగ 19 వ శతాబ్దిలో కలిగిన ప్రగతియుతాభివృద్ధిని మరల నందుకొనుటకు తగు నైతికబలము, నేతృత్వము, దీక్ష, మన మానవజాతికి కలదో లేదో, ఇప్పుడు నిశ్చయించుట యసాధ్యము

గత మహాయుద్ధపు జననష్టము మహానర్థము అంతరించవలెనన్న, మానవజాతి చాలవరకు పునర్నిర్మితముగావలెనని క్రమముగా స్పష్టమైనది జాతిసమితివంటి తొందరసమితి, ఆయాప్రభుత్వముల మధ్య సభల ఆతుకులపురాణములు, ప్రస్తుత క్లిష్టసమస్యల బరిష్కరింపలేవు, అవి అన్నిటిని పరిష్కరించినట్లున్నను, అందేమియు తెలదు మానవులఅన్యోన్య సంబంధముల విజ్ఞానమింకను బాల్యావస్థలోనే యున్నది విద్యను విజ్ఞానమును క్రమపద్ధతి నభివృద్ధిచేసి, వాటిని మానవజీవితమునకు వర్తింప జేయవలెను పురాతనము సంకుచితము నిర్జీవము నాశశీలమునగు నైతిక రాజకీయ భావముల దొలంగించి, అందుకుబదులు మానవజాతి

ఉత్పత్తి భవిష్యత్తులు అందరికి సమానములే అని చక్కగా గ్రహించి, స్పష్టతరము సులభము ఉదారము అగు భావములకు చోటునీయవలెను

ఈరోజులలో మానవు నావరించినన్ని కల్లోలములు అనర్థములు బాధలు ఇదివరకెన్నడును లేవనుసంగతి నిజమే, విజ్ఞానశాస్త్రముచే నరుని కపూర్వమగు మహాశక్తులు గలుగుటే ఇందుకు కారణము, ఆశక్తులను నరుడింకను వశమొనర్చుకోలేదు నిర్భయాలోచన, తీక్ష్ణమగు విశదచ్చర, విమర్శయుతమగు పరిక్రియయుగల ఆవైజ్ఞానికపద్ధతియే నరునకీయద్భుతశక్తుల వశపరచుకొనుట కవకాశము నీయగలదు మానవుడింకను బాల్యావస్థయందే యున్నాడు వానిచిక్కులు వార్ధకనీరసత్వపువి కాక, వృద్ధియగుచున్న అవశమగు శక్తులవై యున్నవి

లోకచరిత్ర మొకే పరిణామపద్ధతియనియు, జ్ఞానశక్తిసాధనకే, జీవులు నిరంతరము కృషిచేయుచు పోరుచుందురనియు, ఈగ్రంథమున సూచింపబడినది, ఈసిద్ధాంతము గ్రహించుచో, ఇప్పటి పురోభివృద్ధి వాంఛను దానియపాయములను సరిగా గమనింతుము మానవుల ఉత్కృష్ట ఘనత ఇంకను ఉదయావస్థలోనే యున్నది కుసుమములకు సూర్యాస్తమయములకు గలశోభను, చిన్నజంతువుల సదా

నమగు గమనపు ఇంపును, వేలకొలది చిత్రరూపముల ప్రకృతి సౌందర్యమును, జీవితమున కెట్టిఆనందము లభ్యమో సూచించును. ఇప్పటి కొన్ని శిల్పకళలు, చిత్రకళావస్తువులు, హృదయరంజక గీతములు, అద్భుతభవనములు, సుందరారామములును గమనించగా, మానవుల ఇచ్ఛాశక్తితో అనుకూల సందర్భములలో నింకెట్టి ఘనకార్యముల సాధింపవచ్చునో తెలియును మనకుగలశక్తి నియమితము కాకున్నను, వర్థమానము మన నరజాతి కొద్దికాలములోనే అతిసాహసాభిలాషితముల గూడ సాధించి ఐక్యశాంతుల సంపాదించుటకును, రాబోవు తరములవారి భవనములింకను సుందరమై, లోక మతిమనోహర మగుటకును, ధైర్యసాహసశక్తులింక నధికమై, లోకులు వృద్ధిజెందుటకును, సందేహమేమి? మానవుడిప్పటికి సాధించినదంతయు అల్పము; అది నరుడు ముస్ముందు సాధింప వలసినదానికి పూర్వరంగమేయని యింతవరకు చెప్పిన జగత్కథచే స్పష్టము *

---

* విల్సను వర్సైల్సుసంధికి పునాదిగా ఏర్పర్చిన 14 సూత్రములు ఆదర్శరూపమైనవి, ప్రపంచక్షేమకరమైనవి, అని అందరు నప్పు డంగీకరించిరి కాని కేవల విద్వాంసుడగు విల్సనుకు యూరపియను రాజ్యాంగములలోని మర్మపద్ధతులును అప్పటికే ఈ మిత్రరాజ్యములమధ్య రహస్య సంధు లున్న సంగతి, స్వార్థధోరణియు తెలియకుండెను, ఆసంధి షరతుల వివరములన్నిటిని, చాలవరకు నానాజాతిసమితి ఆవరణ వివరము

లను, నిబంధనలను, విజేతలగు యూరపియనుల రాజ్యాంగవేత్తలే యేర్పరచి వాటినన్నిటిని స్వలాభదృష్టితో తమ యిష్టప్రకార మమలుజరిపిరి జాతులు ఆయుధములను మహాసైన్యములను చాలవరకు తగ్గించుకొనవలెనని, పాలనమున ప్రతిజాతివారికి స్వయంనిర్ణయాధికార ముండవలెనని, ఇకముందు ప్రతిజాతి ప్రజలకు స్వయం నిర్ణయమునుబట్టియే పాలనము రాజ్యాంగము ఏర్పడవలెనని, మొదలగు విల్సను సిద్ధాంతముల నప్పుడు మిత్రమండలి వారామోదించిరి, ఓడినవారికి వ్యతిరేకమైనంతవరకు అమరతుల బూర్తిగ నమలు జరిపిరి, కాని ఆసూత్రములను మిత్రమండలివారు తమపైన క్రియలో అమలు జరుపుకోలేరు, అందుచే, చాలవరకు అది తరువాత లోకమందశాంతికి అన్యాయమును ముఖ్యకారణమైనది

వర్సైల్సు సంధిషరతుల వివరములు, జాతిసమితి నిర్మాణపు కొన్ని వివరములు, వాటిఅమలు, స్వయంనిర్ణయమూల సూత్రములకు న్యాయమునకు విరుద్ధములు బ్రిటిషు ఫ్రెంచివారి ప్రాబల్యమున జాతిసమితి ద్వారా నియమములకు నిర్బంధముగ అమలు జరిపిరి అమెరికావారు జాతిసమితిలో చేరకపోవుటకు ఇవికూడ కొంతకారణములు ఈసంధి జరిగిన కొలదిలోనే లిథుయేనియా చర్యలు, గ్రీసువారు తుర్కీవారిపై జరిపినయుద్ధము, రష్యాపై ఆయాప్రభుత్వములచర్యలు, పోలిషు జర్మను కలహము, ఇట్లు తమసభ్యులే జరిపిన కొన్ని కార్యములను జాతిసమితివారు వారాపరైరి అందుచే వర్సైల్సుసంధి లోపములకు అనువె గల్గిన అశాంతికి అనర్థములకు, విల్సనే ముఖ్యముగ బాధ్యుడగుట సత్యముగ కనబడదు ఆయాప్రభుత్వముల సామ్రాజ్యధోరణియు ఆర్థికస్వార్థపరతయు పోవలెను అంతవరకు ప్రపంచసభలు జయప్రదముకావు ఆయా దేశములందు పేదరికము, పుంజీపతుల ప్రాబల్యమును జాతిద్వేషమును ఉన్నంతవరకట్లే యుండును మరియు ప్రస్తుత ప్రపంచపు యాంత్రిక నాగ

రికతలోని అధికారవాంఛాది సహజలోపములును అందుకు కొంతవరకు మూలకారణములు

ఇదివరలో సాధ్యము గాని క్రొత్తరకపు గొప్ప కట్టడములు దీర్ఘ ప్రయాణ సాధనములు విద్యుద్యంత్రములు మున్నగువానికే గాక ఇదివరలో నరుల చేతి పనితో సులభముగ జరుగుచుండు నిత్యావశ్యకములగు ప్రతికార్యములను ఇప్పుడు మహాయంత్రములనే వాడుటచే ఆర్థిక నైతిక స్థితులు చెడునన్న, 68 వ అధ్యాయపు చివర టిప్పణి చూచి యున్నాము నగర జీవనముకే చిరకాలమునుండి అలవడిన శీతల ప్రాంతపు పాశ్చాత్య దేశములకన్న మన ప్రాచ్య దేశములకు యాంత్రిక ప్రాబల్యముచే ఎక్కువ హానికల్గునని చాలమంది విజ్ఞులు భావించుచున్నారు

యాంత్రిక కర్మాగారములకే అలవడినజాతులు ముడివస్తువులకొరకును తమ కర్మాగారములలో బహుళోత్పత్తితో కొల్లకొలదిరూపాయల కిమ్మతుగల నిలవవస్తువుల విడుదలకును, వారు ఇతరదేశములపై నాధారపడవలెను అందుకై ప్రతిదేశమువారును యథాశక్తిగా ప్రయత్నింతురు, అంతట తీవ్రముగ పోటీకలుగును యాంత్రికపరిశ్రమలో ప్రబలులగు జాతులు కొన్ని యితరదేశములపై నధికారులై, తమ సరుకుల నాపరాధీనదేశములలో లాభముకు అమ్ముటకును, అచ్చటనుండి తమ పనులకు యంత్రపరిశ్రమలకు వలయు ముడివస్తువులను ఖనిజములను చవుకగ తెప్పించుకొనుటకును, యత్నింతురు, అందుకు వీలుగనే తమ అధీనదేశముల ఆర్థిక పద్ధతులను మార్చుచు, తదనుగుణముగనే ఆపరాధీనజనుల పాలింతురు అట్టిచో తమ ఆర్థిక నైతిక జీవితపు రక్షణకై పరాధీనులు తమ్ము పాలించు ప్రబలదేశముతో కలహించియైన స్వతంత్రులు కాయత్నింతురు ఉభయత్ర హింసాతత్త్వముకు ప్రాముఖ్యము కలుగును

బలీయములగు ఇతరరాజ్యములును ఈరీతినే తమ యధికార వ్యాపారముల వ్యాపింపజేయ పోటీచేయుచున్నవి. అందుచేతనే సామ్రాజ్యము యంత్రవ్యాపారాదులను నష్టముకాకుండు లాభరక్షణమును, తమ అధీనదేశముల నల్పుకొనుటకును, ఆపరతంత్రదేశమందు పరిపాలకులు ప్రబలమగు వివిధసేనలను ఆధునిక యుద్ధపరికరములను వృద్ధిచేయుచుందురు అందుకై వలయు విశేషద్రవ్యమును ఆపరతంత్ర దేశపు ఆదాయము నుండియే వ్యయము చేయబడును కనుక ఆపరతంత్ర దేశీయుల విద్యారోగ్యాదులకై సొమ్ము చాలదు, ఆప్రజల స్వతంత్రప్రవృత్తులు వారిస్వతంత్ర భావములు క్షీణించును ఈయాంత్రిక నాగరికతవలన పారిశ్రామిక దేశ జనులకును స్థిరలాభములేదు ఆయాసురసంపత్తుచేతుదకు పాలకదేశ జనులకును హానియేకలుగును ఆదేశము పాలకవర్గమువారు తమ బలరక్షణకై స్వదేశమందును విశేషవ్యయముతో సైన్యవృద్ధి చేయుదురు రాజ్యాధికారమంతయు పుంజీపతుల యిష్టముపై నిల్చియుండును, ఆర్థికముగను నైతికముగను పారిశ్రామిక దేశములలోగూడ సామాన్యప్రజలు దుస్థితిలోనేయుందురు అట్లుగాక వారిస్థితి బాగుండవలెనన్నచో, ఆయాగ్రామ జనులు తమవస్త్రములను ముఖ్యాహారపదార్థములను స్వయముగా తమ ప్రాంతములందే చేతిపనుల మూలమున సంపాదించుకొనవలెను ఆట్లైనచో జనుల ఆరోగ్యము బుజువర్తనము, వ్యక్తిస్వాతంత్ర్యమును వృద్ధియగును జనులలోను దేశములమధ్యనుగూడ స్పర్ధ, పేరాస అధికారేచ్ఛ, హింసాబుద్ధి, నశించును భౌతికబలావేశము తగ్గును మనోహృదయములు నిర్మలములై సత్వవృద్ధి కలిగి, ఆత్మికమగు అంతశ్శక్తి అనగా దైవసంపత్తు వృద్ధిగాంచును అప్పుడు జాతులమధ్య సంఘర్షము కలుగనుండదు

ఈయాంత్రిక నాగరికత భౌతికముగ అద్భుతమైన సంగతినిజమే కానిదాని ప్రకోపమువలన ఆయా సామ్రాజ్యములు విజృంభించుచు, తమ

ప్రాబల్యము వృద్ధిజేసుకొనుటలో పరస్పరము సంఘర్షణమొందుచున్నవి శాంతముగు దుర్బలదేశముల బాధించుచు, వానినేదో విధముగ వశపర్చుకొనుటకు యత్నించుచు, ఆయాదేశముల స్వాతంత్ర్యమును నయముననో భయముననో వ్యాపారము పేరటనో దుర్నీతినో హరించుటకు వెనుద యుటలేదు ఇందుకు ప్రస్తుత మాయాదేశములందున్న పరిస్థితులను కొంత చారిత్రకముగ గమనింపవలెను అమెరికా సంయుక్తరాజ్యమందచ్చటి ఆదిమజనుల రూపుమాపి యేర్పడిన యూరపియనులు తమవ్యాపార వృద్ధికని మధ్యదక్షిణ అమెరికా ఖండములందటిమీదను తమ ప్రాబల్యమును హెచ్చించినారు ఈవిషయమున వారికి యూరపియను రాజ్యములతో సంఘర్షణము కలుగుచున్నను, తత్కాల రంగములందు బ్రిటిషు ఫ్రెంచిరాజ్యము లమెరికా సాయమపేక్షించుచు, అమెరికాతో విరోధపడకున్నారు కాని బ్రెజిలు అర్జంటైన, మెక్సికో మొదలగు ఆయామహా దేశములందు తమసరకుల నమ్ముకొని అక్కడి ముడివస్తువులను చౌకగ సంపాదించుకొనుటకు తమ ఆర్థికప్రాబల్యమును నెట్లయిన వృద్ధిజేసుకొనుచు నేయున్నారు ఆ బ్రెజిలు వగైరాదేశములు తమంతటవృద్ధియై వాటి యార్థికస్థితి బాగుచేసికొనుటకు యూరపియనులును అమెరికా సంయుక్తరాజ్యములవారును అడ్డము వచ్చుచునేయున్నారు, వీరు కోట్లకొలది ధనముల నాయాదేశములలో పెట్టుబడిపెట్టి అక్కడి గనులు అడవులు వగైరాలను తమ వశమందుంచుకొని ఉపయోగించుకొనుచు, ఆయాదేశముల వృద్ధి కడ్డుపడుచున్నారు ఇటీవల మెక్సికోలో నూనె గనులలో బ్రిటిషువారి ప్రాబల్యమువలన తగవులు గల్గి తుదకు ఆగనుల తగవు రాజకీయ రూపమొందెను, అక్కడ ప్రజాస్వామ్య ప్రభుత్వమున్నది దానిని పడగొట్టి విదేశీయులగు పుంజిపతుల సాయముతో వారి ప్రాబల్యముగల ఫాసిస్టు రాజ్యము స్థాపించుటకు యత్నము జర

గినది సకాలములో మెక్సికో ప్రభుత్వము మేలుకొని అతిరగుబాటు నణచివేసినది ఫిలిప్పైను మొదలగు ద్వీపములందు సంయుక్తరాజ్యము వారును సామ్రాజ్యదోరణితో తమ ప్రాబల్యము హెచ్చించుకొన్నారు, గాని, జపాను వగైరాలతో తగవులలో ఆయాదేశీయు లశాంతితో నుండుచో, ప్రమాదించుననియు, ఫిలిప్పైనులు తిరుగబడి తీవ్రాందోళన చేయుటవల్లను వారికి కొంత స్వాతంత్ర్యమిచ్చినారు

స్పైనులోను ఇటీవల మహాయుద్ధము జరుగుచున్నది స్పెయినులో జమీందారీపద్ధతి పోపుగారి అధికారము కాతలిక మతసంస్థల ప్రాబల్యమును రాజకుటుంబీకుల నిరంకుశపద్ధతులును ఇంకను అట్లేయున్నవి తుదకట్లో ప్రజాప్రభుత్వమేర్పడి, అల్ఫాంసో రాజులతొలగింపబడెను కాని జమీందారులు, పుంజీపతులు మతమూర్ఖులు వగైరాలేకమై ఒక నియంతనేర్పర్చి, ప్రజాప్రభుత్వమునణచిరి జనులందశాంతి హెచ్చినది ఆదేశమందు రాగివగైరా లోహసంబంధమగు మంచి గనులున్నవి వాటిలో బ్రిటిషువారు ఇటాలియనులు వగైరాలధికారము సంపాదించి, వాటిసాయముతో తమ పరిశ్రమలవృద్ధి చేసుకొనుచు, అవిదేశీయ సంఘమువారు ప్రాబల్యమునొందియున్నారు స్పెయినులో నిజమైన ప్రజారాజ్యమేర్పడుచో నావిదేశీయ సంఘములకునుతద్వారా విదేశ రాజ్యములకును కల్గినప్రాబల్యము క్షీణించును రష్యాలో నిట్లేజరిగి, అవిరాయితీ పెట్టుబడిదార్ల పెట్టుబడులు నష్టమైనవి

1936 ఫిబ్రవరిలో స్పెయినులో శాసనసభ కెన్నికలుజరిగి, అందు ప్రజాస్వాతంత్ర్యవాదులుగెల్చిరి జమీందారీ పుంజిపతివర్గమువారోడిరి ప్రజాధికారముగల ప్రభుత్వమేర్పడినది అంతట ఇటలీ జర్మనీవగైరా నియంతల దేశములవారసహాయ వహించిరి జమీందారీ పుంజిపతి పక్షము

సాయమారంభించిరి వారి ద్రవ్యాయుధాది సహాయముతోనే ఫ్రాంకో సేనాని హఠాత్తుగా కొన్ని స్పెయిను సేనలను మొరాకోలోని పరాధీను లగు 'మూరు'లను తెచ్చి, ప్రజాప్రభుత్వమును దౌర్జన్యముతో నడచివేయ నారంభించినాడు కాని ప్రజాప్రభుత్వము వారాత్మరక్షణ కారంభించగా ఘోరయుద్ధ మేర్పడినది కొద్దినెలలలోనే ఫ్రాంకో జయమొందునని కొందరు తలచిరి కాని, రెండేండ్లనుండి యుద్ధమింకను చాల తీవ్రముగ జరుగుచున్నది అంతర్జాతీయ న్యాయములనుబట్టియు నీతిని బట్టియు న్యాయనిబద్ధమైన ప్రజాప్రభుత్వముకే జాతిసమితివారును అందు ప్రముఖులైన బ్రిటిషు ప్రభుత్వము వగైరాలును తోడ్పడుటసబబు కాని అట్లుజరుగలేదు నానింటర్వెన్షను (= తటస్థత) అనుపేర వారు ప్రజాప్రభుత్వమునకు ఆయుధద్రవ్యసహాయము రాకుండజేసిరి ఇటలీ జర్మనీల నియంతృప్రభుత్వములు బహిరంగముగనే స్పెయినులో విద్రోహియగు ఫ్రాంకోపక్షమునకు ఆయుధములను విమానాదులను తమ సేనలనుగూడ నిచ్చి, మహాదౌర్జన్యముతో మారణము జరిగించుచు ప్రజాప్రభుత్వము నడచుటకు విశ్వప్రయత్నముల జేయుచున్నారు స్పెయినులో ఇటలీ జర్మనీల ప్రాబల్యము హెచ్చుట బ్రిటిషు సామ్రాజ్యమునకు కొంతనష్టకరమైనను అందునను సహించి బ్రిటిషుప్రభుత్వమువారు తమ పుంజీపతి ప్రాబల్యమువలన పరోక్షముగ విద్రోహిపక్షముకే సానుభూతి నిచ్చుచున్నారు

అక్కడ ప్రజాప్రభుత్వపు పక్షమునకు మొదట రష్యా కొంత తోడ్పడెను కాని అది దూరదేశము, వారినావలు మధ్యధరాసముద్రముద్వారానే స్పెయినునకు రావలెను వాటిని ఇటాలియనులు ముంచివేసిరి. ఆహారసామగ్రిగూడ అందనిచ్చుటలేదు ఆదాగుణాచర్య అంతర్జాతీయ నీతికి విరుద్ధమైనను, జాతిసమితివారేమియు చేయక, జర్మనీ, ఇటాలియనుల

యిష్టప్రకారము సాగనిచ్చిరి. బ్రిటిషువారు (అబిసీనియాలోవలె) తమ వాక్కులను మాత్రము భద్రపరచి వరతుం నిటాలియనులతో చేర్చు కొనిరి. ఇప్పుడు బ్రిటిషు పుంజీపతులు బహిరంగముగనే విద్రోహాయుగ ఫ్రాంకోకు ఈ యుద్ధసమయంలో కోట్లకొలది రూపాయలను (వర్తక సందర్భములోనని) ఇచ్చి, ఫ్రాంకోజయమునకు కారకులగుచున్నారు. ఫ్రెంచిసర్కారువారు మొదట స్పెయినులో ప్రజాప్రభుత్వమునకు కొంచెముగ సహాయముచేయదొడగిరి. కాని ఇంతలో ఇటలీ జర్మనీలు బెదిరించిరి, బ్రిటిషువారును ఫ్రెంచివారిని వెనుకకులాగిరి, ఇట్లు ప్రజాప్రభుత్వపక్షమునకు సాయముజరుగక, విదేశీయులనుండి విద్రోహులకు యుద్ధసహాయమేర్పడి, ప్రజాపక్షమణచివేయబడుచున్నది. తమతమ ఆర్థికప్రాబల్యమును యాంత్రికప్రకోపమును నిలబెట్టుకొని స్పెయినులో తమ ఆర్థికముగు 'హక్కు'ల పోషించుకొనుటకే ఆయావిదేశప్రభుత్వములును ప్రముఖులును ఇట్లు చేయుచున్నారు. ఈదీర్ఘసమరమందు యుద్ధరంగములో పాల్గొనక శాంతముగనుండు ప్రజలను పిల్లలనుగూడ విద్రోహిపక్షమువారు విమానములద్వారా చంపివేయుచు నగరములను ధ్వంసముచేయుచు, అంతర్జాతీయనీతిని నీటగలిపినారు. అందు ఇటలీ జర్మనీల విమానములు సైనికులు ప్రత్యక్షముగ పాల్గొన్నను, తక్కినవా రెవరొక్కన లేదు. ఇందుల మూలకారణము యాంత్రిక నాగరికతవలని విపరీతపరిణామము. ఇప్పుడు చీనాలోను ఇట్టే మహాయుద్ధము జరుగుచు, ప్రజాక్షయము కల్గుచున్నది. చీనా రాజకీయముగ స్వతంత్రమగు మహాదేశము. చీనుల నాగరికత చాలప్రాచీనము, సౌమ్యము, చీనులు లోకోపయోగులగు ఆవిష్కారములెన్నిటినో జేసిరి. కాని ఇంగ్లండు జర్మని వగైరాలలో యాంత్రికపరిశ్రమలు హెచ్చగనే, వాటిసరఫరాకై చీనాలో తమ ప్రాబల్యము హెచ్చించుట కాయాప్రభుత్వములు నానా తీవ్రముగ యత్నిం

చిరి నల్లమందు వగైరాలను చీనులకు నిర్బంధముగ నంటగట్టిరి వారు వ్యతిరేకించగా, యుద్ధము చేసి, తమ ఫిరంగులబలమున వారిని లొంగదీసి, చీనాలో రేవుపట్టణములం దధికారమువహించిరి చీనాసుంకముల పద్ధతిని, కాటివసూళ్ళను బ్రిటిషు వగైరా విదేశీయులు వశపరచుకొనిరి న్యాయవిచారణాదులలో గూడ కొన్ని ప్రత్యేకాధికారములను లాగుకొనిరి ఈసమయమందు చీనాలో వెనుకటి సామ్రాజ్యపు బలము క్షీణించినది 'మంచూ'వంశపు చక్రవర్తి దుర్బలుడైనాడు సరియగు కేంద్ర ప్రభుత్వములేక మన దేశమందువలె, చీనాలోను ఈవిదేశీయులు ఆ యాప్రాంతపు ప్రభువులలో జరుగు కలహములకు ప్రోత్సాహమిచ్చుచు క్రమముగా ప్రాబల్యము సంపాదించిరి అక్కడను క్రమముగ బ్రిటిషువారి మిల్లుబట్టలువగైరా యాంత్రికవస్తువులు విరివిగ వ్యాపించినవి కొన్ని గనులు రైళ్ళు వగైరాల కంపెనీలేర్పడి, బ్రిటిషువారి పెట్టుబడి హెచ్చినది ఈలోగా ఫ్రెంచి జర్మనీ రష్యావారును చీనాలో చెరియొక ప్రాంతమందు ప్రాబల్య మేర్పరచుకొనిరి ఇట్లు చీనాను వీరు పలుకుబడి ప్రాంతములు'* అనుపేర పంచుకొనుట అమెరికా సంయుక్త రాజ్యమునకిష్టము కాదు వారికిని మిల్లుయంత్రములు హెచ్చి వారు తమ సరుకులు చీనాలోని జనబృందముల కమ్ముచుండిరి ఈస్థితిలో జపాను ఈవిదేశరాజ్యములన్నిటితో పోటీకివచ్చినది ఇంగ్లండువగైరాల ననుకరించి జపానీయులు మిల్లులు వగైరా మహాయంత్రము లతివేగముతో వృద్ధిజేసిరి చీనా విశాలదేశము అందు ప్రత్తి వగైరాముడివస్తువులు చాలయున్నవి అందలి 40 కోట్ల ప్రజలకు తమ యంత్రముల సరుకులమ్ముకొని యెంతైన లాభముగడించవచ్చును వారు పాశ్చాత్యనీతి ననుకరించి 1894 లో చీనాతో కయ్యము పెట్టుకొని దానినోడించిరి

* Spheres of Influence

కాని అప్పుడు అసూయజెందిన రష్యా జర్మనీ లడ్డమువచ్చినవి 1904 05 లలో రష్యానోడించి, జపాను రష్యాపోటీలేకుండ జేసుకొన్నది 1914-18 లలో జపానీయులు చీనాప్రాంతమందు జర్మనుల స్థానములన్నిటిని వశపర్చుకొని, చీనాలో తమప్రాబల్యము హెచ్చించుకొనిరి అప్పుడు చీనాయు మిత్రమండలి పక్షమైనను, చీనా దౌర్బల్యము హెచ్చెను

1912 లో చీనావారు తమ చక్రవర్తిని తొలగించి ప్రజారాజ్యము స్థాపించుకొన్నను, వారి జాతీయనాయకుడగు సన్యటుసేను ఇంతలో చనిపోయెను మరల ఆయాప్రాంతముల సామంతరాజులు స్వతంత్రులై తమలో కలహించుచు విదేశీయుల సాయమునొందుచు వారికి ప్రాబల్యమిచ్చుచుండిరి అప్పుడు రష్యాలో ప్రజాస్వామ్యప్రభుత్వము స్థాపితమైనది వారిసానుభూతితో చీనానాయకులును ప్రజాబలము హెచ్చించి జనక్షేమకరమగు ప్రభుత్వము స్థాపింపయత్నించిరి చీనులును దేశీయపరిశ్రమల స్థాపింపబూనిరి వెంటనే విదేశీయులతో సంఘర్షమేర్పడినది మనదేశమందువలె చీనాలోను పరిశ్రమలవృద్ధికి వలయు ప్రకృతిసౌకర్యములు ముడివస్తువులు మంచిలోహసంపదగూడ కలవు, అక్కడ కార్మికసమృద్ధికి లోటుండదు కనుక అక్కడ వేగముగ దేశీయ పరిశ్రమలు వృద్ధియైనచో బ్రిటిషువారు జపానీయులు వర్తకరాల యాంత్రికవ్యాపారమునకు పోటీకలుగక తప్పదు అప్పుడు బ్రిటను జపాను వర్తకరాలు రష్యాలోను చీనాలోను ప్రజాశక్తి నణపయత్నించిరి, రష్యాలో సాగకపోయినను, చీనాలో కొందరు ప్రాంతీయనాయకులకు తోడ్పడి, వారిద్వారా, అక్కడి జాతీయోద్యమము నరికట్టగలిగిరి 'యాన్షికాయి' చీనాకథ్యక్షుడై, జపాను బ్రిటను వర్తకరాల కనుకూలుడయ్యెను తరువాత నాయకుడైన చయాంగుకైషకుకు అట్లేచేసి, కమ్యూనిస్టు పక్షీయుల నతిఘోరముగ హింసించెను, ప్రజాస్వామ్యపుపక్షపువారిని నడివీధుల

ఖలో గూడ ఎట్టివిచారణయు లేకుండ చంపించెను. రష్యాపైన భయము వలన అతనికి బ్రిటిషువారు జపానీయులు తోడ్పడిరి. అందువలన చీనాలో ప్రజాస్వామ్యపక్షీయులకును చయాంగుకైషకుగారి మితవాదపక్షీయులకును మహావిరోధమేర్పడినది. ఇందువలనను చీనాలో ఉత్తరభాగపు హూయాంగుహో ప్రాంతీయులు పెకింగు సంప్రదాయమునకు లోనై, జపాను బ్రిటిషువారల ప్రాబల్యమునకు లోబడిరి. ఇట్లు చీనాలో ఉత్తరప్రాచ్య ప్రాంతీయుల నాయకుడైన చయాంగుకైషకు దక్షిణ పశ్చిమప్రాంతపువారిపైన అడుగడుగుకు దండయాత్ర సాగించుచు, విదేశముల పుంజీపతులనుండి తాను ద్రవ్యసేనాసహాయ మొందుచుండెను. కాని ప్రజాస్వామ్యవాదులును, లొంగక వీరావేశముతో పోరుచుండిరి. ఇట్టి పదేండ్లలోను చీనాలో అంతఃకలహములు రక్తపాతము హెచ్చెను. ఈస్థితి కనిపెట్టి జపానీయులు తమపలుకుబడిని బలమును హెచ్చించిరి. ఆసందర్భమున జపానుపైన బ్రిటిషు అమెరికా ఫ్రెంచి వారల కసూయగల్గినది. కాని వారికితరదేశములందు చేతినిండ పనియున్నది. చీనా జపానుకు చాలదగ్గర. అక్కడ వారు జపానుతో పోరుట కష్టము. మరియు జపాను ప్రాబల్యము హెచ్చినను సరే, కాని ఏసందర్భములోను చీనాలో సామ్యవాదము వ్యాపించి చీనులు సామ్యవాదులగుట మహానర్థకమని, అది తమ సామ్రాజ్యతత్వమునకు నిరోధకమని, వీరందరి భావన. కమ్యూనిస్టుల ప్రాబల్య మణచుటకను పేరుతో జపాను క్రమముగ చీనాలో బ్రిటిషు వగైరాల యర్ధాంగీకారముతో తన బలము హెచ్చించి, చీనానుండి ప్రతిసారియు క్రొత్తలాభములను పొందదొడంగినది. చీయాంగుకైషకు వెనుదీసినను బెదరించియు తన సేనాబలము మాపియు, దండయాత్ర ప్రారంభించియు తన పట్టుసాగించుకొనుచు చీనాలో కమ్యూనిస్టు పక్షముతో చయాంగుకైషకు ఘోరవిరో

ధము పెట్టుకొన్నందున జపాను చెప్పినట్లే చేయవలసివచ్చెను కాని ఆక్రమణ క్రమముగ మితిమీరినది 1931-33 లలో మంచూకో నాక్రమించి అక్కడ నొకబొమ్మరాజును పెట్టి తానే పాలించుటేగాక ఇంకా దక్షిణమందు జెహోలురాష్ట్రము గూడ ఆక్రమించెను తరువాత ఆర్థిక సేనాసహాయములు చీనాప్రభుత్వమువారు జపానునుండియే పొంద వలెనని షరతుపెట్టిరి అది అన్యాయమని బ్రిటిషువారు అమెరికనులు తగువుపెట్టిరి కాని 'అమెరికా అంతటను ఇతరులెవరును కల్పించుకొనకూడదని సంయుక్తరాజ్యమువారు 'మన్రోసిద్ధాంతము' పెట్టుటలేదా! భారతదేశమందు, ఆస్ట్రేలియా దక్షిణాఫ్రికా వగైరాలలో బ్రిటిషువారితరులకు ప్రాబల్యములేకుండజేయలేదా? కనుక చీనా జపానువారి పలుకుబడిలోనుండుట సత్యమే' అని సమాధానమిచ్చి, జపానువారు బహిరంగముగనే చీనాను నిర్బంధించినారు మరియు హోయాంగుహో ప్రాంతపు ఉత్తర చీనా తత్వమునకు, యాంగ్ట్సెప్రాంతపు మధ్యదక్షిణ చీనాల తత్వమునకు భేదము అనుశ్రుతముగ వచ్చుచున్నదిగదా ఈ విభేదము హెచ్చించి ఉత్తర-చీనాలో తమపలుకుబడి నింకను హెచ్చించి, అక్కడి పాలకుని జపానీయులు వశపర్చుకొనిరి, ఉత్తర చీనా దక్షిణ-చీనాతో ఆర్థికరాజకీయములందు లోబడక, ప్రత్యేకస్వతంత్రరాష్ట్రముగ నుండవలెనని ప్రకటించిరి ఇట్లు చీనా ఖండములగుటకు చయాంగుకైషకు గూడ సమ్మతింపలేదు అట్లు సమ్మతించినచో, ఆ ప్రాంతములలో చీనులందరు నతనిని పదభ్రష్టునిచేసియుందురు కనుక చీనా జపానులమధ్య యుద్ధముతప్పదాయెను ఉత్తర-చీనా రాజధాని యగు పెకింగుకు సమీపమందు చీనులకు జపానీయులకు సంఘర్షము కలిగినదను కారణమున జపానుప్రభుత్వము చీనాపైన (యుద్ధము ప్రకటింపకయే) 7-7-1937 తేదీని దండయాత్ర నారంభించిరి, తమ విశేష

శస్త్రబలము నుపయోగించి చీనా సేనలనోడించి చీనాలో సగము నాక్రమించుచున్నారు తమ సముద్రసేననుపయోగించి, చీనుల కితరదేశములనుండి యెట్టిసాయమును రాకుండజేయుచున్నారు, విమానములతో నాంకింగువంటి మహానగరములన్నిటిని ధ్వంసముచేసిరి వారు అంతర్జాతీయ మహానగరమగు షాంఘైనిగూడ వశపర్చుకొన్నారు

ఈజపాను దండయాత్రవలన బ్రిటిషువర్తకులకును వ్యాపారాది నష్టము కలుగుచున్నను చీనాకు ఘోరమగు అన్యాయము జరుగుచున్నదని అంతర్జాతీయ సిద్ధాంతములకుభంగముచున్నవని ప్రత్యక్షముగ కనబడుచున్నను, బ్రిటను వర్తకులు చీనాకు సాయపడక, లోపాయికారీగా జపానుకు తోడ్పడుటే ఈసందర్భమున ముఖ్యముగ గమనింపవలసినది స్పెయినలో అవలంబించిన రాజనీతినే ఈపుంజీపతి రాజ్యములు చీనా జపానుల సందర్భములోను పెట్టుకొన్నారు పుంజీపతులు స్వలాభమునే చూచుకొందురు వారి ఆర్థికలాభమే వారికి ముఖ్యము పుంజీపతి రాజ్యములు పరస్పరము సాయముచేసుకొనును తమలో పరస్పరము పోటీయు నష్టముకల్గిననుసరే ప్రజాసామాన్యమునకు ప్రాబల్యముకల్గుట వారికిష్టముకాదు ఆర్థిక సాంఘిక విషయములలో ప్రజాసామాన్యము స్వతంత్రులగుటయు ప్రజాస్వామ్యముండుటయు పుంజీపతివర్గము కిష్టముకాదు

ఈరీతిగగూడ యాంత్రికనాగరికత వర్గసంఘర్షణను హెచ్చించును మనదేశమందును ప్రభుత్వమువారు ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగ స్వలాభకరమైన ఆర్థికనీతినే పాలించుచున్నారు 1930-32 లో మనదేశమందు గొప్పసత్యాగ్రహముకల్గినది అందు జమీందార్లు పుంజీపతులు మతమూర్ఖులు (ఇప్పుడు స్పెయినులోవలె) ప్రజాస్వామ్యమునకు తోడ్పడక ప్రభుత్వము కనుకూలురైరి అప్పుడును (శస్త్రబహిష్కారాదులలో) ఆర్థికసమస్యలకే ప్రాముఖ్యముకల్గుటయు విశేషము, తరువాత

ప్రభుత్వము క్రొత్త రాజ్యాంగమిచ్చినారు కాని, అందును ఆర్థిక ద్రవ్యాధికారములు తమచేతిలోనే 'జప్తు' చేసుకొనిరి మరియు బ్రిటిషు వ్యాపారస్థుల వాక్కులకు నష్టములేకుండ ప్రత్యేకపు షరతులేర్పర్చినారు పుంజీపతి తత్వమును సామ్రాజ్యతత్వమును అనుబంధమున్నది

బ్రిటనులో యాంత్రిక నాగరికతయు పుంజీపతి తత్వమును ప్రబలియున్నవి వారాయంత్రములద్వారా బహుళోత్పత్తి చేయకతప్పదు వాటిని దేశమందు ధారాళముగ మంచిధరకు విక్రయించుటకే సామ్రాజ్యాధికారము చలాయించి మనవంటి పరాధీనప్రజలకార్థిక స్వాతంత్ర్యములేకుండ జేయుట సంభవించుచున్నది ఇట్లు ప్రపంచమందన్ని ప్రాంతములలో యాంత్రికనాగరికత వలన జనసామాన్యమునకన్యాయము జరుగుచుండును

సృష్టిలోకూడ ఒక్కొక్కయుగము గడచినకొలది కేవల భౌతిక శక్తిగల జంతువులు పోవుచు క్రొత్తయుగమునందు బుద్ధివైశద్యముగల జంతువులుగల్గెను, ఆయుగముకూడ గతింపగనే ఇంకను క్రొత్తయుగమున ఇంకను మనశ్శక్తి నైతికవిచక్షణగల జంతువులువచ్చెను తుదకు హెచ్చు మనశ్శక్తి ఆత్మికశక్తిగలనరజాతి ఆధునిక యుగమునకలిగెను నరజాతిలోగూడ ఆదిమనాగరికతకన్న ఆర్య నాగరికతలోను, తరువాత బౌద్ధయుగాలందును క్రమముగా ఆత్మికశక్తి వృద్ధిజెంది, అహింసాసత్యాది ఆధ్యాత్మికలక్షణములకు ప్రాముఖ్యము కలిగెను దీని నీచరిత్రలో పాఠకులు గమనించియున్నారు అందుచే ముందుముందు ఆత్మికశక్తి వృద్ధియగుటవలననే పురోవృద్ధి కలుగుట సృష్టిసంకల్పమని తోచును అట్టిగాంధీయను అహింసాతత్వము ఆత్మికశక్తిని వృద్ధిచేసినమీదటనే, రాజకీయములందును జాతిసమితులు లోకక్షేమముకొరకే పనిచేసి జయప్రదములగును ప్రపంచపు ప్రస్తుతపుస్థితి పోవలెనన్నచో, దానిమూలకారణములగు హింసాహంకారస్వార్థపర తత్వముల మార్చవలెను అందుకు ఇప్పటి నాగరికతయంతయు నైతికిని పరిణామము కలుగవలెను భిన్ననాగరికతలదెబ్బ

దైవాసురసంపత్తులు భగవద్గీత పదునారవ అధ్యాయమున చక్కగా వర్ణింపబడినవి అందుకొన్ని శ్లోకములుమాత్రము దిఙ్మాత్రముగ నిక్రింద నుదహరింపబడినవి

అహింసా సత్య మక్రోధః త్యాగ శ్శాన్తి రపైశునం
భవంతి సంపదం దైవీమభిజాతస్య భారత॥ (భ గీ 16-2,3)
దంభో దర్పోఽతిమానశ్చ క్రోధః పారుష్య మేవచ
అజ్ఞానం చాభిజాతస్య పార్థసంపద మాసురీం॥
దైవీసంప ద్విమోక్షాయ నిబంధా యాసురీమతా (16-45)

---

అనుబంధము 1

మ్ముఖ్యవృత్తాంతముల కాలసూచి

రమారమి క్రీ పూ 1000 ప్రాంతమున ఆర్యులు స్పెయిను ఇటలీ బాల్కను ద్వీపకల్పములలో స్థిరవాసులగుచుండిరి ఉత్తరహిందూస్థానమున అంతకుపూర్వమే వారు స్థిరవాసులైరి నోసస్ అప్పటికే ధ్వంసమాయెను మూడవతాత్మెస్, మూడవఅమినాఫిసు రెండవ రామిశెస్‌ల నాటి ఈజిప్టు ఔన్నత్యకాలము మూడునాలుగు శతాబ్దముల కావలనుండెను నైలులోయలో 21వ వంశపు రాజులు దుర్బలులైరి ఇస్రాయెలులు మొదటి రాజులక్రింద ఏకీభవించెను అప్పుడు సౌలో డేవిడో, సాలమనో, బహుశః పాలించుచుండియుందురు ఆధునిక ప్రపంచమున కాన్స్టాంటైను కన్నన అక్కేడియను సుమేరియను సామ్రాజ్యమునకు జెందిన మొదటి సార్గను పేరు (క్రీ పూ 2750) బాబిలను చరిత్రలో ప్రాచీనతరముగ నుండెను అప్పటికి వేయేండ్లుపూర్వమే హమ్మురబీ మరణించెను మహావీరులగు అస్సీరియనులు బాబిలనునకు పాలకులైరి క్రీ పూ 1100 లో మొదటి టిగ్లత్ పిలేసరు బాబిలను నాక్రమించెను కాని స్థిరజయముకలుగలేదు అస్సీరియా బాబిలనులిరువును వేరురాజ్యములుగనే యుండెను చీనాలో నూతన ‘చౌ’ వంశము వృద్ధిజెందుచుండెను ఇంగ్లండులోని స్టోనుహెంజి అప్పటికే కొన్నివందలయేండ్లకు పూర్వపుదై యుండెను *

---

* అప్పటికి చాలపూర్వమే భారతదేశమున మహెంజదరో మొదలగు స్థలముల ఆదిమద్రావిడ నాగరికత ఋగ్వేదవృత్తాంతములు, హరిశ్చంద్రమాంధాతాది చక్రవర్తులపాలనము, శ్రీరామాదుల కోసల సామ్రాజ్యము, కురుపాంచాలాదుల రాజ్యములు, మహాభారతయుద్ధాదులుగూడ గడచెను భారతదేశమున ననేకరాజ్యములు విలసిల్లుచుండెను ఆదివరకే వేదవాఙ్మయమంతయు నేర్పడెను

తరువాత రెండు శతాబ్దములలోను 22వ రాజవంశమున ఈజిప్టులో నవజీవనము, హీబ్రూలసాలనుని చిన్నరాజ్యపు విచ్ఛేదనము, బాల్కానులలో దక్షిణ ఇటలీ ఆసియామైనరులలో గ్రీకులవ్యాప్తి, మధ్య ఇటలీలో ఎట్రస్కానుల ఆధిపత్యము కలిగెను. ఇక ముఖ్యవృత్తాంతములకు నిర్ధారణ అయిన కాలనిర్ణయము మీ క్రింది పట్టికలో నీయబడినది

క్రీ పూ

800 కార్తేజి నిర్మాణము

790 ఎతియోపియను లీజిప్టును జయించి, 25 వ రాజవంశము స్థాపించిరి

776 మొదటి ఒలింపిక్ ఆట

753 రోముపుర నిర్మాణము

745 3 వ టిగ్లతు పిలేసరు బాబిలను జయించి క్రొత్త అస్సీరియా సామ్రాజ్యము స్థాపించెను

722 2 వ సార్గను అస్సీరియనులకు ఇనుప ఆయుధములు నిచ్చుట

721 అతడు ఇస్రయెల్ల ప్రవాసమంపెను

680 ఎసర్హాడను ఈజిప్టులో థీబ్సుపురము బట్టుకొని, 25 వ రాజవంశము తొలగించెను

* (సుమారు) సాశిని జీవితము

664 మొదటి సమెటికసు ఈజిప్టును మరల స్వతంత్రముజేసి, 26 వ రాజవంశమును స్థాపించెను

608 ఈజిప్టు రాజగు నెకో యూదరాజగు జోషియాను మెగిడ్డో యుద్ధమున నోడించెను

606 చాల్డియనులు మీడులు నినేవాను పట్టుకొనిరి చాల్డియను సామ్రాజ్య స్థాపన

*606 జోరాస్టరు (పార్సీమతస్థాపకుడు) పారశీకమున వసించెను

క్రీ పూ

604 నెకో యూఫ్రటీసునది వరకుపోయి, 2 వ నెబూకడ్ నెజ్జరుచే నోడెను, (నెబూకడ్ నెజ్జరు యూదుల బాబిలనుకు గొంపోయెను)

550 పారసీకుఁడగు సైరసు మీడుఁడగు స్యక్జరీసు స్థానమున వచ్చెను, క్రోససును జయించెను, ఆ సమయమున గౌతమబుద్ధుని జీవితారంభము చీనాలోని కన్ఫ్యూషియసు, లౌత్సే ఈకాలముననే జీవించిరి *జైనమతస్థాపకుడు మహావీరుడు నప్పుడేయుండెను

539 సైరసు బాబిలనుపట్టుకొనెను, పారసీకసామ్రాజ్యము స్థాపించెను

521 మొదటిడెరయసు (పారసీకచక్రవర్తి) పాలనము, సిధియాపై అతని దండయాత్ర

490 మారథాన్ యుద్ధము

480 థర్మాపిలే, సలమిస్, యుద్ధములు

479 ప్లటియా మైకేలు, యుద్ధములందు పారసీకుల పరాజయము

*477 బుద్ధునిమరణము

474 సిసిలీగ్రీకులు ఎట్రుస్కను నౌకాసేన నశింపజేసిరి

431 పెలపనీషను యుద్ధము

401 "పదివేలసైనికులు" వెనుకకు బోవుట

359 'ఫిలిప్పు' మాసిడను రాజయ్యెను

338 చరోనియా యుద్ధము

336 మాసిడోనియా సేనలు ఆసియాదాడి నారంభించెను ఫిలిప్పుహత్య

334 గ్రానికసు యుద్ధము

333 ఇస్ససు యుద్ధము

331 ఆర్బెలా యుద్ధము

క్రీ పూ

330 మూడవ డేరయసు మరణము

*327 అలెగ్జాండరు పోరసుల యుద్ధము

323 అలెగ్జాండరు మరణము

321 చంద్రగుప్తుడు పంజాబును స్వతంత్రమొనర్చెను మౌర్యసామ్రాజ్యారంభము కాబూలు కనుమల యుద్ధమున సాండ్రకోటసు చేతిలో సెల్యూకసు ఓడిపోయెను

* (సుమారు) కాత్యాయనుని కాలము, చాణక్యుని జీవితము

281 ఇటలీపై పిర్రసు దండయాత్ర

280 హెరాక్లియా యుద్ధము

279 అస్క్యులం యుద్ధము

278 గాలులు ఆసియామైనరుపై దండెత్తి గలేషియాలో స్థిరపడిరి

275 పిర్రసు ఇటలీవీడెను

264 మొదటిప్యూనికు యుద్ధము, హిందూస్థానమున అశోకచక్రవర్తి రాజ్యారంభము (అంతము 237)

260 మైలే యుద్ధము

256 ఎక్నమసు యుద్ధము

246 చీనాలో షిహ్వాంగ్టి 'త్సిన్' రాజ్యారంభము

*255 అశోకుని కళింగాంధ్రదేశ దండయాత్ర భారతబౌద్ధుల విదేశయాత్రారంభము, చీనాసింహళముల బౌద్ధమత వ్యాప్తి ప్రారంభము

220 షిహ్వాంగ్టి చీనాచక్రవర్తి అయ్యెను

14 చీనామహాప్రాకారారంభము

210 షిహ్వాంగ్టి మరణము

క్రీ పూ

202 జామాయుద్ధము

146 కార్తేజినాశము

133 అత్తలస్ పెర్గమమును రోముకిచ్చుట

102 మారియసు జర్మనుల నోడించెను

100 మారియసువిజయము చీములు టూరింలోను జయించిరి

89 ఇటలీజనులందరు రోమకపౌరులైరి

73 స్పార్టకసు నాయకత్వమున బానిసల తిరుగుబాటు

71 స్పార్టకసు ఓటమి, మరణము

66 పాంపే రోమనుసేనల కాస్పియన యూఫ్రటిసుప్రాంతములకు నడపి ఆలనుల నోడించెను

*57 విక్రమశకారంభము

48 ఫార్సేలసుయొద్ద జూలియసు సీజరు పాంపేనోడించెను

44 జూలియసు సీజరుహత్య

27 అగస్టసు సీజరుపాలనారంభము

* ఆంధ్రరాజులు మగధరాజ్యము జయించిరి

4 నాజరతుయొద్ద క్రీస్తుపుట్టిన నిజమగు సంవత్సరము

క్రీ త

1 క్రైస్తవ శకారంభము

14 అగస్టసు మరణము, టైబీరియసు రాజ్యారంభము

30 క్రీస్తు శిలువవేయబడెను

41 కలిగ్యులాహత్య రోమకసేన క్లాడియసును చక్రవర్తిజేసెను

68 నీరో (రోమకచక్రవర్తి) ఆత్మహత్య గల్బా ఓథో, విటలసు వరుసగా చక్రవర్తులైరి

69 వెస్పేసియను (రోమకచక్రవర్తి)

క్రీ శ

*78 శాలివాహనశకారంభము

102 హాన్ వో (చీనా రాజు) కాస్పియను సముద్ర ప్రాంతమును వ్యాపించెను

117 ట్రాజను తరువాత హేడ్రియను రోమకచక్రవర్తి అగును (సామ్రాజ్యోచ్ఛదశ)

* 138-154 ఆంధ్ర సార్వభౌముడు గోతమీ పుత్రశాతకర్ణి పాలన సమయము

138 భారతసిథియనులు భారతదేశమునుండి గ్రీకుల పూర్తిగా పారద్రోలిరి *కనిష్క చక్రవర్తి పాలనము

161 అంటోనియసు పయసు అనంతరము మార్కసు అరీలియసు రోమక చక్రవర్తి అయెను

164 మహామారి మొదలిడి అరీలియసు మరణము (180) వరకుండెను, ఆసియాలో గూడ నష్టము కల్గించెను (రోమక సామ్రాజ్యమున యుద్ధకల్లోలము లారంభించి రమారమి శతాబ్ది వరకుండెను)

220 చీనాలో హాన్ వంశాంతము (అంతు విభేదమారంభించి, 4 శతాబ్దులుండెను)

227 పర్షియాలో ఆర్సకిడ్ వంశము నంతమందించి, 1 వ అర్దషిరు రాజు సస్సనిడువంశ మారంభించెను

242 మణి బోధ ఆరంభము

247 గాతులు డాన్యూబునదిదాటి దాడిసల్పిరి

251 గాతుల విజయము డెసియసు చక్రవర్తిమరణము

260 సస్సనిడువంశపు, రెండవషా (పారసీక రాజు) అగు 1 వ సేపర్ ఆంటియోక్ పురము బట్టుకొని, వలేరియను చక్రవర్తిని బంధించెను,

క్రీ త

అసియా మైనరునుండి మరలివచ్చువో, సాక్షెరావాసి యగు ఒడ్డె సాధనుచే హతుడయ్యెను

277 పర్షియాలో మణి కొరతవేయబడెను

284 డయోక్లిషియను రోమక చక్రవర్తి అయ్యెను

303 డయోక్లిషియను క్రైస్తవుల హింసించెను

311 గలేరియుసు క్రైస్తవుల హింసమాన్పెను

312 కాంస్టంటైను మహాశయుడు చక్రవర్తి అగెను

*320 భారతదేశమున గుప్తవంశీయుల సామ్రాజ్యారంభము

323 కాంస్టెంటైను అధ్యక్షుడై నిసియాలో క్రైస్తవసభ జరిపెను

337 కాంస్టెంటైను మరణించుటముందు క్రైస్తవమతము స్వీకరించెను

* సముద్రగుప్తుడు చక్రవర్తి అయ్యెను

361_363 క్రైస్తవ మతమునకు బదులు మిత్రమతము వ్యాపింపచేయ జూలి యను యత్నించెను

392 తియోడోసియను పాశ్చిమపశ్చిమముల చక్రవర్తియ్యెను

395 తియోడోసియను మరణము హానోరియను అర్కేడియనుసులు స్టిలి కొఅలరికులరక్షణసహాయములనొంది సామ్రాజ్యమును పంచుకొనిరి

410 అలరికు నాయకత్వమున విసిగాత్తులు రోమును పట్టుకొనిరి *రెండవ చంద్రగుప్తుని పాలనము కాళిదాసు కాలముననే వసించి యుండ వచ్చును చీనుడగు ఫాహియాను భారతదేశ సంచారము

* కుమారజీవాదుల చీనాయాత్ర

425 వండాలులు దక్షిణస్పెయినులోను హూణులు పనోనియాలోను, గాతులు డాల్మేషియాలోను, విసిగాతులు స్వేవులు పోర్చుగలు

క్రీ శ

ఉత్తరస్పైనులలోను వసింపనారంభించిరి ఇంగ్లీషువారు బ్రిటను పై దాడివచ్చిరి

439 వండాలులు కార్తేజి పట్టుకొనిరి

451 అత్తిలుడు గాలుపై దాడిసల్పి ఫ్రాంకులు విసిగోతులచే ట్రాయిసు యొద్ద నోడెను

453 అత్తిలుని మరణము

455 వండాలులు రోమును దోపిడిచేసిరి

476 ట్యూటను తెగలరాజగు ఒడోసరు పశ్చిమమున చక్రవర్తి లేడని కాంస్టాంటినోపిలుకు తెలియపరచెను పశ్చిమ సామ్రాజ్యాంతము

493 ఆస్ట్రోగాతు నాయకుడగు థియోడరికు ఇటలీ జయించి, దాని రాజయ్యెను, పేరుకు కాంస్టాంటినోపిలుకు సామంతుడైయుండెను ఇటలీలో గాతిక రాజులు వశపరచుకొన్న భూములపై గాతులు రక్షక సైనికులుగా నుండిరి

527 జస్టినియను (రోమక) చక్రవర్తి

529 వేయేండ్లుండిన ఆథెన్సులోని పాఠశాలలజస్టినియను నిలుపుచేసెను అతని సేనానియగు బెలిసారియసు నేపిల్సుపురమును పట్టుకొనెను

531 మొదటి ఖొస్రోను రాజ్యారంభము

543 కాంస్టాంటినోపిలులో మహామారి

552 జస్టినియను ఇటలీనుండి గాతుల దొలగించెను

565 జస్టినియను మరణము రావెన్నా రోములవిడచి, చాలవరకు ఉత్తర ఇటలీని లొంబార్డులు జయించిరి

క్రీ శ

570 మహమ్మదు జననము

579 కొస్రోసు మరణము లాంబార్డులు ఇటలీలో ప్రబలులైరి

590 రోములో మహామారివ్యాప్తి, రెండవ కొస్రోసుపాలనారంభము

610 హెరాక్లియసు రాజ్యారంభము

619 రెండవకొస్రోసు ఈజిప్టు జరూసలెం డమస్కసుం పాలించుచు హెలెస్పాంటుయొద్ద సేనలనుంచెను చీనాలో టాంగు రాజవంశారంభము

622 హిజీరా (తురుష్కులశకము మహమ్మదు మక్కానుండి మెడీనాకు వెళ్లినసాలు )

627 హెరాక్లియసు నినేవాయొద్ద పారసీకుల నోడించెను చీనాలో తైత్సంగు చక్రవర్తి అయ్యెను

* భారతదేశమున పులకేశి చాళుక్యరాజ్యవ్యాప్తి

628 రెండవ కవధు తనతండ్రి కొస్రోసును చంపి రాజయ్యెను మహమ్మదు ప్రపంచపు రాజులందరికి లేఖ లంపెను

629 మహమ్మదు మక్కాకు తిరిగివచ్చెను

632 మహమ్మదు మరణము అబూబేకరు ఖలీఫా అయ్యెను

634 యార్మకు యుద్ధము ముస్లిములు సిరియాపట్టుకొనిరి ఓమారు 2 వ ఖలీఫా అయ్యెను

635 తైత్సంగు నెస్టరుమిషనరీల కాతిథ్యమిచ్చెను

637 కడెస్సియా యుద్ధము

638 జరూసలెం ఖలీఫాకు లోబడెను

* హర్షవర్ధనుని సామ్రాజ్యవ్యాప్తి

642 హెరాక్లియసు మరణము

క్రీ. శ

648 ఒత్మాను 3 వ ఖలీఫాఅయ్యెను

655 బైజంటైను నౌకాసేనను మహమ్మదీయు లోడించిరి

668 కాంస్టాంటినోపిలున మోవిజా (ఖలీఫా) సముద్రముపై ముట్టడించెను

687 హెర్‌స్టాలు గాసియగు పెపిను అస్ట్రేషియా న్యూస్ట్రియాల నేకము చేసెను

711 ఆఫ్రికానుండి మహమ్మదీయసేన స్పెయినులోనికి దాడిసల్పెను

715 ఖలీఫా (1 వ వాలిదు) సామ్రాజ్యము స్పెయినునుండి చీనావరకు వ్యాపించెను

717-18 వాలిదు కుమారుడు సులైమనుకు కాంస్టాంటినోపిలు లొంగలేదు

732 చార్లెసు మార్టెలు తురకల పోయిటీర్సుయొద్ద నోడించెను

751 పెపిను ఫ్రెంచిరాజుగా నభిషిక్తుడయ్యెను

768 పెపిను మరణము

771 చార్లిమను ఏకరాజయ్యెను

774 చార్లమను లంబార్డీజయించెను

786 హారూన్-అల్-రషీద్ బగ్దాదులో ఖలీఫా అయ్యెను (809 వరకుండెను)

795 3 వ లియో పోపయ్యెను (816 వరకుండెను)

800 చార్లమనుకు పోపు పట్టాభిషేకము చేసెను

802 చార్లమను యొద్ద రక్షితుడైయుండిన ఎగ్బర్టు (ఇంగ్లండులోని) వెస్సెక్సు రాజయ్యెను

810 బల్గేరియా రాజగు క్రము నిసెఫరసు చక్రవర్తినోడించి చంపెను

క్రీ త

814 చార్లమను మరణము

828 ఎగ్బర్టు ఇంగ్లండు కంతకు మొదటిరాజయ్యెను

848 లూయీ మరణము కార్లవింగుల సామ్రాజ్య విచ్ఛిత్తి (962 వరకు క్రమమగు పవిత్ర రోమకచక్రవర్తులులేరు )

850 ఔత్తరుడగు రురికు (రష్యా స్థాని) నొవగొరడ్ కీఫ్ లల రాజయ్యెను

852 బోరిసు బల్గేరియాకు మొదటి క్రైస్తవరాజయ్యెను

865
904 } ఔత్తరులగు రష్యుల నౌకలు కాంస్టాంటినోపిలును ముట్టడించెను.

912 దోపిడిదారగు రోల్ఫ నార్మండీ అధిపుడయ్యెను

919 హెన్రి ది పౌలరు జర్మనీ రాజయ్యెను

936 హెన్రి తరువాత 1 వ ఒట్టో జర్మని రాజయ్యెను

941 రష్యానౌకలు వరల కాంస్టాంటినోపిలు ముట్టడించెను

962 జర్మనీరాజగు 1 వ ఒట్టో పోపుచే మొదటిసాక్సను చక్రవర్తిగా నభిషిక్తుడయ్యెను

987 హుకాపె ఫ్రెంచిరాజయ్యెను (ఫ్రెంచి) కార్లవింగువంశాంతము.

1016 ఇంగ్లండు డెన్మార్కు, నార్వేలకు కన్యూటు రాజయ్యెను

1043 రష్యానౌకలు కాంస్టాంటినోపిలు ముట్టడించెను

1066 ఇంగ్లండును నార్మండీ సామంతుడగు విలియము జయించెను

1071 సెల్జుకు తురుష్కులక్రింద ఇస్లాము బలీయమయ్యెను మెలాగ్గర్డు యుద్ధము

1078 1085 హిల్డెబ్రాండు (7 వ గ్రిగరీ) పోపయ్యెను

1084 రాబర్టు గిస్కార్డు (నార్మను) రోమును దోపిడిచేసెను

క్రీ శ

1087-99 2 వ అర్బను పోపు

1095 2 వ అర్బను క్లెర్మంటుయొద్ద మొదటి మతయుద్ధ మేర్పాటు చేసెను

1096 ఆమతయోధులు హతులైరి

1099 బోయిలను రాజగు గాడ్ఫ్రే జెరూసలం పట్టుకొనెను

1147 రెండవక్రైస్తవ మతయుద్ధము

1169 సలాదీను ఈజిపు సుల్తానయ్యెను

1176 పోపు (3 వ అలెగ్జాండరు) సర్వాధికారమును ఫ్రెడరికు బార్బరోసా (వెనిసుయొద్ద) అంగీకరించెను

1187 సలాదీను జెరూసలెమును పట్టుకొనెను

1189 మూడవ క్రైస్తవమతయుద్ధము

1198 స్థాణ్వీశ్వరమున మహమ్మదుగోరి పృథ్వీరాజు నోడించెను హిందూరాజ్య క్షీణతారంభము

1198-1216 3 వ ఇన్నొసెంటు పోపయ్యెను సిసిలీరాజగు (4 ఏండ్ల వయస్సుగల) 2 వ ఫ్రెడరికు పోపు పోషణలో నుండెను

1202 4 వ దండు మతయోధులు ప్రాచ్యసామ్రాజ్యము ముట్టడించిరి

1204 కాంస్టాంటినోపిలును లాటినులు పట్టుకొనిరి

1214 చెంగిజ్ఖాను పెకినుపురమును పట్టుకొనెను

1226 అస్సిసినివాసి అగు సెంటుఫ్రాంసిస్ మరణము

1227 చెంగిజ్ఖాను కాస్పియను సముద్రముమొదలు శాంతసముద్రము వరకుపాలించి చనిపోయెను ఒగ్డైఖాను అనంతరాధిపుడయ్యెను

1228 2 వ ఫ్రెడరికు 6 వ మతయుద్ధ మారంభించి జెరూసలెం సంపాదించెను

క్రీ శ

1240 మంగోలులు కీవ్ పురము నశింపజేసి, రష్యాను వశము చేసుకొనిరి

1241 సైలీషియాలో లిగ్నిజ్ వద్ద మంగోలుల విజయము

1250 హోహెన్‌స్టాఫెను వంశపు చివర రాజగు 2 వ ఫ్రెడరికు పోయెను.

1251 మంగూఖాను మంగోలు చక్రవర్తి యాయెను కుబ్లైఖాను చీనాకు సామంతుడయ్యెను

1258 హులగుఖాను బాగ్దాదు పురమును బట్టుకొని నశింపజేసెను

1260 కుబ్లైఖాను సామ్రాజ్యాధిపుడాయెను

1261 గ్రీకులు లాటినులనుండి తిరుగ కాంస్టాంటినోపిలు పురమును రాబట్టుకొనిరి

1273 హాబ్సుబర్గు వంశీయుడగు రుడోల్ఫు చక్రవర్తిగా ఎన్నుకొనబడెను. స్విట్జర్లండు ప్రజలు తమ సమిష్టిరాష్ట్రము నేర్పరచుకొనిరి

1280 కుబ్లైఖాను చీనాలో యువాను వంశ రాజ్యము స్థాపించెను

1292 కుబ్లైఖాను మరణము

1298 విజ్ఞానసూచకుడగు రోజరుబేకను మరణము

1348 యూరపులో మహామారిచే అనేకుల మరణము

1360 చీనాలో మంగోలు రాజ్యముపోయి 1644 వరకు మింగువంశపాలన జరిగెను

1377 పోపు 11 వ గ్రెగరీ రోమునకు తిరుగ చేరెను

1378 క్రైస్తవమతపీఠ విభాగము 6 వ అర్బనుడు రోములోను 7 వ క్లిమెంటు అవిగ్నన్‌లోను, పోపులైరి

1398 'హస్సు' ప్రేగులో విక్లిఫ్ పక్షమతము బోధించెను

1414_1418 కాంస్టాంటులో మతసభ, హస్సును దహింపజేసి చంపుట (1415)

క్రీ శ

1417 మతపీఠవిభాగ మంతమొందెను

*1450_55 యూరపు (జర్మనీ) లో ముద్రణారంభము

1453 2 వ మహమ్మదురాజు నాయకత్వమున తురుష్కులు కాన్‌స్టాంటి నోపిలుపురము పట్టుకొనిరి

1480 3 వ ఇవాను (మాస్కో అధిపుడు) మంగోలులనుండి స్వతంత్రత నొందెను

1481 ఇటలీపై దాడివెడల బోవుచుండగ 2 వ మహమ్మదు (తుర్కీ సుల్తాను) మరణము

1486 'డయజు' దక్షిణాఫ్రికా దక్షిణాగ్రముచుట్టి హిందూమహాసముద్రము చేరెను

1492 కొలంబసు అట్లాంటిక్‌సముద్రము దాటి అమెరికా చేరెను

1493 మొదటి మాక్సిమిలియను చక్రవర్తి ఆయెను

1498 వాస్కోడగామా దక్షిణాఫ్రికా దక్షిణాగ్రముచుట్టి భారత దేశము వచ్చెను

1499 స్విట్జర్లండు స్వతంత్ర రిపబ్లిక్ అయ్యెను

1500 5 వ చార్లెసు జననము

1509 8 వ హెన్రి ఇంగ్లండు రాజయ్యెను

1513 10 వ లియో పోపయ్యెను

1515 1 వ ఫ్రాంసిసు ఫ్రెంచిరాజయ్యెను

*1517 జర్మనీలో ప్రాటెస్టంటు మతారంభము

5150_66 సులైమను మహాశయుడు సుల్తానయి, బాగ్దాదునుండి హంగరీ వరకు పాలించెను 5 చార్లెసు చక్రవర్తి అయ్యెను

1526 భారతదేశమున బాబరు (మొదటి) పానిపట్ యుద్ధముగెల్చి, ఢిల్లీ పట్టుకొని, మొగలు సామ్రాజ్యము స్థాపించెను

క్రీ శ

1527 ఇటలీలో జర్మను సేవలు బోర్బను సేనాని నాయకత్వమున రోమును కొల్లగొట్టెను

1529 సులైమాను వియన్నాపురమును ముట్టడించెను

1530 5 వ చార్లెసు పోపుచే నభిషిక్తుడయ్యెను 8 వ హెన్రీ పోపు సంస్థతో కలహమారంభించెను

1539 యేసుసమితి స్థాపన

1546 మార్టిను ల్యూథరు మరణము

1547 4వ 'ఇవాను' 'జారు' (రష్యా చక్రవర్తి) బిరుదు వహించెను

1556 5 వ చార్లెసు రాజ్యత్యాగము ఇగ్నేషియసు మరణము

1556-1605 హిందూస్థానమున అక్బరు (మొగలు చక్రవర్తి) పాలనము

1558 5 వ చార్లెసు మరణము

*1565 తాలికోట యుద్ధము

1566 సులైమాను మహాశయుని మరణము

1603 1 వ జేమ్సు బ్రిటను రాజయ్యెను

1620 అమెరికాలోని 'న్యూప్లిమత్' కు 'మేఫ్లవర్' అను పడవపై ఆంగ్లేయులు వలస మొదలిడిరి అచట జేమ్సుటవునులో నీగ్రో బానిసల దిగుమతి ఆరంభము

1625 1 వ చార్లెసు ఇంగ్లండు రాజు

1626 సర్ ఫ్రాన్సిస్ బేకను వెర్యులం ప్రభువు) మరణము

1643 14 వ లూయీ (ఫ్రాన్సులో) 72 యేండ్ల పాలనారంభము

1644 చీనాలో మింగువంశము స్థానమున మంచూవంశరాజ్య మారంభించెను

క్రీ శ

1640 వెస్ట్ ఫేలియా సంధి, అందుచే హాలండ్ స్విట్జర్లండులలో రిపబ్లికు పాలన స్థిరపరుపబడెను ప్రష్యాప్రముఖమయ్యెను. ఫ్రాంసు యుద్ధము, ఫ్రెంచిరాజు జయము

1649 1 వ చార్లెసు (ఇంగ్లీషు రాజు) శిరచ్ఛేదము

1658. ఔరంగజేబు (మొగలు చక్రవర్తి) రాజ్యారంభము ఇంగ్లండులో క్రామ్ వెల్ మరణము

1660 2 వ చార్లెసు (ఇంగ్లండు) రాజ్యారంభము

1674 (అమెరికాలో) న్యూ ఆంస్టర్డమ్ బ్రిటిషువారికి స్థిరపడి, న్యూ యార్కు అను పేరొందెను

*1680 ఛత్రపతి శివాజీ పట్టాభిషేకము

1683 వియన్నాపై తురుష్కుల కడపటి ముట్టడిని పోలండురాజగు 2వ జాను ఆపెను

1689_1725 రష్యాలో పీటరు మహాశయుడు చక్రవర్తిగ పాలించెను

1701 1 వ ఫ్రెడరికు ప్రష్యా రాజయ్యెను

1707 ఔరంగజేబు మరణము మొగలు సామ్రాజ్య విచ్ఛిత్తి కారంభము

1713 ప్రష్యాలో ఫ్రెడరిక్ మహాశయుని జననము

1715 ఫ్రాంసులో 15 వ లూయీ పాలనారంభము

*1748 మూడవ పానిపట్టు యుద్ధము

1755_63 అమెరికాలోను భారతదేశమందును అధికారముకై ఇంగ్లీషు ఫ్రెంచివారలయుద్ధము ఫ్రాంసు, ఆస్ట్రియా, రష్యాలు మిత్రులైరి బ్రిటను ప్రష్యా ఏ మయ్యెను (ఏడేండ్లయుద్ధము)

*1757 ప్లాసీయుద్ధము

*1758 చెందుర్తియుద్ధము ఆంధ్రదేశపు ఉత్తరసర్కారులు ఫ్రెంచి వారినుండి ఇంగ్లీషువారి వశమయ్యెను

క్రీ శ

1759 ఇంగ్లీషుసేనాని "వుల్ఫ్" కనడాలోని క్విబెక్ను పట్టుకొనెను.

1760 3 వ జార్జి బ్రిటిషు రాజయ్యెను

1763 పారిసుసంధి, కనడా ఇంగ్లీషువారికి చేరెను బ్రిటిషువారు భారత దేశమున ప్రబలులైరి

1769 నెపోలియన్ బోనపార్ట్ జననము

*1773 భారతదేశమున బ్రిటిషు గవర్నరు జనరలుల పాలనారంభము

1774 (ఫ్రాంసులో) 16 వ లూయీ రాజ్యారంభము

1776 అమెరికా సంయుక్తరాష్ట్రముల స్వాతంత్ర్యప్రకటనము

1783 బ్రిటను కు సంయుక్తరాష్ట్రములకు సంధి

1787 ఫిలడల్ఫియా సభవారు అమెరికా సంయుక్త రాష్ట్రములకు ఫెడరల్ రిపబ్లిక్ పాలనము నిర్ణయించిరి ఫ్రాంసుదివాలాస్థితి

1788 న్యూయార్కులో సంయుక్తరాష్ట్రముల కాంగ్రెసు ప్రథమ సమావేశము

1789 ఫ్రెంచి ప్రజాసభయేర్పడెను బాస్టైలుకోటను ప్రజలుపట్టుకొనిరి

1791 ఫ్రెంచిరాజు వారెన్నకు పారిపోయెను

1792 ఫ్రాంసుకు ఆస్ట్రియా ప్రష్యాలతో సమరారంభము వాల్మీ యుద్ధము ఫ్రాంసు రిపబ్లికు ఆయెను

1793 (ఫ్రెంచిరాజగు) 16 వ లూయీకి శిరచ్ఛేదము

1794 రాబస్పియరు శిరచ్ఛేదము జాకోబిన్ రిపబ్లిక్ అంతము

1795 ఫ్రాంసులో డైరక్టరుపాలన విప్లవము నణచి నెపోలియను సేనానాయకుడై ఇటలీ జయింపవెళ్లెను

1798 నెపోలియను ఈజిప్టుపయనము, నైలుయుద్ధము

1799 నెపోలియను వచ్చి, ఫ్రాంసులో సర్వాధికారి ఆయెను

క్రీ శ

1804 నెపోలియను చక్రవర్తిఅయ్యెను 2 వ ఫ్రాంసిసు 1805 లో ఆస్ట్రియా చక్రవర్తి బిరుదువహించి, 1806 లో 'పవిత్రరోమక చక్రవర్తి' బిరుదు వదిలెను

1806 జినాయుద్ధమున నెపోలియను ప్రష్యనుల నోడించెను

1808 నెపోలియను తనసోదరుడగు జోసెఫ్‌ను స్పెయినురాజుగాజేసెను.

1810 స్పెయినుపాలనమందలి అమెరికా రాజ్యములు స్వతంత్ర రిపబ్లికు లయ్యెను

1812 నెపోలియను మాస్కో దండయాత్రనుండి మరలెను

1814 నెపోలియను రాజ్యత్యాగము 18 వ లూయీ ఫ్రెంచిరాజ య్యెను

1824 10 వ ఛార్లెసు ఫ్రెంచిరాజయ్యెను

1825 రష్యాలో 1 వ నికొలాసు ప్రభుత్వారంభము మొదటి రైలు (ఇంగ్లండులో స్టాక్టనునుండి డార్లింగ్టను వరకు)

1827 నవరినోయుద్ధము

1829 గ్రీసు స్వతంత్రమయ్యెను

1830 లూయీ ఫిలిప్ (ఫ్రెంచిరాజు) 10 వ ఛార్లెసును తొలగించెను. బెల్జియం హాలండునుండి విడెను 'సాక్సికోబర్గ గోతా' నాయకుడగు లియోపాల్డ్ ఆదేశము (బెల్జియం) రాజయ్యెను రష్యా అధీనమగు పోలండు తిరుగుబాటు చసినను వ్యర్థమయ్యెను

1835 'సాంఘికవాద' ప్రశంసారంభము

1837 విక్టోరియా రాణీ పాలనారంభము

1840 విక్టోరియారాణికి ఆల్బర్టుయువరాజుతో వివాహము

1852 3 వ నెపోలియను ఫ్రెంచిరాజయ్యెను

క్రీ శ

1854-56 క్రిమియాను సమరము

1856 రష్యాలో 2 వ అలెగ్జాండరు పాలనము

*1857 భారతదేశమున సిపాయీల యుద్ధము

*1858 భారతదేశమున బ్రిటిషు ప్రభుత్వపు ప్రత్యక్షపాలనారంభము

1861 విక్టర్ ఇమాన్యుయల్ ఇటలీ రాజయ్యెను అబ్రహాంలింకను అమెరికా సంయుక్తరాష్ట్రముల అధ్యక్షుడయ్యెను అచట అంతర్యుద్ధము మొదలిడెను

1865 అప్పమటక్సుయొద్ద అమెరికనుల దక్షిణసేన సంయుక్తపక్షముకు లోబడెను జపానుకు ప్రపంచముతో సంబంధ మేర్పడెను

1870 3 వ నెపోలియను (ఫ్రెంచిరాజు) జర్మనీపై యుద్ధమారంభించెను

1871 పారిసు జర్మనులకు లోబడెను ప్రష్యారాజు జర్మనుచక్రవర్తి అయెను ఫ్రాంక్‌ఫర్టు సంధి

1878 బెర్లినుసంధి, అంతట 36 ఏండ్లు పశ్చిమయూరపులో సాయుధశాంతి

*1885 భారతదేశమున జాతీయమహాసభారంభము

1888 2 వ ఫ్రెడరికు, తరువాత 2 వ విలియం, జర్మను చక్రవర్తులు

*1894-95 చీనాజపాను యుద్ధము

*1899-1905 భారతదేశమున కర్జనుప్రభువు పాలనము జాతీయోద్యమారంభము బోయరుయుద్ధము

*1900 చీనాలో బాక్సరు తిరుగుబాటు

1904-5 రష్యాజపాను యుద్ధము కొరియా జపానీయుల వశమయ్యెను

1912 చీనా రిపబ్లికు అయెను

1914 యూరపు మహాసంగ్రామ మారంభించెను

క్రీ శ

1917 రష్యాలో విప్లవములు, అచట బొల్షివికు రాజ్యస్థాపనము

*1918 మహాయుద్ధసమాప్తి

*1919 భారతదేశమున రాజ్యాంగసంస్కరణము, అశాంతి, వర్సైల్సుసంధి

1920 నానాజాతిసమితి మొదటి సమావేశము అందు జర్మనీ, ఆస్ట్రియా, రష్యా, టర్కీలకు స్థానము లేకుండెను అమెరికా సంయుక్త రాష్ట్రము అందుచేరలేదు

1921 జాతిసమితిని ధిక్కరించి గ్రీకులు టర్కీపై యుద్ధముచేసిరి

* భారతదేశమున అసహాయోగారంభము టర్కీ రిపబ్లిక్కుస్థాపనము.

1922 ఆసియా మైనరులో టర్కీవారు గ్రీకులనోడించిరి

* ఐరిషుఫ్రీస్టేటు రాజ్యాంగమేర్పడెను

*1923 టోకియో భూకంపము

1924 (రష్యాలో) లెనిను మరణము

*1925 పర్షియాలో జాతీయసభవారప్పటి షాను తొలగించి, రెజా ఖానును రాజుచేసిరి

*1926 జపాను షాంఘైనగరము ముట్టడించెను

1928 రష్యాలో అయిదేండ్ల కార్యక్రమము మొదలు

*1929 అఫ్గనిస్థాన విప్లవము అమానుల్లా పదత్యాగము

1930 జర్మను ప్రజాసభలో హిట్లరు కక్ష ఆరంభము

* భారతదేశమున సవినయ శాసన భంగము

*1931 స్పెయిను ప్రజాతంత్ర రాజ్యమాయెను
జపాను మంచూరియా జహాలులపై దండయాత్ర చేసెను, గాంధీ-ఇర్విను యేర్పాట్లు, ఇంగ్లండులో జాతీయప్రభుత్వారంభము

క్రీ శ

1932 జర్మనీలో నాజీప్రభుత్వము, హిట్లరు అధికారప్రాప్తి
*'మంచూకో' రాజ్యము ఏర్పడెను
జపాను జాతిసమితి వదలెను
*భారతదేశమున మరల సత్యాగ్రహాయుద్ధము

*1933 హిట్లరు జర్మనీలో సర్వాధికారి ఆయెను   లండనులో ప్రపంచార్థికసభ   అమెరికా సంయుక్త రాష్ట్రమున రూస్వెల్టు పాలనారంభము   జర్మనీ జాతిసమితిని వదలెను

*1934 భారతదేశపు బీహారులో భూకంపము   జర్మనీలో అధ్యక్షుడు హిండెన్బర్గు మరణము   సోవియట్ రష్యా నానాజాతిసమితిలో జేరెను   యూరపులో అయుద్ధనిరోధసభ నిల్చిపోయెను

*1935 సార ప్రాంతము జర్మనీలో చేరెను   రష్యా ఫ్రాంసులసంధి హిట్లరు వర్సైల్సు సంధి నిరాకరించెను, జర్మనీయందు బహిరంగముగ ఆయుధవృద్ధిని ఆరంభించెను   క్వెట్టాభూకంపము
*అబిసీనియాపై ఇటలీ దండయాత్ర

1936 అబిసీనియా పతనము
చీనాలో అంతర్యుద్ధము
జర్మనీ జపానుల రహస్యసంధి
స్పెయిను ఎన్నికలలో ప్రజాపక్షజయము, ఫ్రాంకో తిరుగుబాటు
జర్మనీఇటలీలు ఫ్రాంకో ఆధిపత్యమంగీకరించుట
రష్యను వైమానికులు ఉత్తరధ్రువముమీదుగా అమెరికా చేరి మరలివచ్చిరి
ఉత్తరఅమెరికా సంయుక్తరాష్ట్రములో రూసెల్టు మరల అధ్యక్షుడుగ ఎన్నుకొనబడెను

క్రీ త

* 1937 రష్యాలో నూతనరాజ్యాంగ నిర్మాణము

జపాను ఇటలీ జర్మనిల రహస్యసంధి

స్పెయిను అంతర్యుద్ధములో ఇటలీ జర్మనీలు విద్రోహులకు ప్రత్య

క్షసహాయము చేసిరి జాతిసమితివారి తటస్థత

ఐర్లండు "ఈర్" అను పేర స్వతంత్రరాజ్యమగుట

భారతదేశమం ఎన్నికలలో కాంగ్రెసువిజయము

బర్మాను విడదీయుట

చీనా జపాను యుద్ధారంభము

పాలస్టైయిను విభజన, అరబ్బుఅల్లరులు

షాంఘైపై ముట్టడి

*1938 బ్రిటిషు ఫ్రెంచివారలు, అబిసీనియాలో ఇటలీ అధిపత్యమంగీ

కరించిరి

జర్మనీ ఆస్ట్రియాను ఆక్రమించుట జెకోస్లవేకియాతో తగవు

బ్రిటిషువారు ఇటలీతో మధ్యధరాసముద్ర విషయమున సంధి

[ఈపట్టికలో '*' గురుతుంచిన సంగతులు మూలమునలేవు

అవి ఇందు అదనముగ చేర్చబడినవి ]

## అనుబంధము 2

## ప్రపంచపు స్థితిగతులు

| | | |
|---|---|---|
| ప్రపంచపు విస్తీర్ణము | 19,69,50,000 | చ. మైం. |
| భూమి ,, | 5,75,10,000 | ,, |
| నీరు ,, | 13,94,40,000 | ,, |
| సముద్రములోని దీవులు | 19,10,000 | ,, |
| భూమిపైనున్న సరస్సులు, నదులు | 10,00,000 | ,, |
| ఫలప్రదమగు భూములు | 3,30,00,000 | ,, |
| ఎడారులు | 50,00,000 | ,, |
| సముద్రములు — | | |
| శాంతమహాసముద్రము | 6,86,34,000 | ,, |
| అట్లాంటిక్ ,, | 4,13,21,000 | ,, |
| హిందూ ,, | 2,93,40,000 | ,, |
| అంటార్కిటిక్ ,, | 60,00,000 | ,, |
| ఆర్కిటిక్ ,, | 40,00,000 | ,, |
| ఖండములు — | | |
| ఆసియా | 1,70,00,000 | ,, |
| ఆఫ్రికా | 1,15,62,000 | ,, |
| ఉత్తరఅమెరికా | 80,00,000 | ,, |
| దక్షిణఅమెరికా | 68,00,000 | ,, |
| ఒషేనియా (ఆస్ట్రేలియావగైరా) | 40,00,000 | ,, |
| యూరపు | 37,50,000 | ,, |
| ధ్రువప్రదేశములు | 62,05,000 | ,, |

| | విస్తీర్ణము, చ మైళ్లు | జనసంఖ్య | చ మై 1 కి సాంద్రత | రాజధాని |
|---|---|---|---|---|
| ఆసియా — | | | | |
| రష్యా (ఆసియాలో భాగము) | 67,50,000 | 5,40,00,000 | 8 | |
| చీనాసామ్రాజ్యము | 30,00,000 | 40,00,00,000 | 105 | నాన్కిన్ |
| భారతదేశము | 18,00,000 | 35,29,86,876 | 195 | ఢిల్లీ |
| తిబెత్తు | 7,50,000 | 30,00,000 | 4 | లాసా |
| డచ్చివారి తూర్పుఇండియా దీవులు | 7,33,642 | 6,07,31,000 | 83 | బటేవియా |
| పర్షియా | 6,30,000 | 1,00,00,000 | 16 | టెహరన్ |
| తుర్కీ | 4,10,000 | 1,40,00,000 | 35 | అంగోరా |
| జపాను | 2,60,800 | 8,40,00,000 | 469 5 | టోకియో |
| ఆఫ్ఘనిస్థానము | 2,45,000 | 63,10,000 | 25 | కాబూలు |
| సయాం | 2,00,148 | 1,15,06,200 | 57 | బాంగ్కాక్ |
| ఇరాకు | 1,50,000 | 30,00,000 | 20 | బాగ్దాదు |

| | | | | |
|---|---|---|---|---|
| మలయా | 31,000 | 35,00,000 | 113 | సింగపూరు |
| సింహళము | 25,000 | 45,00,000 | 180 | కొలంబో |
| ఆఫ్రికా — | | | | |
| ఈజిప్టు | 3,86,000 | 1,40,00,000 | 38 | కైరో |
| సూడాన్ | 10,00,000 | 60 00,000 | 16 | ఖార్టూం |
| దక్షిణాఫ్రికారాజ్యసమితి | 4,87,800 | 80,00,000 | 18 1 | ప్రిటోరియా కేప్ టౌను |
| అబిసీనియా | 3,50,000 | 1,00,00,000 | 28 5 | అడిస్అబాబా |
| మొరాకో | 3,14,000 | 50,00,000 | 16 | ఫెజ్ |
| ఉత్తరఅమెరికా — | | | | |
| కనడా | 35,47,230 | 99,40,000 | 2 9 | ఒట్టావా |
| సంయుక్తరాష్ట్రములు | 30,27,000 | 12,26,98,000 | 41 | వాషింగ్టను |
| మెక్సికో | 7,69,000 | 1,64,00,000 | 21 | మెక్సికో |
| దక్షిణఅమెరికా — | | | | |
| బ్రెజీలు | 33,00,000 | 3,06,50,000 | 7 5 | రియో-డి జనీరో |



| | | | | |
|---|---|---|---|---|
| ఆర్జంటైనా | 15,46,655 | 1,00,00,000 | 11 3 | బయోనిస్ ఐర్స్ |
| బొలివియా | 6,00,000 | 28,00,000 | 4 7 | ఎపాజ్ |
| వెనెజూలా | 3,63,730 | 30,27,000 | 8 3 | కరాకాస్ |
| పెరూ | 3,52,000 | 55,00,000 | 15 6 | లిమా |
| చిల్లీ | 2 90,000 | 40,00,000 | 14 | సాంటియాగో |
| యూరపు — | | | | |
| రష్యా (యూరపులో) | 14,92,000 | 10,81,00,000 | 63 8 | మాస్కో |
| యుగోస్లావియా | 2,48,0[illegible]0 | 1,30,00,000 | 52 4 | బెల్గ్రేడ్ |
| ఫ్రాన్సు | 2,13,000 | 4,00,00 000 | 193 8 | పారిసు |
| స్పెయిను | 1,96,700 | 2,17,00,000 | 121 3 | మాడ్రిడ్ |
| స్వీడను | 1,73,000 | 60,74,000 | 35 | స్టాక్హోం |
| పోలండు | 1,50,000 | 2,70,00,000 | 214 5 | వార్సా |
| రుమేనియా | 1,60,000 | 1,80,00,000 | 112 | బుఖారెస్టు |
| నార్వే | 1,24,000 | 27,89,000 | 22 5 | ఓస్లో |
| జర్మనీ | 1,81,000 | 6,60,00,000 | 360 | బెర్లిన్ |
| ఆస్ట్రియా | 32,369 | 66,78,000 | | వియన్నా |

| | | | | |
|---|---|---|---|---|
| ఇటలీ | 1,20,000 | 4,20,00,000 | 344 | రోము |
| గ్రేట్ బ్రిటను, ఐర్లండు | 95,030 | 4,45,00,000 | 485 1 | లండను |
| జెకోస్లవేకియా | 54,600 | 1,43,00,000 | 262 | ప్రేగు |
| గ్రీసు | 49,000 | 70,00,000 | 143 | ఆథెన్సు |
| బల్గేరియా | 40,000 | 55,00,000 | 137 | సోఫియా |
| హంగరీ | 86,180 | 80,00,000 | 222 | బుడాపెస్టు |
| పోర్చుగలు | 85,500 | 64,00,000 | 180 | లిస్బను |
| ఐరిషుఫ్రీస్టేటు | 26,600 | 30,00,000 | 117 | డబ్లిను |
| స్విట్జర్లండు | 15,950 | 40,00,000 | 243 | బెర్న్ |
| డెన్మార్కు | 15,000 | 34,35,000 | 229 | కోపెన్హేగను |
| నెదర్లండురాజ్యము | 12,760 | 75,17,000 | 605 | హేగు |
| బెల్జియం | 11,400 | 76,00,000 | 697 5 | బ్రసెల్సు |
| ఆస్ట్రేలియా | 30,00,000 | 60,00,000 | 2 2 | కాన్బెర్రా |
| న్యూజీలండు | 1,05,000 | 14,61,000 | 14 5 | వెల్లింగ్టను |



కొన్నిముఖ్య దేశముల జాతీయసంపద, సాలుకు మ 1 కి దామాషా ఆదాయము

| దేశము | జాతీయసంపద రూప్యములు | సాలుకు తల 1 కి దామాషా ఆదాయము రూప్యములు |
|---|---|---|
| అమెరికా సంయుక్తరాష్ట్రములు | 32,080 కోట్లు (1922) | 2,247 (1928) |
| బ్రిటిషు దీవులు | 11,920 ,, (1925) | 1,209 (1929) |
| ఫ్రాంసు ... | 6,000 ,, (1925) | 603 (1928) |
| జర్మనీ | 5,950 ,, (1925) | 570 (1928) |
| రష్యా సోవియటుసమితి | 5,000 ,, (1924) | 144 (1925) |
| భారత దేశము (బ్రిటిషు పరగణాలు) | 4,500 ,, (1922) | *80 (1931) |
| స్పెయిను | 4,21) ,, (1928) | 551 (1920) |
| కెనడా | 2,768 ,, (1927) | 1,787 (1927) |

* సర్, ఎమ్ విశ్వేశ్వరయ్యగారి లెక్క—ననుసరించి.

| దేశము | జాతీయసంపద రూప్యములు | సాలుకు తల 1 కి దామాషా ఆదాయము రూప్యములు |
|---|---|---|
| ఇటలీ | 2,500 క్రోట్లు (1925) | 345 (1927) |
| పోలండు | 1,400 ,, (1928) | 222 (1928) |
| జెకోస్లవేకియా | 994 ,, (1923) | 516 (1925) |
| ఆస్ట్రేలియా | 600 ,, (1917) | 1,431 (1924) |
| డెన్మార్కు | 536 ,, (1928) | 801 (1927) |
| జపాను | 511 ,, (1928) | 198 (1925) |
| హంగరి | 315 ,, (1924) | 839 (1927) |
| దక్షిణాఫ్రికాసమితి | 300 ,, (1917) | 336 (1923) |

## ముఖ్యమతములు

| | | |
|---|---|---|
| క్రైస్తవులు — | | |
| రోమనుకాతలికులు | 33,15,00,000 | |
| ఛాందసకాతలికులు | 11,40,00,000 | 65,24,00,000 |
| ప్రాటెస్టంటులు | 20,69,00,000 | |
| కంఫ్యూషియను మతస్థులు | | †35,06,00,000 |
| మహమ్మదీయులు | | 25,93,23,000 |
| హిందువులు | | 23,01,50,000 |
| బౌదులు | | †15,01,80,000 |
| ఆదిమజనులు | | 13,56,50,000 |
| షింటోమతస్థులు | | 2,50,00,000 |
| యూదులు | | 1,61,30,000 |
| ఇతరులు | | 5,08,70,000 |

## ముఖ్యజాతులు

| | |
|---|---|
| ఆర్యులు | 72 50,00,000 |
| మంగోలియనులు | 68,00,00,000 |
| మలయనులు | 10,45,00,000 |
| సెమిటికులు | 10,00,00,000 |
| నీగ్రోలు | 10,00,00,000 |
| ఎర్రఇండియనులు | 3,00,00,000 |

† చీనులలో ఎంతమంది కంఫ్యూషియనులో, ఎంతమంది బౌద్ధులో తెలియుటకు సరియగు లెక్కలులేవు

## కొన్ని ముఖ్యభాషలు

## ఆయాభాష స్వభాషగాగలవారిసంఖ్య.

| | | | |
|---|---|---|---|
| చీనాభాష * | రమారమి | 30 | కోట్లు |
| ఇంగ్లీషు † | ,, | 20 | ,, |
| రష్యను | ,, | 10 | ,, |
| హిందూస్థానీ § | ,, | 14 | ,, |
| జర్మను | ,, | 8 | ,, |
| జపాను | ,, | 7 | ,, |
| ద్రావిడభాషలు మొత్తం ‡ | ,, | 7 | ,, |
| బెంగాలి | ,, | 5 | ,, |
| ఫ్రెంచి | ,, | 4 | ,, |
| ఇటాలియను | ,, | 4 | ,, |

* ఇందు ఆయాప్రాంతీయములందు చాల విభేదము కలదు

† ఇంగ్లీషు సర్వఖండములందు వ్యాపించియున్నది

§ ఇందు తూర్పు పశ్చిమహిందీలలో కొంచెము భేదము కలదు గుజరాతీ, మరాతీ, బంగాళీ, ఓఢ్రము మున్నగు భాషలకు సన్నిహితము

‡ ఇందు ఆంధ్రభాషికులు 2,68,00,000

## బామూషాఆయుర్దాయము, అక్షరజ్ఞానము,

## జననమరణముల స్థితిని తెలుపు పట్టిక

| దేశము | సగటు ఆయుర్దాయం | చదువ్రాతలు నూటికి | జననము నూటికి | మరణము నూటికి |
|---|---|---|---|---|
| భారత దేశము | 23 | 8 | 3 3 | 2 7 |
| ఇటలీ | 44 | 90 | 2 3 | 1 4 |
| జపాను | 44 | 99 | 3 0 | 1.8 |
| జర్మనీ | 47 | 98 | 1 8 | 1 2 |
| ఫ్రాంసు | 47 | 94 2 | 1 6 | 1 6 |
| గ్రేటుబ్రిటను | 50 | 90 | 1 5 | 1 2 |
| స్విట్జర్లండు | 51 | * | 1 6 | 1 2 |
| అమెరికా సంయుక్తరాష్ట్రములు | 51 | 94 | 1 7 | 1 1 |
| హాలండు | 52 | 92 | 2 0 | 0 8 |
| స్వీడను | 55 | * | 1 3 | 1 1 |
| నార్వే | 56 | * | 1 4 | 1 0 |
| డెన్మార్కు | 56 | * | 1 7 | 1 1 |
| ఆస్ట్రేలియా | 57 | 92 | 1 6 | 0 9 |
| న్యూజీలండు | 67 | * | 1 6 | 0 8 |

* ఈదేశములకు సరియగు లెక్కలు దొరకలేదు కాని ఈదేశములలోను నూటికి సుమారు 90 మంది చదివినవారే

## కొన్ని ముఖ్యదేశములందు ప్రాథమికవిద్యకై తల 1కి చేయు వ్యయము

| | |
|---|---|
| డెన్మార్కు | 17—5—0 |
| అమెరికా | 16—4—0 |
| ఇంగ్లండు | 9—0—0 |
| ఫ్రాన్సు | 9—0—0 |
| జపాన్ | 7—0—0 |
| భారతదేశము | 0—2—0 |

## కొన్ని ముఖ్యదేశములలో జనుల వృత్తులు (నూటికి)

| దేశము | వ్యవసాయము | పరిశ్రమలు | వర్తకము |
|---|---|---|---|
| అమెరికా | 22 | 29 3 | 15 |
| జర్మనీ | 28 9 | 38 1 | |
| ఫ్రాన్సు | 38 3 | 31 1 | 12 9 |
| కెనాడా | 34 | 26 9 | 13 9 |
| ఇంగ్లండు | 6 4 | 40 0 | 14 0 |
| భారతదేశము | †71 2 | 11 2 | 5.0 |

†ఇందు చాలమంది వ్యవసాయదార్లపైనను ఈనాములపైనను ఆధారపడు నిరుద్యోగులు చేరియున్నారు

## అనుబంధము ౩

## పారిభాషికపదసూచి

అక్షము Axis

అంగభంగము Self-mutilation

అక్షౌహిణి Host, Huge army

అగ్నిపర్వతప్రకోపము Volcanic eruption

అచిత్ / నిర్జీవ } Lifeless, Non-living

అజీవయుగము Azoic Age

అజీవశిల Azoic rock

అత్యుజ్జ్వలము / ఉజ్జ్వలము } Incandescent

అంతర్జాతీయ International

అంతర్యుద్ధము Civil War

అంతశ్శక్తి Latent force or power

అధినివేశము Dominion

అన్వేషకులు Explorers

అమృతత్వము / నిత్యత్వము } Immortality

అమ్మవారిదేవతలు Mother Gods

అయోమయము Made of iron, Creating confusion

అరుణుడు Uranus

అల్పగ్రహములు Planetoids

అస్థిపంజరము
కంకాళము } Skeleton

ఆత్మికశక్తి Soul force

ఆదిమజ్ఞానము Primitive thought

ఆనువంశిక Hereditary

ఆయుధనిరోధము Disarmament

ఆర్థికప్రాబల్యము Economic Domination

ఆర్యజాతి Aryan race, Nordic race

ఆవిరిబండి Locomotive

ఆవిరియంత్రము Steam engine

ఆవిష్కరణము
ఆవిష్కారము } Invention or Discovery by experiments

ఆసారనిర్ఝరము Torrent formed by down pour of rain

ఆస్తిహక్కు Property right, Proprietorship

ఇతిహాసము History

ఈతతిత్తి Swimming bladder

ఉదయనరుడు Eonthropus
ఉదయశిలలు Eoliths
ఉపశాఖ Species
ఉభయచరములు Amphibia
ఉల్క Meteor
ఏకేశ్వరతత్వము Monotheism
ఐతిహ్యము Tradition of stories
ఐహికబాధలు Mortifications of the world
ఔత్తరాహులు Northmen
కక్ష Orbit
కర్బనకరము Carboniferous
కర్మకాండ Ceremonial observance
కార్ఖానాపద్ధతి Factory system
కర్ణకుహరము Ear drum
కార్మికులు Factory workmen, Labourers
కల్పము Eon, Period of several ages
కాలక్రమనిర్ణయము Chronology
కళాదేవతలు Muses (Gk)
కళాలయము Museum ( ,, )
కులీనులు Aristocrats

కూర్మయుగము Coal swamp and Reptile ages
కూర్మజాతి Newts
కృత్రిమకళ Artifice
కృషిరసాయనము Agricultural Chemistry
కొరత వేయుట Crucifixion
క్రాంతి Revolution
క్రాంతివృత్తము Course of the Orbit
ఖగోళకాంతి Stellar light
ఖండాంతరసామ్రాజ్యము Overseas empire
ఖనిజము Mineral
గచ్ఛన్నరవానరుడు Pithecanthropus Erectus
గాథామయము Mythological
గాథలు Chronicles (Biblical)
గోపరాజులు Shepherd kings
గోళప్రాయము Spheroid
గౌణము Secondary
గ్రహకుటుంబము Planetary system
చరాచరప్రాణులు Animal and vegetable beings
చాపయోడ Sailing ship
చిత్, చేతన Living

చిత్రలిపి, చిత్రాక్షరలిపి Picture writing
చిత్రాక్షరములు Heiroglyphics, Picture letters
చిల్లరజనులు Proletariat
చీడపురుగులు Trilobites
చోదన Impulse
జంతుప్రదర్శనశాల Zoological garden
జలాంతస్తంత్రులు Cables
జంతుశాస్త్రజ్ఞులు Zoologists
జాతిశాస్త్రజ్ఞులు Ethnologists
జాతిసమితి League of Nations
జాతీయసంపద National wealth
జాతీయాహంకారము National Egotism
జీవపరిణామము } Organic evolution
జీవవికాసము } Organic evolution
జీవప్రకృతిచరితము Natuial history
జీవప్రకృతిజ్ఞులు Naturalists
జీవరసాయనజ్ఞుడు Biochemist
జీవరసాయనశాస్త్రము Organic chemistry
జీవాంగతత్వజ్ఞులు Anatomists
జీవ్యంగశస్త్రచికిత్స Vivisection

జీవిప్రసవి Viviparous
జ్ఞానపునర్వికాసము Renaiscence
జ్యోతిశ్శాస్త్రము Astronomy
తత్వశాస్త్రము Philosophy
తారతమ్యగాథాశాస్త్రము Comparative Mythology
తారతమ్యభాషాశాస్త్రము Comparative Philology
తారతమ్యమతశాస్త్రము Comparative Religion
తార్కికులు Sophists (Gk)
తృణాహారి Herbivorous
త్రిమూర్తులు Trinity of Gods
దశకము Decade
దాస్యపద్ధతి Slave System
దుర్భిణి Opitical glass
దూరదర్శిని Telescope
దేవసమన్వయము Theocrasia
దేవాంశరాజత్వము System of 'God-king,
దేశద్రోహము Treason
దేహాంగసామ్యము Anatomical resemblance

దేహనాళములు, నాళములు Tissues

ద్రవ్యవిషయములు Financial and monetary matters

ధర్మము Righteousness

ధాన్యదేవత Corn God, Harvest God

ధార్మికజీవితము Religious life

ధార్మికాందోళనము Religious agitation

ధ్రువము Pole

నరతత్త్వజ్ఞుడు Anthropologist

నరవానరుడు Apeman

నవజీవయుగము Cainozoic age

నవశిలాయుగము Neolithic age

నవార్థికవిధానము New Economic Policy

నారసింహులు Neanderthalers etc

నిత్యత్వాభాసము Quasi eternal stability

నిర్జలప్రళయదశ Dry and bitter age

నిసర్గవరణము Natural selection

నీలగోధుమవర్ణులు Brunet people

నీహారము Nebula

పరమహిమము Extreme snow, inscrutable power

పరమాణువు Atom

పరిణామము Evolution
పరివర్తనము Revolution
పరిశోధనతత్వజ్ఞులు Experimental philosophers
పరిశోధనశాస్త్రము Experimental science
పరిసరము Environment
పర్వతోత్క్షేపము Mountain upheaval
పవిత్రరోమకసామ్రాజ్యము Holy Roman Empire
పాలకవర్గము Bureaucracy
పురాణజీవయుగము Palæozoic age
పురాతత్వజ్ఞులు Archeologists
పువ్వారలు Gills
పూర్వశిలాయుగము Palæolithic age
పూర్వార్ధగోళము } Old world, Eastern
పూర్వార్ధప్రపంచము } Hemisphere
పుంజీపతులు, పెట్టుబడిదార్లు Capitalists
పొరలు Strata, Layers
పొలుసులు Scales
పౌరస్వత్వము } Spirit and Rights of Citizenship
పౌరత్వభావము }
ప్రకృతిశక్తులు } Natural forces
ప్రాకృతికశక్తులు }

ప్రజసత్తాకము Democratic
ప్రగతి Progress
ప్రజాతంత్రకము Republic
ప్రతినిధిప్రభుత్వము Representative Government
ప్రథమశాఖ Primates
ప్రధాని Princeps (Roman)
ప్రభుత్వమతపీఠము State Church
ప్రభుసభ House of Lords
ప్రమ Accurate knowledge
ప్రాచీనశిథిలము Archeological remains
ప్రాతనిబంధన Old Testament
బృహద్భారతము, భారతవర్షము } Greater India
భావపరిశీలనశాస్త్రము Psycho-analysis
భావోద్రేకము High Emotion
భాషాశాస్త్రజ్ఞులు Philologists
భూతత్వజ్ఞులు Geologists
భూతత్వశాస్త్రము, భూగర్భశాస్త్రము } Geology
భూపటలము, భూమిపెచ్చు } Earth's crust

భూతలము Earth's surface
భౌతికశక్తి Mechanical power
భౌతికశాస్త్రము Physical science
భౌతికవిపర్యయము Physical upheaval
భ్రమ Fetich, Misconception
మతద్వేషి Heretic
(క్రైస్తవ) మతపీఠము / మతసంస్థ } Church (Christian)
మతమూర్ఖత Religious intolerance
మతయుద్ధము Crusade
మతశాస్త్రము Theology
మతసంస్కారము Reformation
మతహింస Religious persecution
మధ్యజీవయుగము Mesozoic age
మధ్యధరాప్రాంతము Mediterranean region.
మధ్యకాలము Middle ages
మనశ్శాస్త్రము / మనస్తత్వము } Psychology
మన్వంతరము Period of several ages
మహాగ్రీసు Magna Grecia

మహామారి Pestilence, Plague
మాంసాహారి Carnivorous
మిశ్రజాతి Mixed race
మిశ్రదేశము Egypt
మురుగుయుగము } Age of swamps
రొంపియుగము
మూర్తిపూజ Idol worship
మృగయులు Hunters
మోతశక్తి Tonnage
యవనులు Greeks, Ionians
యాంత్రికనాగరికత Mechanical civilisation
యాంత్రికపరివర్తనము Mechanical revolution
యుగము Age, Cycle
యుగసంధి Period of change of the Age
యూదులు Jews
రసవాదజ్ఞులు Alchemists
రాక్షసపుటికలు Dragon flies
రాజత్వము Monarchy
రాజవంశము Dynasty
రాజ్యాంగము Constitution.

రాజ్యాంగవేత్త Statesman
రాజ్యాంగశాస్త్రము Political science
రాద్ధాంతము Speculative theory

| | |
|---|---|
| లోహతత్త్వము<br>లోహవిజ్ఞానము | Metallurgy |

వరుణుడు Neptune
వలస Colonial

| | |
|---|---|
| వంశాస్థికజాతి<br>వెన్నెముకగల | Vertebrate class |
| వస్తువినిమయము<br>నాటా | Barter |

వాగ్మిత్వము Elocution

| | |
|---|---|
| వాస్తుశిల్పి<br>విశ్వకర్మ | Architect |

విజ్ఞులు Experts, Specialists
విజ్ఞానము Science
విద్యుత్తంత్రి Electric telegraph
విద్యుచ్ఛకటము Electric car or train
విప్లవము Revolution
విపర్యాసము Convulsion, degeneration

| | |
|---|---|
| విశ్వజనీనత | Universalism |
| విశ్వశక్తులు | Forces of the Universe |
| వైజ్ఞానికసూత్రము | Scientific theory |
| వ్యక్తిమోక్షము | Personal salvation |
| వ్యాసము | Diameter |
| శతాబ్ది | Century |
| శతపదములు | Centepedes |
| శాస్త్రీయపరిశోధకులు | Scientific researchers |
| శిలాధాతువులు | Fossils |
| శిలాజీవశేషములు | Fossils |
| శిలాద్రవము | Molten rock, lava |
| శిలాశాసనము | Rock-edict |
| శిలాశిల్పి | Sculptor |
| శిలువ | Cross (Xian) |
| శిష్టసభ | Senate, Upper House |
| శ్రమణకులు | Buddhist monks |
| సంఘర్షోష్ణము | Frictional heat |
| సంఘస్వామ్యము | Communism, Bolshevism, Sovietism |
| సంచారిజాతి | Nomadic race |

సంప్రదాయము Tradition
సర్వసమత్వసూత్రము Equalitarian Formula
సమన్వయము Assimilation
సమిష్టిప్రభుత్వము Federal Government
సమ్మేళనము Confederation
సంయుక్తరాష్ట్రము United States
సరీసృపము Reptile
సర్వజీవాంగవిజ్ఞానము Comparative anatomy
సంస్కృతి Culture
సస్తనులు Mammals
సహజసంపద Natural wealth
సహజేచ్ఛ Natural impulse
సాగరికులు Seafaring people
సాంఘికమనస్తత్వము Social Psychology
సాంఘికశాస్త్రము } Sociology
సంఘశాస్త్రము } Sociology
సామంతరాజ్యపద్ధతి Feudalism
సామ్యవాదము Socialism
సామ్రాజ్యతత్వము Imperialism
సిద్ధాంతమతములు Creed religions
సువార్త Gospel, Psalm

సూర్యపరిధి Solar penumbra

సూక్ష్మదర్శిని Microscope

సూచ్యగ్రవస్తువు Conic section

సూర్యశిలాసంస్కృతి Heliolithic culture

సౌరకుటుంబము Solar system

స్థిరవాసులు Settled people

స్వత్వము } Property
స్వం

స్వయంనిర్ణయము Self determination

స్వామ్యము Ownership

హిమప్రళయము Ice deluge

హిమమధ్యయుగము Interglacial period

హిమయుగము Ice Age

హూణులు Huns

# సవరణపట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 9 | 20 | అవిరి | ఆవిరి |
| 17 | 11 | దొంతల | దొంతరల |
| 20 | 21 | మద్రావసుద్ద | మద్రాసువద్ద |
| 21 | 18 | మూలధార | మూలాధార |
| 23 | 13 | పదతి | పద్ధతి |
| | 16 | రాదాంత | రాద్ధాంత |
| 32 | 1 | శ్వాస | శ్వాసశక్తి |
| 60 | 4 | బత్తుగా | బొత్తుగా |
| 102 | 17 | యదార్థా | యథార్థా |
| 113 | 5 | సంధిగ్ధ | సందిగ్ధ |
| | 18 | పశుపాలమున | పశుపాలనమున |
| 122 | 8 | నిల్చ | నిల్చి |
| | 18 | ప్రసాద | ప్రాసాద |
| 139 | 14 | సాన | స్థాన |
| 150 | 16 | మూలార్క | మూలార్య |
| 156 | 13 | ధృఢ | దృఢ |
| 158 | 10 | కాలము | కాలయము |

| | | | |
|---|---|---|---|
| | 14 | విష్ణు | విష్టు |
| 161 | 2 | సామ్రాజ్య | సామ్రాజ్య |
| 188 | 5 | జానులు | జ్ఞానులు |
| 192 | 14 | నూత | నూతన |
| 255 | 13 | పురాన్వ | పురాణ |
| 260 | 6 | సంధిగ్ధ | సందిగ్ధ |
| | 10 | బుదుని | బుద్ధుని |
| 265 | 18 | జానము | జ్ఞానము |
| 398 | 4 | పరాభము | పరాభవము |
| 399 | 9 | నేత్వ | నేత్ర |
| 403 | 8 | గార్ధభ | గార్దభ |
| 423 | 11 | యినుమంతేని | నినుమంతేని |
| 437 | 10 | నాకృష్ణు | నాకృష్టు |
| 458 | 18 | శిరచ్ఛేదము | శిరశ్ఛేదము |
| 465 | 12 | జాన | జ్ఞాన |
| 468 | 14 | కోపోన్మతుడై | కోపోన్మత్తుడై |
| 472 | 12 | విజానము | విజ్ఞానము |
| 478 | 11 | శిరచ్ఛేదము | శిరశ్ఛేదము |
| 484 | 4 | స్ఫర్ధ | స్పర్ధ |
| | 11 | పదతి | పద్ధతి |

| | | | |
|---|---|---|---|
| 486 | 15 | వలపి | వలన |
| 492 | 10 | చీనావారిచేతనచేతను | చీనావారిచేతను |
| 503 | 5 | ప్రయాస | ప్రయాణ |
| 510 | 12 | శిరచ్ఛేదము | శిరశ్ఛేదము |
| 511 | 8 | ,, | ,, |
| 513 | 1 | గర్విష్టి | గర్వి |
| 539 | 8 & 9 | రమామి | రమారమి |
| 547 | 10 | నాయభి | నాయకు |
| 597 | 15 | జరిగిన | జరిగి |
| 604 | 2 | ఖడ్గదారు | ఖడ్గధారు |
| | 10 | దికెన్నడు | దెన్నడు |
| 620 | 3 | కొల | కొలది |
| 622 | 16 | దాని | దానిని |
| 625 | 8 | వగైరా | వగైరాల |
| 630 | 17 | కిఅంతట | అంతట |
| 631 | 4 | కమానిసు | కమ్యూనిస్టు |
| | 9 | జాన | జ్ఞాన |
| 636 | 10 | స్వామ్యసంఘ | సంఘస్వామ్య |
| 643 | 6 | రాజ్యముల | రాజ్యములు |
| 652 | 18 | సమితివారు | సమితి |
| 654 | 9 | నాగరికతి | నాగరికత |